

శ్రీ యేరుపుచర్ల వెంకటేశ్వరరెడ్డి గారు - ధర్మపత్ని కుమారి గారు

కంచికచర్ల వాస్తవ్యులు

# మహాతపస్వి

## స్వామి సుగుణానంద గాయత్రి

రచన
**సక్కరం శ్రీనివాస్,** జర్నలిస్ట్

# అగస్త్య పీఠము

నరసింహరావు పాలెం గ్రామం, విరాళ్ళపాడు మండలం,
కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్, భారతదేశం–521 181

ముద్రణ

**రోహిత్ ప్రింటర్స్**

డో. నెం. 28–23–25, మౌలానా వీధి,
అరండల్‌పేట, విజయవాడ–520 002,
ఫోన్ : 0866–6661823

ఓం సహ నావవతు

సహ నౌ భునక్తు!

సహ వీర్యం కరవావహై ।

తేజస్వినావధీతమస్తు

మా విద్విషావహై ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

# విషయ సూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము

# 1. ముందుమాట

నా గురువు గొప్పదనాన్ని వర్ణించేందుకు చాలినంత శక్తిని నా గురువు నాకు ప్రసాదించుగాక. నేను ఆయన అద్భుత ప్రకాశం నుండి చాలా కొద్దిగా గ్రహించాను. ఆయన నా వంటి అనర్హునికి ఆశీర్వాదాలను అనుగ్రహించారు. ఈ రచన చాలా మందిని ప్రభావితులను చేసి ఈ దివ్య మార్గంలోకి ప్రవేశింపజేయుగాక! ఆయన నా ఈ మాటలను శక్తి వంతము చేయుగాక! వారి శక్తివంతమైన కృప మనపై ప్రసరించుగాక! దివ్య ప్రేరణ వలన నా అనుభవాలు స్పష్టమైనవి.

పూర్వకాలంలో ఋషులు, మునులు, యోగులు అరణ్యాలలో ప్రజా బాహుళ్యానికి దూరంగా ఏకాంతంగా గుహలలో, ఆశ్రమాలలో సత్యాన్వేషణ కోసం తపస్సు చేస్తుంటారని భారతీయ వంగ్మయాలయిన రామాయణం, మహాభారతము మరియు ఆధ్యాత్మిక గ్రంథాలలో చదివియున్నాను. కానీ ఈ 21వ శతాబ్ధంలో నా గురువుతో కలసి ది. 25-8-2017న హిమాలయాలకు ప్రయాణం చేసి వారి గురువు గారైన శ్రీమాన్ ధిరేంధర్ బాబా గారి ద్వారా ఎన్నో అద్భుతమైన విషయాలు గ్రహించాను. ప్రస్తుతం కలియుగంలో సత్యాన్వేషణ కోసం హిమాలయాలలో 21వ శతాబ్ధంలో తపస్సు చేస్తున్న ఎందరో యోగులు, సిద్ధులను కలసి ప్రత్యక్షంగా నా గురువుగారి సాధన విషయాలు తెలుసుకొనుటకు అవకాశం కల్పించినందులకు నేను చాలా గర్వపడుతున్నాను. వారు నన్ను ప్రేమించటం నా ప్రత్యేకతగా భావిస్తాను. వారు తనను తాను పూర్తిగా సమర్పించుకున్నారు. వారి భాషణ ఆత్మామృతం తప్ప వేరు కాదు. వారేమి పలికినా నీలోని ప్రశ్నకది సూటి జవాబు అవుతుంది. దైవానికి శరణం పొంది పలికే ‘వారి’ పలుకుల వలన అన్ని ప్రశ్నలు కరిగిపోతాయి.

వారి అభయం ఐహిక బాధలన్ని తొలగింపజేస్తుంది. అన్ని బంధముల నుండి విముక్తి పొంది వారు పసిపాపవలె స్వతంత్రులుగా జీవిస్తారు. వారు పరమానందులు. వారికి అధికారి లేరు, సేవకుడు లేడు, అతని స్వంతం అంటూ ఏదీ లేదు. ఒక గృహస్తుడైనా, సేవకులనైనా సమానంగా, చాలా బాగా ప్రీతిగా చూసుకునేవారు. గృహస్థుగా ఉంటూ సన్యాసిగా ఎలా ఉండవచ్చునో వారు చూపారు. ‘వారి’ అస్తిత్వము భాసమానము. యేసు, మహమ్మదులు వారి భూషణప్రాయులు.

సూర్య విజ్ఞానాన్ని, వేద విజ్ఞానాన్ని ప్రపంచానికి అందజేయుటలో విరజానందస్వామి యొక్క పాత్ర చాలా గొప్పది. దీనినే దయానంద సరస్వతి ఆ తరువాత పూజ్య గురుదేవులు శ్రీరామశర్మ ఆచార్య కొనసాగించారు. ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ఆధునిక విజ్ఞానము వలె తీర్చిదిద్దుట కొరకు శ్రీరామ శర్మ ఆచార్య పాత్ర చాలా గొప్పది. ప్రస్తుతం దక్షిణ భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కృష్ణాజిల్లా, వీరులపాడు మండలం, నరసింహారావుపాలెం గ్రామ శివారు అటవీ ప్రాంతము నందు అగస్త్య పీఠము (తపోభూమి) నందు "గాయత్రి మహాపురశ్చరణ" ది. 22 జనవరి 2018 వసంత పంచమి రోజున ప్రారంభించారు. దేవి భాగవతంలో ఏ విధంగా చెప్పారో అదే విధంగా అరణ్యంలో ఆశ్రమము కట్టుకొని ఏక వస్త్రం మీద ఉంటూ నిత్యం 6800 గాయత్రి మంత్రజపం చేస్తున్నారు. ప్రపంచ శాంతి పునరుద్ధరణ కొరకై గాయత్రి మహాపురశ్చరణ చేస్తున్న ఈ "మహాతపస్వి" ని మీకు పరిచయం చేయుటకు నాకు సద్గురువు స్వామి సుగుణానంద గాయత్రి వారి మార్గదర్శకములో ముందుకు సాగి సంరక్షింపబడి నందులకు అదృష్టవంతుణ్ణి.

శ్రీ సుగుణానంద మహర్షి వారు నాకును, 'వారి' సన్నిధిలో అనుగ్రహం పొందిన ఎందరికో దివ్యజ్ఞాన దీపిక. నాకు సమయము లభించినప్పుడంతా 'వారి' సన్నిధికి నా దేహము, బుద్ధి పరుగెట్టేది. వారి నిశ్శబ్ధం, కథాకథనాల ద్వారా ప్రతి ప్రశ్నకు జవాబు లభించేది. అన్ని బాధలు ఉపశమించేవి. అన్ని తప్పులు దిద్దబడేవి. 'వారు' ఏవిధంగా సత్యాన్ని కనుగొన్నారో ఈ పుస్తకము తెలుపగలదు. అప్పుడు, ఇప్పుడూ 'వారే' నా దివ్యజ్ఞానం. 'వారు' మీ వారూ కావచ్చు. ఈ పుస్తకం చదవటం వల్ల మీరును వారి కృపను పొందుదురుగాక.

స్వామీజీ హిమాలయాలకు వెళ్ళినప్పుడు కేదార్‌నాథ్ బ్రహ్మగృహలో చేసిన సాధన గంగోత్రి గుహలలో చేసిన సాధన తపోవనంలో చేసిన సాధనలు, ఉత్తరకాశి, బద్రీనాథ్, రిషికేష్ కొండ గుహలలో చేసిన సాధనలు మరియు శ్రీశైలం, కదళీవనం, అక్కమ్మ గుహలు, భీమునిపట్నం ఎర్రదిబ్బలలో చేసిన సాధనలు మీకు అందిస్తాను. అలాగే స్వామీజీ ఇప్పుడు చేస్తున్న గాయత్రీ మహాపురశ్చరణ అనగా గాయత్రి మంత్రమునకు 24 అక్షరాలు ఉంటాయి. అక్షరానికి లక్ష చొప్పున ఒక సంవత్సరానికి

24 లక్షల గాయత్రి మంత్రం జపము చేసి ఉదయము, సాయంత్రము యజ్ఞము చేసి ఆహార నియమాలు పాటిస్తూ స్వామీజీ తీసుకునే ఆహారము గోధుమలు ఆవుకు పెట్టి విసర్జన ద్వారా వచ్చిన గోధుమలను పిండి పట్టించి ఉదయము రెండు, సాయంత్రము రెండు చపాతీలు తీసుకుంటారు. అఖండ ధుని, అఖండ దీపంతో ఇదే విధంగా 24 సంవత్సరాలు చేస్తే "గాయత్రి మహపురశ్చరణ" అంటారు. మన స్వామీజీ చేసేది గాయత్రి మహపురశ్చరణ ప్రారంభం చేసిన తేదీ 22 జనవరి 2018న వసంతపంచమి రోజున గాయత్రి మహాపురశ్చరణ ప్రారంభం చేశారు. దేవీ భాగవతంలో ఏ విధంగా చెప్పారో అదేవిధంగా అరణ్యంలో ఆశ్రమము కట్టుకొని ఏక వస్త్రము మీద ఉంటూ నిత్యము 6800 గాయత్రి మంత్ర జపము చేస్తున్నారు. ప్రపంచ శాంతి కొరకై చేస్తున్నారు. ఇలాంటి ఒక మహా తపస్విని మీకు పరచయం చేయాలని మీకు ఈ పుస్తకం అందిస్తున్నాను. అలాగే భక్తులకు కలిగిన అనుభవాలు సేకరించి అందిస్తున్నాను. నేను స్వామీజీని వేసిన ప్రతి ప్రశ్న మిమ్మల్ని ఉద్దేశించే వేశాను. నాకు కలిగిన తృప్తి, శాంతి మీకందరికి కలగాలని ఆశిస్తున్నాను. ఈ పుస్తకాన్ని అన్ని పుస్తకాల్లా చదివి వదిలి వేయడం కాదు. నేను పరిచయం చేస్తున్న స్వామీజీ మహాయోగి 13 సంవత్సరాల వయస్సులోనే కేదార్‌నాథ్ వెళ్ళి సాధన చేసిన గొప్ప యోగి. స్వామీజీ ప్రతి మాట ఎంతో విలువైనది. సిద్ధుల గురించి విన్నాము. స్వామి సుగుణానంద గాయత్రి ఒక సిద్ధ పురుషుడు ఈ మాట నేను చెప్పడం కాదు, స్వామీజీ గురువు గారు ధీరెందర్ బాబా మాకు చెప్పారు కానీ మేము మాత్రం స్వామీజీ సిద్ధులు చూశాము. నేను ఒక్కరినే కాదు లబ్బీపేటలో (విజయవాడ) భజన పద్మమ్మ, శ్రీలక్ష్మి దత్తజయంతికి స్వామీజీని ఆహ్వానించారు. భజన పద్మమ్మ చెప్పింది ఈశ్వరుడి రూపంలో రా తండ్రి అని స్వామీజీని అడిగింది. స్వామీజీ సరే అని అన్నారు. 500లపై మంది చూస్తుండగా ముసలి రూపు ధరించి వాళ్ళందరికి దర్శన భాగ్యం కల్పించారు. అందరూ చూస్తుండగానే ఒక అరగంటలో 18 సంవత్సరాల ఒక యువకుడిగా కనిపించారని భజన పద్మమ్మ తన సంతోషాన్ని మాతో పంచుకుంది. ప్రస్తుతం మన అందరికి మార్గదర్శకులుగా ఉంటారని, మీ అందరికీ శాంతి లభిస్తుందని ఆశిస్తున్నాను.

ఇట్లు

**సక్కరం శ్రీనివాస్**

# 2. మహాతపస్వి

స్వామికి జ్ఞాన జననమైనది గురుపౌర్ణమి రోజున. బుధవారం ది. 28-07-1999 తెల్లవారు ఝామున స్వామీజీ పడుకున్నారు. ఎవరో ఒక మహాత్ముడు చిన్న గోచీ పెట్టుకొని చేతిలో ఒక కర్ర పట్టుకొని స్వామి వద్దకు వచ్చి 'నీ సమయం ఆసన్నమైనది. నీవు ఇకరా!' అని చేయి పట్టుకున్నారు. 'ఎవరు మీరు? ఎక్కడికి రావాలి అని అన్నారు. స్వామికి మెలుకువ వచ్చింది. లేచి చూస్తే రూంలో ఇద్దరు స్నేహితులు మాత్రమే ఉన్నారు. మళ్ళీ చూసి పడుకున్నారు. మళ్ళీ ఆ మహాత్ముడు వచ్చి స్వామికి గాయత్రి మంత్రం ఉపదేశం చేశారు. స్వామి వారు ఆ మహాత్ముని వెంట వెళ్ళిపోయారు, అడవిలో నడుచుకుంటూ పోతూ ఉంటే నెమళ్ళు, జింకలు, ఏనుగులు, పెద్దపులులుబీ అన్నీ కనబడుతున్నాయి. స్వామి మరియు ఆ మహాత్ముడు ఇద్దరూ కలిసి వెళ్ళి నది ఒడ్డున ధ్యానంలో కూర్చున్నారు. ప్రొద్దున 8 గంటలు అయింది. సుగుణానంద స్వామి హాస్పిటల్ డ్యూటీ సమయం అయింది. అప్పుడు స్వామీజీ హాస్పిటల్లో చేసేవారు. స్వామి స్నేహితులు ఎంత లేపినా స్వామి లేవలేదు. వారు డ్యూటీకి వెళ్ళిపోయారు. స్వామి 11 గంటలకు లేచారు. ఏదో తెలియని శాంతి, ఏదో తెలిసిందన్న ఆనందంలో ఉన్నారు. స్వామీజీ ఇంటి ఓనర్ వాళ్ళు వచ్చి, ఈరోజు గురుపౌర్ణమి మేము సత్యనారాయణ స్వామి వ్రతం చేసుకుంటున్నాము. మీరు కూడా రండి స్వామీ! అని ఆహ్వానించారు. సరే వస్తాను అని స్వామి స్నానం చేసి పాలు త్రాగి మౌనంగా రూంలో కూర్చున్నారు. స్వామి స్నేహితులు డ్యూటీనుండి వచ్చి ఏమిటి ఉదయం ఎంత లేపినా ప్రొద్దునే లేవలేదు ఏమి అయింది? ఎందుకు లేవలేదు అని అడిగారు. 'ఏమిటి ఈ రోజు పౌర్ణమి కదా ప్రతిరోజూ దేవుడికి పూజ చేసేవాడిని ఈ రోజు అగరుబత్తులు కూడా వెలిగించలేదు అన్నారు.

అప్పుడు సుగుణానంద స్వామి అన్నారు. ' నేను పూజ చేసే టైం అయిపోయింది. నేను చేయాల్సిన పని వేరే ఉన్నది? అన్నారు. ఈ రోజు రాలేదు సరే రేపు అయినా డ్యూటీకి వస్తావా' అని స్నేహితులు అడిగారు. స్వామీజీ 'నేను ఎక్కవలసిన డ్యూటీ టైం దగ్గరలో ఉంది, నేను చేయవలసిన డ్యూటీ ఇది కాదు' అన్నారు. వాళ్ళ ఇంటి ఓనర్ వాళ్ళు సత్యనారాయణ స్వామి తీర్థ ప్రసాదాలు తీసుకోవడానికి మళ్ళీ ఆహ్వానించారు. స్వామి స్నేహితులు అన్నారు 'వెల్దాం పదండి, తీర్థ ప్రసాదాలు తీసుకుందామని' అప్పుడు

స్వామి సుగుణానంద అన్నారు నేను ఈశ్వర ప్రసాదాన్ని, ఆ చక్కెర, బెల్లం నాకెందుకు?' అన్నారు. స్వామి స్నేహితులు 'ఏమిటి ఈరోజు విచిత్రంగా మాట్లాడుతున్నావు" అన్నారు. స్వామీజీ అన్నారు 'అశాశ్వతమైన ఈ శరీరం కోసం ఎందుకు తపన. పడుతున్నారు, శాశ్వతమైన పరమాత్మని తెలుసుకోండి, ఈ ప్రపంచమే ఒక విచిత్రం. ముందు ముందు మీకే తెలుస్తుందిలే' అని సమాధానం ఇచ్చారు. అదే నెలలో స్వామి హిమాలయాలకు పయనమయినారు. ఆ రోజునుండి స్వామీజీ సత్యాన్వేషణ మొదలయింది. సాధన ప్రారంభమైంది. సత్యాన్వేషణలో స్వామిజీ జీవితం కొనసాగుతుంది. సత్యాన్వేషణలో స్వామీజీ జీవితం ఇంకా కొనసాగుతుంది.....

స్వామీజీ ఇల్లు వదలి మొదటిసారిగా కర్ణాటక రాష్ట్రం బీదర్ గణేష్ ముత్య ఆశ్రమానికి చేరుకున్నారు. అక్కడనుండి హిమాలయాలకు చేరుకున్నారు. హరిద్వార్ మాతా ఆనందమయి ఆశ్రమం (కస్కల్). అక్కడ రెండు రోజులు ఉండి రిషికేశ్ రాములా చేరుకున్నారు. స్వామీజీకి ఎవరూ తెలియదు. హిందీ రాదు. చిన్న వయస్సు. గంగానదీ తీరాన పడుకునే వారు. గీతా భవన్లో భిక్షాటన చేసేవారు. ఒక పిచ్చివాడిలా చాలా సాధారణంగా ఉండేవాడు. అక్కడనుండి కేదార్ నాథ్ చేరుకున్నారు. కేదార్ నాథ్ గుడి ఎడమవైపులో ఒక ధుని ఉంటుంది. ఆ ధుని వద్ద నాగ సాధువులు ఉన్నారు. వారి వద్దకు వెళ్ళారు. వారితోనే కొంతకాలం కలిసి ఉన్నారు. కేదార్ నాథ్ గుడి వెనకాల నాగ సాధువుల కుటీరములు ఉండేవి. ఆ కుటీరాలలో స్వామీజీ కొంతకాలం ఉన్నారు. అక్కడనుండి గుడి వెనుకాల కొండలలో బ్రహ్మ గుహ ఉంటుంది. స్వామీజీ అక్కడికి చేరుకున్నారు. ఆ బ్రహ్మగుహలో ఇద్దరు సాధకులు సాధన చేస్తున్నారు. వారితోపాటు కలిసి 32 రోజులు బ్రహ్మ గుహలోనే ఉన్నారు. ఆ సాధకులు స్వామీజీని ప్రశ్నించారు. "ఎవరు నువ్వు? ఎందుకు వచ్చావు ఇక్కడికి" అని. స్వామీజీ అన్నారు 'నాకు తెలియదు నేను ఎందుకు వచ్చానో కానీ ఈ ప్రదేశం నాకు తెలిసిన ప్రదేశంలో అనిపిస్తోంది. ఇంతకు ముందు ఇక్కడ నేను ఉన్నాను అనిపిస్తోంది. ఎవరో నా వెనుకనుండి తోస్తున్నట్లు ఇక్కడికి తీసుకొచ్చినట్టు అనిపిస్తుంది' అన్నారు. ఆ సాధకులు చెప్పారు "నువ్వు ఆ కేదార్ నాథ్ గుడికి వెళ్ళు' అని చెప్పారు. స్వామీజీ నడుచుకుంటూ కొంత దూరం వచ్చారు. వచ్చాక తలనొప్పి, జ్వరం వచ్చి ఒక బండపైన పడుకున్నారు. సాయంత్రం అయింది. స్వామీజీ స్పృహలో లేడు. పడుకున్నాడు. స్వామీజీగారి అమ్మవచ్చి స్వామీజీని నిదురలేపింది.

నాన్నా! సూర్యుడు అస్తమిస్తున్నాడు తొందరగా కిందకి వెళ్ళు లేక పోతే సూర్యుడు అస్తమించాక ఇక్కడ ఉంటే మంచు పడుతుంది. చలి ఎక్కువ అవుతుంది, అని చెప్పి భుజంపై చేయి వేసి కొంతదూరం నడిపించింది. స్వామీజీ కొంతదూరం నడిచి వాళ్ళ అమ్మతో అన్నాడు " అమ్మా! నేనే ఇల్లు వదలి పెట్టి పారిపోయి వచ్చాను. నువ్వెందుకు వచ్చావు ఇక్కడికి' అన్నాడు. స్వామీజీ వాళ్ళ అమ్మ "నువ్వు వచ్చింది నాకోసమే, నేను నీకోసం రావడంలో తప్పేముంది?' అంది. స్వామీజీ 'నాకేమీ అర్థం కావట్లేదమ్మా " అన్నాడు. సాయంత్రం అవుతోంది. తొందరగా క్రిందకు వెళాం పద' (అని కొంతదూరం తీసుకువచ్చింది. ఇద్దరూ కలిసి కొంత దూరం వచ్చాక వాళ్ళిద్దరూ కలిసి ఒక బండ పైన కూర్చున్నారు. స్వామీజీ వాళ్ళమ్మ అంది "నువ్వు తొందరగా రా! నేను గుడి వద్ద నీకోసం ఎదురు చూస్తాను, గుడి దగ్గరగా ఉందికదా కనిపిస్తుంది కదా' అని చెప్పింది అమ్మ. స్వామీజీ 'సరే అమ్మా! నేను వస్తాను' అన్నారు. వాళ్ళ అమ్మ వెళ్ళిపోయింది. స్వామీజీ నిదానంగా సాయంత్రం 6 గంటలకు గుడికి వచ్చారు. స్వామీజీ గుడి వద్దకు వచ్చి కేదార్ నాథ్ మొత్తం తిరిగారు. వాళ్ళ అమ్మ కనిపించలేదు. రాత్రి 19 గంటల వరకు తిరిగి చంద్రగిరి బాబా ఆశ్రమానికి వెళ్ళి పడుకున్నారు. మూడు రోజులు కేదార్ నాథ్ మొత్తం వెతికారు. వాళ్ళ అమ్మ కనిపించలేదు. అప్పుడు కేదార్ నాథ్ చాలా చిన్నగా ఉండేది. స్వామీజీ అలాగే చంద్రగిరి బాబా ఆశ్రమంలో ఉండిపోయారు. కొంతకాలానికి రిషికేశ్ వచ్చారు. రిషికేశ్ వచ్చి స్వామీజీ గంగానదీ తీరాన ఒక గుడిసె వేసుకున్నాడు. బాగా గాలి వచ్చి వర్షం పడి గుడిసె పడిపోయింది. అప్పుడు గంగానదీ తీరాన ఉన్న ధీరేంద్రబాబా దగ్గరకు వెళ్ళి స్వామీజీ వారి ప్రక్కన ఉన్న గుహలలోనే ఉంటానని అన్నాడు. ధీరేంద్రబాబా దానికి అంగీకరించలేదు. వద్దు అన్నారు. తర్వాత స్వామీజీ మహేష్ యోగి ఆశ్రమం ప్రక్కన ఉన్న ఒక మర్రిచెట్టు క్రింద పడుకునేవారు. గీతా భవన్లో భిక్ష తెచ్చుకునే వారు. కొన్ని రోజులు తర్వాత ధీరేంద్రబాబా "మీది ఏ ఊరు?' అని అడిగారు. స్వామీజీ 'మాది హైదరాబాద్' అన్నారు. 'సరే నీకు గుహ ఇస్తాను కానీ ఎవ్వరినీ చేర్చుకోకు' అన్నారు. స్వామీజీకి గంగానదీ తీరాన చాలా మంచి గుహ దొరికింది. ఆ గుహలో స్వామీజీ మంత్ర జపం ప్రారంభించారు. ప్రతిరోజూ 5 నుండి 8 వేల వరకు గాయత్రి మంత్ర జపం చేసుకునేవారు. జపం అయిన తర్వాత ప్రాణాయామంతో అంతర్ముఖంలో 4 నుంచి 5 గాయత్రీ జపం చేసేవారు.

ఇలా కొంతకాలం జపం చేసిన స్వామీజీకి ఒక ప్రశ్న వచ్చింది. అసలు నేను హిమాలయాలకు ఎందుకు వచ్చాను, అసలు నేనెవరిని, అందరిలా బ్రతకకుండా నాకెందుకు ఈ జీవితం అని బాధ కలిగింది. స్వామీజీ బాధతో ధ్యానంలో కూర్చున్నారు. స్వామీజీకి గురుపౌర్ణమి రోజు దర్శనమిచ్చిన యోగీశ్వరుడు స్వామిజీకి ధ్యానంలో కనిపించాడు.

## రిషికేశ్ గంగ ఒడ్డున

గురుపౌర్ణమి రోజున కనిపించిన యోగి స్వామివద్దకు వచ్చారు. స్వామి ముందు మౌనంగా కూరున్నారు. కొంత సేపటి తర్వాత లేచి వెళ్ళిపోతున్నారు. స్వామీజీ ఇలా అన్నారు "మీరు ఎవరు? నీవు ఎక్కడ ఉంటావు, చిన్న నాటినుండి నన్ను ఎందుకు వెంబడిస్తున్నావు, ఊహ తెలియకముందు హిమాలయాలకు తీసుకొచ్చావు. ఇప్పుడు వచ్చి మౌనంగా వెళ్ళిపోతున్నావు, ప్రతి శిష్యుడికి గురువు చాలా అవసరం. రామకృష్ణ పరమహంస శిష్యులకు చేతితో అన్నం కలిపి తినిపించేవారు. సమర్ధ రామదాసు వారి శిష్యుల కొరకు తాను వేరేవారి చేతిలో దెబ్బలు తిన్నారు. తల్లిదండ్రులు లేకపోయినా సరే కానీ గురువు ఉండాలి. కబీర్ దాస్ తల్లిదండ్రులు ఎవరో తెలియదు కాని, గురువై అన్నీ తానే బ్రహ్మ జ్ఞానాన్ని పొందాడు. ఈ రోజు నేను అనాధనైపోయాను. ఈశ్వరుడు ఎక్కడ ఉంటాడో ఎవరికి తెలియదు. కనీసం గురువైనా ప్రక్కన ఉంటే గురువులో పరమాత్మని చూసుకుంటాము. గురువు పాద సేవ చేసు కుంటాము. ఏరోజు కూడా ఎవ్వరి దగ్గర ఏమీ ఆశపడలేదు. కానీ మీ దగ్గర మాత్రం జ్ఞానాన్ని ఆశించాను. జ్ఞానం అంటే ఏమిటో తెలియ నప్పుడు నన్ను తీసుకొచ్చావు. నాకు ఇక్కడ ఉండడం ఇష్టం లేదు. నీతో నన్ను కూడా తీసుకెళ్ళు, ఎవరికోసం, దేనికోసం ఇక్కడకు వచ్చానో నాకు తెలియదు. కానీ నేను తెలుసుకున్నది మాత్రం ప్రపంచం మొత్తం శూన్యం. నేను చేరవలసిన గమ్యం శూన్యం ఎక్కడ ఉంటుందో కూడా నాకు తెలియదు. తెలిసిందల్లా నీవు ఒక్కడివే. ప్రతి శిష్యుడికి ఆపద వచ్చినపుడు కానీ సంతోషం వచ్చినపుడు కానీ తన గురువులకు చెప్పుకుంటారు. ఆ శిష్యుడు ఎక్కడికన్నా వెళ్తే డబ్బులు ఇచ్చి పంపుతారు కానీ నాకు డబ్బులు వద్దు, నా బాటలో నడిచే శక్తి ఉంది. కనీసం నా గురువు పేరు కూడా తెలియదు. నన్ను నీవు ఎందుకు తీసుకువచ్చావు? ఇప్పుడు వెంట నన్ను తీసుకపో

లేకపోతే ఈ గంగలో దూకి చనిపోతా అన్నాడు స్వామీజీ. కొంత సేపటి తర్వాత యోగి ఇలా అన్నారు. " నీవు అనాధవు కాదు, నీవే కొంతమందికి అండగా ఉండే పెద్ద దిక్కువి. నీకు ఎవరూ లేరని బాధపడకు, నిన్ను నీ ఇంటి నుండి తీసుకువచ్చింది నాతో తీసుకొని వెళ్ళటానికి కాదు. నీవు ఎవరో నీకు పూర్తిగా అర్థం కాలేదు. నేను ఎవరో కూడా నీకు అర్ధం కాలేదు. నీకు అర్థం చేసుకునే శక్తి నేను ఇస్తాను. గంగలో దూకడానికి నీవు అజ్ఞానివి కాదు. అయినా నేను నిన్ను దూకనివ్వను. ఇంతకు ముందు నిన్ను మృత్యువు ఒడి నుండి తీసుకు వచ్చింది నేనే.

నీకు ఉన్న ఆయుష్షు తక్కువ. దాన్ని ఇంకా తక్కువ చేయాలనే ప్రయత్నం చేయకు. ఇన్ని రోజులు నీవు సాధన చేసి తెలుసుకు న్నది శూన్యం అని అన్నావు కదా! శూన్యానికి అతీతమైన శక్తి ఒకటుంది. ఆ శక్తిని చేరడానికి ప్రయత్నం చేయి కానీ నీ బాధ్యతనుండి తప్పుకోవడానికి ప్రయత్నం చేయకు. శరీరం ఉన్న గురువు నాలుగు రూపాయలు వారి శిష్యులకు ఇచ్చి అన్నం కలిపి తినబెడతారు. వారు ఎక్కడికి వెళ్ళినా వారిని వెంబడి తీసుకు వెళ్తారు. అతను నా శిష్యుడు అని గర్వంగా చెప్పుకుంటారు. నీకు కావల్సింది గర్వం కాదు. నీకు కావల్సింది ఒక ముద్ద అన్నం కాదు, వాళ్ళ గురువులు శిష్యులు కలిసి ఎన్ని రోజులు ఉంటున్నారో నీవు 16 ఆశ్రమాలు తిరిగావు కదా, తిరిగింది నీవు కానీ తిప్పింది నేను. ఎందుగురించి అన్ని ఆశ్రమాలు తిప్పానంటే నీకు అర్థం కావాలనే ఆలోచనతో తిప్పాను. మొదటగా నేను ఎవరో తెలుసుకోవ డానికి ప్రయత్నం చేయి. ఆ తర్వాత నీవు ఎవరో నీకు అర్థం అవుతుంది. నీవు ఎందుకు జన్మించావో నీకు అర్థం అవుతుంది. అని యోగి చెప్పారు. నీవు జన్మించింది ఒకమహా కార్యక్రమం చేసేందుకు, ఈ ప్రపంచంలో నీవు ఒక మహా కార్యక్రమం చేస్తావు. నీకు నా ఆశీర్వాదం ఎప్పుడూ ఉంటుంది. నీకు ఎవరూ లేరు అని బాధపడుతున్నావుగా, బాధపడకు, నీకు భార్య, ముగ్గురు పిల్లలను ప్రసాదిస్తాను. అలాగే నీవు దేహంతో ఉన్న గురువు కానాలనుకుంటున్నావు కదా! అతి తొందరలో నీకు ఒక గురువు దొరుకుతుంది. నీకు ఏమి కావాలన్నా నేను ఇస్తాను. కానీ నీవు ఎప్పుడూ బాధపడకూడదు. నిన్ను నేను హిమాలయాలలోకి ఎందుకు తీసుచ్చానంటున్నావు కదా! అసలు నీవు ఎవరివో తెలుసుకో, నీవు ఎందుకోసం జన్మించావో తెలుసుకో అందరి లాంటి జీవితం కాదు నీది.

నీ జీవితానికి ఒక ప్రత్యేకత ఉంది. నీ పుట్టుకకు ఒక అర్థం ఉంది. ఆ అర్థమే తెలుసుకో' అని అన్నారు యోగీశ్వరులు. స్వామీజీ అన్నారు 'అయ్యా! నాకు భార్య పిల్లలు కావాలని అడగలేదు' యోగీశ్వరుడు అన్నాడు "ఒకసారి నీవు నాకు ఎవరూ లేరు అని బాధపడ్డావు కదా! అందుకే నీకు భార్యా పిల్లలను ఇస్తున్నాను. నిన్ను అర్థం చేసుకునే భార్య దొరుకుతుంది. నిన్ను కన్న కొడుకులా చూసుకుంటుంది. నీ గమ్యానికి తోడుగా, నీకు అండగా ఉంటుంది' అన్నారు. స్వామీజీ అన్నారు "అయ్యా! నా మీద ఇంత ప్రేమ మీకెందుకు?

నీకు నేను ఏమిచ్చి ఋణం తీర్చుకోవాలి అని అడిగారు స్వామీజీ. "తండ్రికి పెట్టడమే తెలుసు, కొడుకు దగ్గర ఆశించడు అని యోగీశ్వరుడు అన్నాడు. స్వామీజీజీ అన్నారు 'అయ్యా! నేను ఏ కార్యక్రమం మీద జన్మించానో తెలియజేయ గలుగుతారా' అని అడిగాడు. యోగీశ్వరుడు అన్నాడు 'ఏ సమయానికి నీకు ఏది కావాలో కాలమే అందిస్తుంది. నీ సమయం ఆసన్నమయినప్పుడు తెలియజేస్తాను, కానీ నీవు ఎప్పుడూ బాధపడకూడదు. నీ వెంట నేనుంటాను. నీ ప్రతి కదలిక నేను గమనిస్తూనే ఉంటాను' స్వామీజీ నమస్కారం పెట్టారు. స్వామీజీ రెండు రోజుల తర్వాత కేదార్‌నాథ్ పాదయాత్ర చేసుకుంటూ వెళ్ళిపోయాడు. కేదార్ నాథ్ చేరుకున్నారు. కేదార్ నాథ్లో గుడి ద్వారం నుంచి కుడిపక్క ఒక సరోవరం ఉంటుంది. స్వామీజీ ఆ సరోవరం వద్దకు వెళ్ళి 4 రోజులు ఉండి అక్కడి నుండి బ్రహ్మ గుహ చేరుకున్నారు. స్వామీజీ బ్రహ్మగుహ వెళ్ళేసరికి బ్రహ్మ గుహవద్ద మాతా రేణుక గారు ఉన్నారు. వారిని చూసిన స్వామి పాదాభివందనం చేశారు. మాతా రేణుకగారు "ఏమన్నా చేన్న గిరిల్లా" అని కన్నడంలో అడిగింది. స్వామీజీ నాకు కన్నడి ఎక్కువ రాదమ్మా! బాగున్నాను అన్నారు. రేణుక అమ్మకు కన్నడ, తెలుగు, హిందీ మూడు భాషలు వచ్చు. స్వామీజీ అడిగారు. "మీరు నాకు సాధనా మార్గాలు చెప్పాలి' అని స్వామీజీ గారు అడిగారు. 'నేను ఆత్మ సాక్షాత్కారం పొందాలమ్మా! అని అన్నారు మాతా రేణుక 'సరే' అన్నది.

# కేదార్ నాథ్ లో మాతా రేణుక

మాతా రేణుక సాధన చేసే ముందు శరీరం అంటే ఏమిటి? శరీర తత్వం అని మాతా రేణుక స్వామీజీ గారికి శరీరావస్థ గురించి పూర్తిగా బోధించింది. మనసు అంటే ఏమిటి? దాని స్వభావం ఎటువంటిది? బుద్ధి అంటే ఏమిటి? బుద్ధి స్వభావం ఎటువంటిది? స్వార్థం, కామం, ఈర్ష్య అంటే ఏమిటి, అనే దాని గురించి పూర్తిగా వివరించింది. ఏ ఆహారం తింటే మనసు ఏ విధంగా పనిచేస్తుంది, అని మనసు గురించి, బుద్ధి గురించి వివరించి అసలు కుండలిని అంటే ఏమిటి? కుండలిని శక్తి అంటే ఏమిటి? ప్రాణశక్తి కదలిక ఎలా వస్తుంది, అన్నీ పూర్తిగా వివరించింది. వివరించి ఐదు రోజులు స్వామీజీతో పాటు ఉండి మంచు కొండలలో లోపలికి తీసుకెళ్ళింది. అక్కడ ఒక గుహ ఉంది. గుహ లోపల నలుగురు సాధకులు ఉన్నారు. ఒక్కొక్కరికి 80 సంవత్సరాల నుండి 100 సంవత్సరాల పైనే వయస్సు ఉంటుంది. వారి దగ్గర ఆశీర్వాదం ఇప్పించింది. వారు కూడా సుగుణానంద స్వామికి కొన్ని క్రియలు చెప్పారు. అక్కడి నుండి ఇద్దరూ కలిసి కేదార్ నాథ్ వచ్చేశారు. చంద్రగిరి బాబా అశ్రమంలో దిగారు. మరుసటి రోజు ఉదయం రేణుక గారు చెప్పారు స్వామీజీకి సాధన చేసుకోమని. అతి వేడి ప్రదేశంలో ఉండవద్దు, అతి చల్లని ప్రదేశంలో ఉండవద్దు, ఒక మంచి ప్రదేశం చూసుకొని సాధన ప్రారంభించమని చెప్పింది. స్వామీజీ అన్నారు " అక్కా! నేను నీతో కొంతకాలం ఉంటాను. మీరు ఇక్కడ ఉన్నారని మా గురుదేవులు చెప్పారు. మీకు మాకు ఏదో జన్మలో బంధం మీతో నాకు ఉన్నది అని నా నమ్మకం. అలాంటిది మీతో నేను ఒక పదిరోజులు కూడా ప్రయాణం చేయలేదు. అప్పుడే దిగి వెళ్ళమంటున్నావా?" అన్నాడు. మాతా రేణుక అంది. "జ్ఞానులకు ఇంత ప్రేమ ఉండకూడదు. నీవు ప్రేమ పెంచుకోవాల్సింది పరమేశ్వరుని మీద. పక్కవారి మీద కాదు. మన చుట్టూ ఉన్న వారందరూ మన జీవితం నుండి దిగిపోయేవారే. ఏదో ఒక రోజు నీ గమ్యం వచ్చిన పుడు నీవు దిగిపోవాల్సిన వాడివే, అలాంటిది మమతానురాగాల మత్తులో ఉండిపోకు, అన్నయ్యా! అయినా నీది చాలా ప్రేమగుణం. ఎక్కువ ప్రేమ పెంచుకోకు, దానివల్ల ఎక్కువ సమస్యలు వస్తాయి. నీవు ఎక్కడ ఉన్నా ఈ రేణుక అక్క అండ ఎప్పుడూ

ఉంటుంది. ఎన్ని రోజులు కలిసి ఉన్నామన్నది కాదు ముఖ్యం, నునవల్ల ఎంత ఉపకారం జరిగింది అన్నదే ముఖ్యం" అని మాతా రేణుక స్వామీజీ తో చెప్పింది. స్వామీజీ కళ్ళలోనుంచి నీళ్ళు వస్తున్నాయి. మాతా రేణుక "ఏంటి అన్నయ్యా! మగవాళ్ళు ఎప్పుడైనా ఏడుస్తారా, అని కన్నీళ్ళు తుడిచి భుజంపై చేయి వేసి మళ్ళీ నిన్ను నేను కలువకూడదు అనుకున్నాను. ఎందుకంటే మనం యోగులమే, మనకు సాధన మీద ధ్యాస ఎక్కువగా ఉండాలి. అయినా నీకు మాటిస్తున్నాను. మళ్ళీ నీవు నన్ను చేరుతావు" అని రేణుక అక్క బ్రహ్మ గుహ వద్దకు వెళ్ళింది. గౌరీకుండ్ వైపు స్వామీజీ నడవడం ప్రారంభించాడు."

## సాధన మార్గాలు

స్వామీజీ ఉత్తర కాశీకి చేరుకున్నారు. ఉత్తరకాశీ పాండవ గుహలో సాధన ప్రారంభించారు. ఉత్తర కాశిలో ఎక్కువగా చలి ఉండదు. ఎక్కువగా వేడి ఉండదు. అక్కడికి వంద కిలోమీటర్ల దూరంలో గంగోత్రి ఉంటుంది. 120 కి.మీ. ల దూరంలో రిషికేశ్ ఉంటుంది. రిషికేశకు గంగోత్రికి మధ్యలో ఉత్తర కాశిలో స్వామీజీ సాధన ప్రారంభం చేశారు. గంగానదీ తీరాన కొన్ని గుహలలో సాధన చేశారు. అక్కడినుండి పాండవ గుహ చేరుకున్నారు. పాండవ గుహలో ఉంటూ సాధన చేశారు. అక్కడి నుండి అగస్త్య మహర్షి నిర్మాణం చేసిన శివాలయం వద్ద ఒక గుహలో సాధన చేశారు. స్వామీజీ భిక్షాటనకు వెళ్ళి రొట్టెలు తీసుకొని వచ్చేవారు. రోజుకు ఒక్క రొట్టె మాత్రమే నీళ్ళలో నానబెట్టుకొని తినేవారు. రోజూ ఉదయాస మూడు గంటలకు లేచి ప్రాణాయామం చేసి, అంతర్ కుంభకం చేసి ఉడ్యానబంధం, జలంధర బంధం, మూలబంధం చేసేవారు. అలా ఉదయం 150 ప్రాణాయామాలు, సాయంత్రం 100 ప్రాణాయామాలు చేసేవారు. ఉదయం 5 గంటల సమయం పట్టేది. సాయంత్రం 3 1/2 గంటల సమయం పట్టేది. స్వామీజీ మౌనంలోనే ఉండేవాడు. స్వామీజీ బాడీ చాలా హీట్ అయిపోయేది. అక్కడనుండి గంగోత్రి వెళ్ళారు. గంగోత్రి లో గంగాదేవి ఆలయం ముందు గంగానది ఒడ్డున నడుచుకుంటూ వెళ్తే కొన్ని గుహలు ఉంటాయి. ఆ గుహలో స్వామీజీ సాధన చేసేవారు. దండి ఆశ్రమానికి వచ్చి బెల్లం, గోధుమపిండి అడిగి తీసుకొని వెళ్ళేవారు. దానితో జావ (అంబలి) చేసుకునేవారు. ఆ అంబలి తీసుకొంటూ 4 నెలలు అక్కడ సాధన చేశారు. 4 నెలల తర్వాత గంగాదేవి ఆలయం

మూసివేస్తున్నారు. 6 నెలలు గుడి మూసి ఉంటుంది. అప్పుడు స్వామీజీ రిషికేశ్ వెళ్ళడానికి డబ్బులు లేవు. నడుచుకుంటూ వస్తుంటే ఒక పుణ్యాత్ముడు లిఫ్ట్ ఇచ్చారు.. స్వామీజీ రిషికేశ్ చేరుకున్నారు. ధీరేంద్రబాబా వద్దకు చేరుకున్నారు. ధీరేంద్ర బాబా మళ్ళీ గుహ యిచ్చారు. ఆ గుహలో మళ్ళీ సాధన ప్రారంభించారు. సాధన చేస్తున్నప్పటి ఆ డైరీలో ఏ ఏ ఆహారం తిన్నారో, ఎన్ని గంటలు ధ్యానం చేశారో, స్వామి ఏ స్థితిలో ఉండేవారో వ్రాశారు.

**విన్నపం: స్వామీజీ సాధన మార్గాలు - మహాతపస్వి 3, 4వ భాగాలలో అందిస్తాను.**

# 3. స్వామీజీ ప్రశ్న

స్వామీజీ ప్రశ్న అనగా మానవ పుట్టుకే ఒక ప్రశ్న. మానవుడు ఒంటరిగా జన్మిస్తాడు, ఒంటరిగా మరణిస్తాడు కానీ ఒంటరిగా జీవించలేడు. ఒంటరిగా జీవించాడు అంటే అయితే జ్ఞాని అయినా కావాలి, లేదా పిచ్చివాడు అయినా కావాలి. జ్ఞాని ఆత్మతత్త్వం తెలుసుకొని ఆత్మ జ్ఞానంలో ఉంటాడు. పిచ్చివాడు వాడి అనందంలో వాడు జీవిస్తాడు. కానీ ఎటూ కాకుండా ఉన్నది .మధ్యలో మీరే ఉన్నారు. సంసారం అనే సాగరంలో జీవిస్తున్నారా, ఆ మాయ అనే సముద్రంను దాటి జ్ఞానం అనే ఒడ్డుకు ఎప్పుడు వస్తారో అని స్వామీజీ అన్నారు.

ప్రశ్న : **అయ్యా! సంసారం అనే సాగరం దాటే మార్గం లేదా?**

**జవాబు** : తీరని ఆశ వెంట మీ మనసు ప్రయాణం చేస్తుంది. బంధాన్ని మరచిన కామంతో, నేను అనే అహంకారంతో, స్వార్ధం, ఈర్ష్య, కామం, ఇవన్నీ మీరు ఎప్పుడైతే వదులుకుంటారో అప్పుడు మీరు సంసారం అనే సాగరాన్ని దాటగలుగుతారు.

ప్రశ్న : **అయ్యా! ఈ స్వార్థం, కామం, ఈర్ష్య వీటిని దాటే మార్గం ఏమీ లేదా ?**

**జవాబు** : ఈ శరీరాన్ని పడవగా మార్చి సూర్యనాడి, చంద్రనాడి అనే రెండు తెడ్డులతో మన (ప్రాణాయామం చేస్తూ బుద్ధిని సక్రమంగా పెట్టుకొని, ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాశలను) అ క్రమశిక్షణతో మీరు ఎప్పుడైతే నడిపించ గలుగు తారో, మీరు అహంకారం, కామం, క్రోధాలను దాట గలుగుతారు. సూర్యనాడి, చంద్రనాడి అనే రెండు తెడ్డులతో ప్రాణాయామమనే క్రియ చేస్తూ, జీవించడానికి కావలసిన సాత్వికాహారాన్ని భుజిస్తున్నట్లయితే సంసారం అనే సాగరాన్ని దాటగలుగుతారు.

ప్రశ్న : **స్వామీజీ! ఇది హఠయోగ సాధనా?**

**జవాబు** : గమ్యం చేరుకోవడానికి ఏ దారి అయితే ఏమున్నదిలే శ్రీను!

ప్రశ్న : **స్వామీజీ! ఆత్మకు చాలా శక్తి ఉన్నది అంటారు కదా! మరి ఆ శక్తి ఏమైంది?**

**జవాబు** : ఒక రాజు తప్పుచేసి శిక్ష అనుభవిస్తున్నాడు. తోటి ఖైదీలతో తను అంటాడు 'నేను రాజును, నేను గొప్పవాణ్ణి అంటాడు. కానీ తను మాత్రం ఖైదీలా అడుక్కునే తింటాడు. నేలపైనే పడుకుంటాడు. ఖైదీ డ్రస్ వేసుకుంటాడు.

ఖైదీలానే జీవిస్తాడు. కానీ రాజులా సుఖ భోగాలు అనుభవించడు కదా! కొన్నాళ్ళకు రాజు అనే విషయం మరచిపోతాడు. ఖైదీలాగే జీవిస్తాడు. ఎందుకని?

ప్రశ్న : **ఆ రాజు తప్పు చేశాడు. కొంత కాలానికి ఖైదీలాగే జీవిస్తాడు. రాజు అనే విషయం మరచిపోతాడు.**

**జవాబు** : మన ఆత్మ కూడా తను ఆత్మ అని తనకు అంత శక్తి ఉన్నది అన్న విషయం మరచిపోయి శరీరంలో ఉంటూ మాయకు బానిస అయి పోయి కామం అనే శిక్ష అనుభవిస్తూ అందులో లేని ఆనందాన్ని అనుభవిస్తుంది.

ప్రశ్న : **స్వామీజీ! ఈ కామాన్ని జయించే మార్గం లేదా?**

**జవాబు** : ఎందుకు లేదు! నిజం తెలిసినవాడికి అందరూ ఆత్మ స్వరూపులే కదా! అందరూ దైవ స్వరూపులే కదా! ఆ దైవత్వాన్ని తెలుసుకుంటే సరిపోతుంది కదా!

ప్రశ్న : **స్వామీజీ! ఆ దైవత్వాన్ని ఎలా తెలుసుకోవాలి?**

**జవాబు** : సముద్ర మథనం చేసినప్పుడు అమృత కలశం బయటకు వస్తుంది. ఆ అమృతం కోసం రాక్షసులు, దేవతలు కొట్టుకుంటారు. అది గ్రహించిన విష్ణుమూర్తి అందమైన మోహిని రూపం ధరించి వస్తాడు. ఆ అమృతాన్ని మీకు నేను పంచుతాను అని రాక్షసులతో అంటాడు. ఆ మోహినిని చూసిన రాక్షసులంతా కామ కోరికతో తపించిపోతారు. అమృతాన్ని వదిలేసి మోహిని వెనకాల వెళ్ళిపోతారు. దేవతలు మాత్రం మోహిని వెనకాల వెళ్ళరు. ఎందుకని?

ప్రశ్న : **దేవతలకు తెలుసు వచ్చింది అమ్మాయి కాదు, విష్ణు భగవానుడు అని.**

**జవాబు** : వచ్చింది మోహిని కాదు విష్ణు భగవానుడు అని గ్రహించారు కాబట్టి మోహితులు కాలేదు. అలాగే సాధకుడు గ్రహించాలి. నశించే శరీరాన్ని ఆశించడం ఏమిటి? నేను అంటే ఆత్మ స్వరూపాన్ని అని రక్త మాంసాల ను ఆశించడం ఏమిటి? ఆ రక్త మాంసాలను నడిపించే శక్తి ఆత్మ అని గ్రహించాలి తప్ప శరీరం మీద ఆశపడకూడదు.

ప్రశ్న : **స్వామీజీ! దేవుడు కుటుంబాన్ని ఇచ్చాడు అంటారు కదా! ఈ కుటుంబం లో ఒకరి మీద ఒకరికి మనస్పర్థలు, ఈర్ష్యలు, ఏమిటీ అర్థం కావట్లేదు.**

**జవాబు** : నీవు ఎప్పుడైనా శివుడి ఫోటో చూశావా? శివుడి ఫోటోలో శివుడు, పార్వతి, వినాయకుడు, కార్తికేయుడు వారి కుటుంబం అవునా?

ప్రశ్న : **అవును స్వామీజీ!**

**జవాబు** : శివుడు వాహనం నంది, పార్వతి వాహనం పులి. వినాయకుని వాహనం ఎలుక, కార్తికేయుని వాహనం నెమలి. శివుడి మెడలో ఉండే పాము ఎలుకను చూస్తే పాము తింటుంది. పామును నెమలి తింటుంది. నందిని పులి తింటుంది. ఆ ఐదు జంతువులు కలిసి ఉండటమే కుటుంబం. అదే విధంగా మన ఇంట్లో మనకు నచ్చినవారు, నచ్చని వారు ఉన్నా కలిసి జీవించటమే. ఎందుకంటే ఆ బంధాలను మీరే కావాలని తెచ్చుకున్నారు. వారికి మీకు మధ్య ఉన్న ఋణబంధం, ప్రేమ బంధంవల్ల వారు మీతో కలిసి పుట్టడం కానీ, జీవించడంకాని జరుగుతుంది.

ప్రశ్న : **ఈ బంధాలు నాకు వద్దు అని తెంచుకొని వెళ్ళిపోవచ్చా ?**

**జవాబు** : ఈ జన్మలో ఈ బంధాలు వద్దు అని మీరు తెంచుకున్నట్లయితే మళ్ళీ వచ్చే జన్మలో అంతకు మించి రెట్టింపు ఫలితం అనుభవించవలసి ఉ ంటుంది. ఈ జన్మలో తల్లిని దూరంగా పెట్టిన వారు వచ్చే జన్మలో అనాధలై పుడతారు. అడుక్కు తింటారు. భార్యా భర్తల మధ్య బంధాలను ఎవరైతే కావాలని దూరం చేసుకుంటారో వారు మళ్ళీ వచ్చే జన్మలో అంద హీనంతో పుట్టి వివాహం అవక ఒంటరిగా జీవిస్తూ జీవితం మొత్తం బాధను అనుభవిస్తారు. మళయాళ స్వామీజీ గారు ఒకసారి చెప్పారు ఉపన్యాసంలో, "ఈ జన్మలో నీరు ఎక్కువగా వృధా చేస్తే మళ్ళీ వచ్చే జన్మలో నీరు లేని ప్రదేశంలో జన్మిస్తారు' అని చెప్పారు.

# 4. గురువు చేసే పని

**ప్రశ్న : గురువు చేసే పని ఏమిటి?**

**జవాబు :** గురువు అనుగ్రహం గాలి వీవన వంటిది. గాలికి స్పందించడం చెట్ల పని. గురువు చైతన్యాన్ని అందుకుని స్పందించడం శిష్యుని విధి. ఏ చెట్టు ఎంత కదిలిందో గాలికి తెలియదు. తనవల్ల ఎందరు ప్రభావితులయ్యారో గురువుకు తెలియదు. విశ్వాసం అనే వేరు గట్టిగా పాదుకుంటే చెట్టుకు ప్రమాదం ఉండదు.

ఒక్క సద్గురువును ఎందరైనా తమ గురువుగా భావించవచ్చు. ఆరాధించవచ్చు. తప్పులేదు. భౌతికంగా గురువులు ఎందరున్నా మహా గురువు ఒక్కరే, పరమాత్మ. అందరికి పరమాత్మే అసలైన గురువు. ప్రతి వారిలోను, అంతరాత్మ రూపంలో పరమాత్మ ఉంటుంది. తన లోపలి గురువును గుర్తించి పట్టుకోవడం అసలైన ఆధ్యాత్మికత. భౌతికంగా మనం గురువులు అనుకొనే వారంతా మన గైడ్స్. (సహాయకులు) మాత్రమే. కె.జీ. గవర్న్, స్కూల్ టీచర్, కాలేజీ లెక్చరర్లు, పి.జి. ప్రొఫెసర్లు వీరంతా విద్యార్థిపాలిటి గురువులే. పై క్లాసుకి వెళ్ళగానే క్రింది తరగతి గురువుల్ని మరచిపోవడం సహజం. అక్కడ వీరి అవసరం ఉండదు. ఎదుగుతున్న కొద్దీ సాధకుడు చాలామందిని మరచి పోతుంటాడు, మరచిపోకతప్పదు. వారితో అనుబంధం అనవసరం. ఆత్మ గురువును దర్శించిన వాడు జ్ఞాని అవుతాడు. ఆ తర్వాత అతనికి భౌతిక గురువులతో పని ఉండదు.

ఎదిగిన కొద్దీ ఒదిగి ఉండాలంటారు. అది శిష్యుల విషయం. జ్ఞానులు గురువులు ఒదిగిన కొద్దీ ఎదుగుతుంటారు. ఒదిగి ఉండటం అంటే అహంకారం లేకుండా నిరాడంబరంగా ఉండటం. తన గురించి గొప్పగా చెప్పుకోకపోవడం. ప్రశంసలకు చలించకపోవడం. వినమ్రంగా ఉండగలగడం. ఎవరికీ భయపడి ఎవరికీ ఒదిగి ఉండనవసరం లేదు. జ్ఞానమే మనిషికి వినయం నేర్పుతుంది. గురువు జ్ఞానం సాగరం వంటిది. ఎంత తోడినా నీరు తరగదు, నీటి మట్టం తగ్గదు. ఆత్మకు అంకితమైన గురువు వినమ్రంగా ఉంటాడు. అది తన ప్రజ్ఞ అనుకోడు. ఎందరు స్నానం చేసినా నదీజలాలు కలుషితం కావు. ఎందరు పానం చేసినా తరగవు.

గురువుకు శిష్యునికి అభేదం. జ్ఞాన విషయికంగా పూర్ణుడైన శిష్యుడు, గురువుతో సముడే. గురువు శిష్యుడు కావచ్చు. శిష్యుడు గురువు కావచ్చు. ఇచ్చేది, పుచ్చుకొనేదీ ఆ ఇద్దరూ కాదు. నదీ జలాలు నదిలో ప్రవహించినంత వరకే పవిత్రం. బిందెలలో ఇంటికి తీసుకు వెడితే అవి మామూలు బావి నీళ్ళే. జ్ఞానం కూడా అంతే. ప్రవాహంగా ఉండాలి. కూపస్థం కాకూడదు. గురువును అర్థం చేసుకోవడమే జ్ఞానం. తన స్థితిని తాను తెలుసుకోవడమే ఆత్మజ్ఞానం. అసలు పేచీ అంతా మనస్సుతో.

మనం ఏం ఆశిస్తున్నాం? ఎందుకు? దానిని బట్టి గురువు అవసరం ఉంటుంది. మన సందేహాలు తీర్చడం గురువు పనికాదు. మన ప్రశ్నలకు సమాధాన మివ్వడు, ఆ రెండు పనులు టీచర్స్ చేస్తారు. పుస్తకాలు చేస్తాయి. మన ఆత్మాన్వేషణలో సహకరించగలవాడే నిజమైన గురువు. ఆ రంగంలో అనుభవం పొందిన వారు మాత్రమే గురువు. అన్వేషణ అంటే వెతుకులాట కాదు. ఆ పని గురు సహాయంతో మాత్రమే చేయగలం. అంటే గురువు చేయవలసిన పని ఏమిటి? అది బయటకు కనిపించదు శిష్యునికి తెలియదు. శిష్యునికి తెలియకుండానే అతనిలో పరివర్తన తీసుకురావడం, గురుపు చేసే పని.

ఆధ్యాత్మికంగా అనేకమంది గురువులు సహాయ పడుతుంటారు. అంటే ఏమిటి? మన అభివృద్ధికి ఎందరో వశిష్ఠయోగులు సహకరిస్తారన్నమాట. నామకః ఉండేది ఒక్క గురువే. ఆ గురువుకు అండగా అనేకులు ఉంటారు. ఎవరు గురువు? అంటే నాకు నచ్చినవాడు నా గురువు. నేను నచ్చిన వానికి నేను శిష్యుణ్ణి. గురు శిష్యుల మధ్య నచ్చడం ముఖ్యం. నా అవసరం గుర్తించి నాకు సహాయం చేసే వాడే సద్గురువు. నేను అర్థించకుండానే నా అవసరం గుర్తించి సహాయం చేస్తాడు. అంటే మనసును ఎక్స్‌రే తీస్తాడన్నమాట. అదీ జ్ఞాన దృష్టితో. అంటే గురువు సంపూర్ణ జ్ఞాని అయి ఉండాలి.

గురువు ఎంత శ్రమించినా శిష్యుడు అభివృద్ధి చెందలేదంటే, అది శిష్యుడి అయోగ్యత – గురువు అసమర్థత కాదు. ఇద్దరికీ పొంతన లేదని అర్థం. ట్యూన్ కాకపోతే అన్నీ అపస్వరాలే.

సంప్రదాయంగా చూస్తే గురువు పరంపరలోనివారు, ఉపదేశించే హక్కు అధికారం ఉన్నవారు. ఒక గురువు తను కాలం చేసే లోగా ఒకరిద్దరికి ఆ హక్కు బదలాయిస్తాడు. వారు పరంపర గురువులు. వారసత్వంలో అలాంటి అధికారం లేకపోయినా జ్ఞానులైన వారు గురువులు కావచ్చు. వారికి వారే అథారిటీ. వారికి వారే ప్రమాణం. ఇప్పుడు చాలావరకు స్వంతంత్ర గురువులే. అంటే గురువు కావడానికి ఎవరి ఆజ్ఞ అవసరం లేదు. దక్షత, ధైర్యం చాలు. స్వయం కృషితో జ్ఞానులు కావడం అన్నది ముహర్షి సంప్రదాయం..

ఈ మధ్యకాలంలో స్వతంత్ర గురువులే ఎక్కువ. రమణ మహర్షి, రామకృష్ణ పరమహంస, అరవింద, జిడ్డు కృష్ణమూర్తి, మాస్టర్ సి.వి.వి. వీరెవరూ సంప్రదాయ గురువులు కారు. అయినా ప్రజ్ఞావంతులు. అందుచేత వీరికి శిష్యులుండరు. వీరంతా స్వతంత్ర పంథాను ప్రోత్సహించినవారే. .

గురువు అవసరమా? అంటే కాదు అని చెప్పవచ్చు. ప్రతీ మనిషి లోనూ నిద్రాణంగా చైతన్యం ఉంటుంది. ఆ చైతన్యం బయటపడితే ఎవరైనా, గురువు సహాయం లేకపోయినా, జ్ఞానులు కావచ్చు. జ్ఞానోదయం ముఖ్యం. ఆత్మదర్శనం కావడం ముఖ్యం. పద్ధతి ఏదైనా, గురువు ఉన్నా లేకపోయినా.

గురువును వెదకటం ఎలా? పట్టుకోవడం ఎలా? చాలా సులభం. గురువు కావాలని బలంగా సంకల్పించడం, తపన పడడం, గురువు దొరికే వరకూ జపం చేయడం. ఖచ్చితంగా గురువుకు నీ పిలుపు వినిపిస్తుంది. ఎవరినో పంపిస్తాడు. నిన్ను తన దగ్గరకు రప్పించుకుంటాడు. మొత్తానికి సంధానం జరుగుతుంది. ఎలా అంటే ప్రతి ఆత్మకు పరమాత్మతో లింకు ఉంటుంది. ఆత్మవేదన, నివేదన పరమాత్మ ఇట్టే గ్రహిస్తుంది. తగిన ఏర్పాటు చేస్తుంది. ఎదట నిలిచిన వ్యక్తిని గురువుగా సంభావించడం అంత సులభం కాదు. మన అజ్ఞానం మాయపొర కప్పుతుంది. జ్ఞానికి బారెడు గడ్డాలు, జానెడు మీసాలు గుర్తులు కావు.

వాస్తవంగా గురువు ఏమి చేయడు. మిలోకి చూస్తాడు. లోపల పేరుకుపోయిన చెత్తా చెదారం ఏరి వేస్తాడు. అందుకు మీ సహకారం అవసరం. ఆ పని మీరు చేయనిస్తారా? మీ సొమ్మేదో పోయినట్లు విలవిల్లాడతారు. గురువు ముందు నిలబడితే

నిన్ను నీవు మరచిపోతావు. నీ శరీరం నీది కాదు. నీ మనస్సు నీ వశంలో ఉండదు. నీ ఆత్మను ఏదో అదృశ్య శక్తి స్పృశించిన భావన కలగాలి అంటే ప్రకృతి. ప్రజ్ఞ కలసి పనిచేస్తాయి. ప్రకృతి శిష్యుని నైజం. ప్రజ్ఞ గురువు స్వభావం. –

గురువు ఏదో చేస్తాడని ఆశిస్తాం. మన బాధలు, బరువులు ఆయన వెంటనే తొలగిస్తాడని ఆశిస్తాం. ఆ పని ఏ గురువు చేయడు. చేయనవసరం లేదు. మన బాధలు, బరువులు మనమే మోసే శక్తి నిస్తాడు. కొత్త సమస్యలు తలెత్తకుండా, మనకు తలంటి పోస్తాడు. ఉన్న బాధలు క్రమంగా పోతాయి. కొత్త బాధలు ఏవీ రావు. అంటే మన భవిష్యత్తుకు గట్టి హామి గురువు. శిష్యుల ఆలోచనల్లోని కల్మషాల్ని తొలగించడం గురువు చేసే పని. తద్వారా అజ్ఞానం తొలగిపోతుంది.

మిగిలింది జ్ఞానం – అని మాత్రం తెలియదు. అది జ్ఞానం అని తెలుసుకున్న రోజున మనం గురువులం అయిపోతాం. దాని పేరే జ్ఞానోదయం. దాని పేరే ఆత్మదర్శనం.

శిష్యుని స్వతంత్రంగా ఎదగనిచ్చేవాడు సద్గురువు. ఎవరూ తన పైన ఆధారపడకుండా ఆత్మజ్ఞానం కలిగిస్తాడు. స్వేచ్ఛలోనే అభివృద్ధి సాధ్యం. ప్రతి దానికి తన పైన ఆధారపడే శిష్యుల్ని గురువు అభిలషించడు. శిష్యుడు దూరంగా ఉంటూ తనంత ఎత్తుకు కనీసం ఎదగాలని ఆశిస్తాడు గురువు.

# 5. యోగ విద్యకు స్త్రీలకు అర్హత ఉందా?

యోగం విద్యకు స్త్రీలు అర్హులా? ప్రశ్న శాస్త్రాలు స్త్రీలను అనర్హులన్నాయి. ఆ శాస్త్రాలు మనకు అవసరం లేదు. వాటి ప్రామాణికతను ఎప్పుడో వదలిపెట్టాం. స్త్రీలు పురుషులవలె యోగానికి అర్హులే. రామకృష్ణ పరమహంస – శారదాదేవి, అరవిందయోగి – మదర్, ..వీరంతా ప్రసిద్ధులే. ఒకరి సహకారంతో ఒకరు యోగంలో ఉన్నత శిఖరాలను చేరుకున్నవారే. శారదాదేవి లేకపోతే రామకృష్ణ పరమహంస ఔన్నత్యం కుంటుపడేదా? మదర్ రాకముందే అరవిందులు మహాయోగి అయినారు కదా! అని శంకించవచ్చు. వీరి యోగపూర్ణత్వం స్త్రీ మూర్తుల సహచర్యం వల్ల, సహకారం వల్లనే కలిగిందని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ఆడవారు యోగానికి పనికిరారని, అనర్హులని ఎందుకు ప్రచారం జరిగిందో చెప్పలేం! స్త్రీలపట్ల వివక్ష అనేక విధాలుగా జరిగినట్లే ఆధ్యాత్మిక విషయంలోనూ జరిగి ఉండవచ్చు. స్త్రీలు చదువుకోరాదన్నారు. వేదం చదవరాదని అన్నారు. చివరకు భగవంతుని గురించి కూడా డైరెక్టుగా ఆలోచించరాదంటే ఎలా? పురుషుడు చేసే పుణ్యకార్యాలలో భార్యను ప్రక్కన కూర్చోపెట్టుకోవాలి. అంటే ఆమె సహకారం, సాహచర్యం లేనిది అతని యజ్ఞయాగాలు పూర్తికావనే అర్థం. యోగం కూడా అర్ధాంగి సహకారం లేకపోతే పూర్తి కాదు. పూర్తి ఫలితాలు యివ్వదు. అర్ధాంగి కాకపోతే మరొక స్త్రీ, ఆధ్యాత్మిక పరిపక్వత చెందిన ఏ స్త్రీ అయినా ఒక్కటే. శరీరావసరాల విషయంలో భార్య మాత్రమే కావాలి తప్ప, ఆత్మ పరిణతి విషయంలో, యోగం, తపస్సు విషయంలో ఆత్మౌన్నత్యం గల ఏ స్త్రీ సాహచర్యమైనా తప్పులేదు. ఇక్కడ సామాజికమైన నీతి, అవినీతి ప్రమేయం లేదు. ఎంతటి మహా తపస్సంపన్నునికైనా స్త్రీ సహకారం కావలసిందే. అయితే స్త్రీలు, యోగినులై పురుష సహకారం లేకపోయినా పూర్ణత్వం సాధించగలరు. కనుక యోగ పూర్ణత్వం విషయంలో మహిళలదే పైచేయి!

ప్రతి పురుషునిలో స్త్రీత్వం ఉంటుంది. ప్రతి స్త్రీ లో పురుషత్వం ఉంటుంది. స్త్రీ పురుష భేదం అనాహత భూమిక వరకే. అంటే భౌతిక, భావ, భూత, మానస శరీరాల వరకూ స్త్రీ, పురుష భేదం ఉంటుంది. ఆ తర్వాత శరీరాలకు లింగభేదం

ఉండదు. ఆడ, మగ తేడా ఉండదు. ఆ తర్వాత ఎవరిదైనా ఆత్మ శరీరమే. ఆత్మకు ఆడ, మగ అనే తేడా లేదు. పురుషాత్మలు, మహిళాత్మలు అని లేవు. స్త్రీ, పురుష భేదం కనిపించే మొదటి నాలుగు శరీరాలకు నాలుగు భూమికలలో వైవిధ్యం కనిపిస్తుంది.

భౌతిక రూపంలోని పురుషుడు భావ శరీరంలో స్త్రీగా వుంటాడు. అంటే ఈథర్ శరీరం స్త్రీతత్వంతో నిండి వుంటుంది. మూడవదైన భూత (యాస్టల్) శరీరం మరల పురుష ప్రవృత్తితో వుంటుంది. నాలుగవదైన మానస శరీరం మరల స్త్రీత్వంతో నిండివుంటుంది. సూక్ష్మంగా గమనిస్తే దీని యదార్థత విదితమవుతుంది. పెద్ద మగాళ్లుగా ఫోజు పెట్టేవారి భావాలు, మనస్సు చాలా సున్నితంగా, ఆడతనంతో వుంటాయి. గమనించండి. అలాగే స్త్రీలు... స్త్రీల భావాలు, మనస్సు చాలా కరకుగా, పౌరుషంగా వుంటుంది. శారీరకంగా ఆడవారైనా భావాలు, ఆలోచనలు పురుషాహంకారంతో ఉంటాయి. అంటే భౌతికంగా స్త్రీమూర్తి, ఈథరి లో పురుషుడు, యాస్టల్లో స్త్రీ, మానసిక చర్యలలో పురుషుడు అవుతుంది అంటే ఏ పురుషుడు పూర్ణపురుషుడు కాదు. ఏ స్త్రీ కేవలం స్త్రీ కాదు. ప్రతి పురుషునిలో స్త్రీ మూర్తిమత్వం ఉంటుంది. అందుకే అర్ధనారీశ్వరతత్వం ప్రచారంలోకి వచ్చింది. పరమశివుడు అర్థనారీశ్వరుడే కదా!

ప్రతి పురుషుడు తన భావ శరీరంలోని స్త్రీని అమితంగా యిష్టపడు తుంటాడు. ఆ శరీరంతో రమిస్తాడు. అలాగే ప్రతి స్త్రీ తనలోని భావ పురుషునితో సుఖిస్తుంది. అందువల్లనే శారీరకసంపర్కం లేకపోయినా స్త్రీ పురుషులు సుఖప్రాప్తి చెందుతారు. ఈ తృప్తి యోగంలో చాలా ముఖ్యమైనది. అదే అసలైన బ్రహ్మచర్య సూత్రం. ఎంతటి అస్కలిత బ్రహ్మచారి అయినా తనలోని స్త్రీ మూర్తిని త్రోసివేయ లేడు. భౌతికంగా ఒక స్త్రీ తనకు తోడు లేకపోయినా తృప్తి పొందగలడు. ఇది అస్కలిత బ్రహ్మచర్యం కనుక పురుషుడు తనలోని భావ స్త్రీతో రమించినపుడు (అది సంభోగం కాదు. శరీర సంపర్కం కాదు) శక్తి బయటకు పోదు. అది తనలోనే వుంటుంది. పైగా తనలోని స్త్రీ, పురుష శక్తుల కలయిక వల్ల శక్తి మరీ పెరుగుతుంది. గమనించండి! బ్రహ్మచర్యం పాటించే పురుషులు గానీ, స్త్రీలు గానీ చాలా ఉత్సాహంగా, తృప్తిగా ఉంటారు. వారిలో పర వ్యామోహం ఉండదు.

పైగా శక్తి రెట్టింపై ఉద్దీపిస్తుంది కనుక అది ఒక విధమైన తేజస్సుగా భాసిస్తుంది. దానికి తోడు ఏ మాత్రం యోగం అబ్బినా, తపస్సు జతపడినా వారిది బ్రహ్మ వర్చస్సే అవుతుంది. అలాంటివారు బాహ్యాకర్షణలకు, ప్రలోభాలకు లోనుకావడం జరగదు. శారీరక సుఖలాలస లేకపోగా, ఆ దృష్టితో ఇతరులను ఆకర్షించాలనే ప్రయత్నమూ ఉండదు. కానీ వారిలో ఆకర్షణ మాత్రం చాలా ఎక్కువగా ఉంటుంది. సామాన్యులు గానిని అపార్థం చేసుకునే అవకాశం వుంది.

నాల్గవ శరీరం తర్వాత ఏ బ్రహ్మచర్యం అవసరం ఉండదు. ఏ శక్తి అయినా పురుషుని లోంచి స్త్రీలోకి ప్రవహిస్తుంది. పురుష ప్రవృత్తి అలాంటిది. స్త్రీ ప్రవృత్తి ఎప్పుడు శక్తిని స్వీకరించడానికి సిద్ధంగా ఉంటుంది. ఎంత యోగం చేసినా, తపస్సు చేసినా స్త్రీలు తాము ఆర్జించిన శక్తిని ఇతరులకు యివ్వలేరు. పురుషుల శక్తి వారు తీసుకోగలరు. శక్తిపాతం – పురుష ప్రకృతి. అందువల్లనే యోగులు, తపస్సంపన్నులు తమ యోగశక్తిని ఇతరులకు ధారపోస్తారు. స్త్రీలు భౌతిక శరీరంతోనే సరాసరి శక్తిపాతాన్ని అందుకుంటే పురుషులు వారిలోని భావశరీరాలతో (స్త్రీ త్వ) మాత్రమే అందుకుంటారు. అందువల్ల యోగశక్తి స్త్రీలలో వెంటనే కనిపిస్తుంది. పురుషులలో యోగక్రియ కాస్త ఆలస్యంగా జరుగుతుంది. ఎంతటి యోగిని అయినా తన యోగశక్తిని ఇతరులకు యివ్వలేదు, యివ్వదు. అది కారణంగానే స్త్రీలు యోగినులైనా గురు స్థానానికి చేరరు. తమలోని యోగశక్తిని ఏ కొంచెమైనా సాధకులకు ఇవ్వనిపక్షంలో వారు గురువులు కాలేరు. ఆ పని సహజంగా స్త్రీలు చేయలేరు కనుక, వారు ఎంత యోగం చేసినా, తపస్సు చేసినా గురువులు కారు. కాకపోతే వారు తమ యోగశక్తిని ప్రేమగా మార్చుకోగలరు. సాటివారిని సానుభూతితో చూడడమే కాక, అమితంగా ప్రేమించగలరు. ప్రేమతో వారి హృదయాల్ని జయించగలరు. మనుషుల్ని, దేవుళ్లని, సృష్టిని సైతం సమంగా ప్రేమించే సహజ గుణం వారికి అలవడుతుంది. ఆర్జించిన శక్తినంతా ప్రేమగా మార్చి భగవంతునికి నివేదన చేస్తారు. లేదా సాటి వారికి తమ ప్రేమను పంచియిస్తారు. వీరు పరమ పవిత్రంగా, సాత్వికంగా, ప్రేమపూర్ణులుగా జీవిస్తుంటారు. వారి సహకారం పొందినవారు త్వరగా యోగ పూర్ణులవుతారు. అందువల్లనే యోగ పూర్ణత్వానికి (స్త్రీ సహకారం) అర్ధాంగి సహకారం అవసరం. శరీరంలో అర్ధభాగం స్త్రీ అని అందరికీ

తెలిసిందే. యోగంలోనూ సగభాగం స్త్రీదే. కుడి ఎడమైతే పొరపాటు కాదు. మన శరీరంలో కుడి భాగం పురుష, ఎడమ భాగం స్త్రీ కుడిఎడమ కావడం అంటే మనిషి తనలోని అర్ధ శరీరం అయిన స్త్రీగా మారాలి. అలా మారి సంయోగం చెందడమే యోగక్రియ.

యోగశరీరాలలో ప్రతిదానికి తనలోపలున్న మూడు శరీరాల ఎరుక ఏర్పడుతుంది. జ్ఞానం కలుగుతుంది. ముందుగా భౌతికశరీరాన్ని తీసుకుందాం: యోగం చేసినప్పుడు భౌతిక ప్రజ్ఞ చెడకుండా భావ, భూత, మానస శరీరాల గురించి అవగాహన ఏర్పడుతుంది. భౌతిక శరీరస్పృహ పోగానే భావ శరీరం పైకి వస్తుంది. అధికారం చేతికి తీసుకుంటుంది. భావ శరీరంలో అనాహతం తర్వాతిదైన విశుద్ధిచక్రం వరకు జ్ఞానం కలిగిస్తుంది. అనగా ఆత్మశరీరాన్ని స్పృశించగలదు భావశరీరం. ఆ పైకి పోదు. భూతశరీరం కూడా విశుద్ధి వరకే పయనిస్తుంది. భావ, భూత శరీరాలు స్వాధిష్టానం పరిధిలోవి. ఆ తర్వాతిదైన మానస శరీరం సాధించిన యోగి, అంటే అనాహత కేంద్రాన్ని చేరిన సాధకుడు బ్రహ్మలోకం వరకు అంటే ఆజ్ఞాచక్రం వరకు వెళ్లగలడు. ఆ పై నున్న నిర్వాణ సుఖాన్ని చవిచూస్తాడు. అనాహత కేంద్రం తర్వాత శరీరాల అవసరం లేదు, శరీరాలు ఉండవు. – శక్తిపాతం జరిగేది భావ శరీరం పైనే అయినా, అది జరిగినట్లు గ్రహించేది ఇంద్రియాలు కనుక, ఆ పని భౌతిక శరీరం పైన జరిగినట్లు భావిస్తాం. భావన ప్రధానం అయినంత కాలం ఆ క్రియ జరిగేది భావ శరీర వేదిక పైనే. మిగిలిన శరీరాలు ఎంత శక్తివంతాలైనా వాటికి వాహిక భౌతిక శరీరమే. మిగిలినవన్నీ సూక్ష్మశరీరాలు. కనిపించవు. ఈ సూక్ష్మ శరీరాలకు సంబంధించిన శక్తులు ఏవైనా ఇటు కుండలిని ఆధారంతో భౌతిక శరీరం ద్వారా బయట పడతాయి. లేదా అటు సహస్రారం ద్వారా బయటకు వస్తాయి. భౌతికశరీరం ద్వారా అందుకోగలిగినప్పుడు అది శక్తిపాతం అవుతుంది. సహస్రార కేంద్రం ద్వారా అందుకున్నప్పుడు అనుగ్రహం అవుతుంది. నిజానికి భౌతిక, భావ, భూత శరీరాలు మానస శరీరంలోని సగభాగం, అనగా రూపం వరకు ఫిజికల్ గా చెప్పవచ్చు. ఇందులో భౌతిక శరీరం నశించినా మిగిలిన మూడు శరీరాలు చాలా కాలం మనగలుగుతాయి. ఫిజికల్ ఇమ్మోరాలిటీ అంటే ఈ నాలుగింటిలో ఏ ఒక్కటి చిరకాలం మనగలిగినా ఇమ్మోరాలిటీయే అవుతుంది. ఉదాహరణకు, మనం గురువు గారి భావాల్ని అందుకోగలిగినా, రూపాన్ని చూడగలిగినా, గురువు గారు ఫిజికల్లీ ఇమ్మోర్టల్ అనే అర్థం.

ఉదాహరణకు : ఇప్పుడు నా నుండి శక్తిపాతం జరిగింది అనుకుంటే అది నా భౌతిక శరీరం ద్వారానే జరిగినట్లు – స్పందన కానివ్వండి, వైబ్రేషన్ కానివ్వండి, శక్తి కానివ్వండి అది నా ఎదురుగా వున్న వ్యక్తిలోకి ప్రవహిస్తుంది, స్పందన కలిగిస్తుంది. ఆ కలగటంలోనూ మూడు రకాలున్నాయి – భావ శరీరాన్ని స్పృశించినప్పుడు, భౌత శరీరంతో సంబంధం ఏర్పడినప్పుడు, మానస శరీరంపై ప్రభావం కలిగినప్పుడు చర్యలు భిన్నంగా ఉంటాయి. అవి అనుభవంతో తెలుసుకోవసిందే తప్ప ఈ శరీరస్పందన ఇలాగే ఉంటుందని చెప్పడానికి వీల్లేదు. ఏదైనా డైరెక్టు వర్కింగ్ జరిగినప్పుడే అనుభూతికి అవకాశం, లేకపోతే నిస్తేజం అనిపిస్తుంది. ఈ స్పందన పురుషులలో కన్న స్త్రీలలో వేగంగా, తొందరగా జరుగుతుంది. స్త్రీకి సమర్పణ సులభం. స్త్రీ ఎప్పుడూ సమర్పణ భావంతోనే వుంటుంది. పురుషునిలో ప్రతిఘటన ఎక్కువ. ముందుగా ప్రతిఘటించి, తర్వాత తలవంచడం పురుష లక్షణం. పురుషులలో సమర్పణే కాదు అంకితభావమూ తక్కువే. అనుమానం, అహంకారం ఉన్నంతకాలం సమర్పణ సాధ్యం కాదు. అందువల్ల పురుషుల విషయంలో శక్తిపాతం కాస్త ఆలస్యం అవుతుంది. చాలా శ్రమతో గాని పురుషుల విషయంలో శక్తిపాతం సాధ్యపడదు. పూర్తిగా సరెండర్ అయినవారి విషయం వేరు. వారిలోకి శక్తిపాతం జరపడం సులభమే. ఎంత వినయం, విధేయత కనబరచినా పురుషునిలో 'అహం' పాలు ఎక్కువ. అది ఒక పట్టాన మెట్టు దిగదు. తన వ్యక్తిత్వమే గొప్ప అనుకుంటారు. 'నేను' అనేది పోతేనే సమర్పణ సాధ్యం. సమర్పణ జరిగితే తప్ప శక్తిపాతం సాధ్యం కాదు.

పురుషులు సరెండర్ కావడమే జరిగితే – అది ప్రాథమికంగా భావ శరీర లక్షణం అవుతుంది. పురుషుని భావ శరీరానికి సహజ స్త్రీ గుణాలుంటాయి. అంటే పురుషుడు భౌతిక శరీరం మొరాయించి ఎదురు తిరిగినా భావపరంగా సరెండర్ కాగలడు. అది గురు స్థానంలోని వ్యక్తి అంతర్దృష్టితో గ్రహిస్తాడు. సహజస్వభావం వల్ల, నైజం వల్ల స్త్రీ భగవంతునికి, పరమాత్మకు సరెండర్ అవుతుంది. పురుషుని విషయంలో ప్రతిఘటిస్తుంది. అది సహజం. అందుకే స్త్రీలలో శక్తిపాతం సులభం. ఎంతటి మహాశక్తినైనా, అది ఎంత తీవ్రంగా వున్నా, స్త్రీ స్వీకరించి భరించగలదు, నిబ్బరంగా ఉండగలదు. అదే పురుషుడు తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరవుతుంటాడు. స్త్రీ ఎంతటి శక్తినైనా

తీసుకుని తనలో భద్రంగా దాచుకోగలదు. తిరిగి ఇతరులకు పంచి ఇవ్వడం జరగదు. దానిని ప్రేమగా, అనురాగంగా, కరుణగా మార్చుకుంటుంది. పురుషులలో కారుణ్యం, అనురాగం, ప్రేమ తక్కువగా కనిపిస్తాయి. ఉన్నా పురుషాహంకారం వాటిని సున్నితంగా మననీయదు. అందువల్లనే మహర్షులైనా, మహాయోగులైనా పురుషులు కఠినంగా ప్రవర్తిస్తారు. కరకుగా మాట్లాడతారు, లేదా అసలు మాట్లాడరు.

అనుగ్రహానికి, శక్తిపాతానికి తేడా ఉండదు. అనాహత కేంద్రం నుండి శక్తి ఒక స్పందనగా, అదృశ్యంగా విడుదలైతే అది అనుగ్రహం అవుతుంది. అది సాధకునికి తెలియదు. పురుషుని నాల్గవ శరీరం అంటే మానవ శరీరం స్త్రీ గుణాలతో ఉంటుంది కనుక అనుగ్రహపాత్ర మవుతుంది. స్త్రీలు అనుగ్రహంతో తృప్తి పడరు. వారికి డైరెక్టు 'శక్తిపాతం' యిచ్చిన త ృప్తి అనుగ్రహం వల్ల కలగదు. వెంటనే అది అనుభూతి కలిగించాలంటే శక్తిపాతం అవసరం. పురుషులు అనుభూతితో తృప్తి చెందరు. వారికి అనుభవం కావాలి. అనుభవం అనుగ్రహం వల్ల కలుగుతుంది. ఒకరు దయతలచి యిచ్చే శక్తిని పురుష ప్రక ృతి ఆమోదించదు. వాంఛించదు. గురువు అనుగ్రహం వుంటే చాలు శక్తిని తాముగా సంపాదించుకోవాలనుకుంటారు. గురువు నుండి అయినా స్త్రీ తన సహజ స్వభావంతో 'సమర్పణ' తోనే శక్తిని స్వీకరిస్తుంది. అందువల్ల ఈ సమర్పణ ప్రాతిపదికగా భక్తిని, ప్రేమను పెంచుకుంటారు. ఆడవారిలో ఉన్నంత భక్తి తత్పరత, ప్రేమానురాగాలు పురుషులలో కనిపించవు. ఎంతటి అసమర్థుడైన గురువు వద్దకైనా స్త్రీలు అధిక సంఖ్యలో చేరగలరు అందువల్లనే. స్వామీజీలు, బాబాలు తమలో పెద్దగా యోగశక్తి, ఆధ్యాత్మికత లేకపోయినా ఆడవారిని ఆకర్షిస్తారు. వారితో వున్న ఏ కొంచెం శక్తినయినా స్త్రీలు అందుకోగలరు. పురుషులకు ఆ కొద్దిపాటి శక్తి చాలదు. వారి వద్ద శక్తిపాతం జరగదు. వారి అనుగ్రహం కలగదు. అందువలన ఆడవారు స్వతంత్రించి యోగసాధన చేయరు. వారికి ఒక ఆసరా అవసరం. సమర్థుడు అయినా, కాకపోయినా ఒక గురువు ఆలంబన వారికి అవసరం. కనీసం జీవిత భాగస్వామి అయిన భర్త సహకారం అయినా కావాలి. కనుక ఆడవారు గురువులూ, మాస్టర్లు కావడం లేదు. 'మదర్' అవుతారు. అంటే తల్లిగా ప్రేమ పంచిపెట్టగలరు. యోగంలో బాబాగా పండినవారు వృద్ధాప్యంలో శక్తిపాతానికి అర్హులవుతారు. కానీ, వారి యోగశక్తి పురుషులలోకి ప్రవహించదు. అది ప్రకృతి విరుద్ధం. వారి అనుగ్రహం మాత్రం ఎవరైనా పొందవచ్చు.

యోగసాధనలో స్త్రీ పురుషుల మానసిక స్థితులలో భేదం వుంటుంది. స్త్రీలు ఎంతో నిర్మలంగా, నిష్కల్మషంగా మిగతా ప్రపంచాన్ని, సమస్యలను అవతల పెట్టి, ఏకాగ్రంగా ధ్యానం చేస్తారు. క్షణంలో తన్మయ స్థితికి చేరుకుంటారు. ప్రశాంత స్థితికి చేరడానికి ప్రయత్నించరు. ఏదో బలవంతంగా సాధన చేస్తున్నట్లే భావిస్తారు. గురువు కనిపించగానే లేదా గురువు సన్నిధికి రాగానే ఆడవారికి గురువు పట్ల ఆరాధన ఉబికి వస్తుంది. కళ్ళు చెమర్చి, పాదాభివందనం చేస్తే కాని స్థిమిత పడరు. అదే మగవారు వెనకాముందు ఆలోచిస్తారు. ఊగిసలాట ఎక్కువ. అహంకారం బయట పడుతుంది. తప్పనిసరిగా, మొక్కుబడిగా, అంటీ ముట్టనట్లు నమస్కరించి వెళ్ళిపోతారు. ఆడవారు ఆలా వెళ్ళిపోరు. అక్కడే గురువుకు సమీపంగా స్థానం వెతుక్కుని తన్మయంగా, ప్రశాంతంగా ఏదో ఆనందాన్ని అనుభవిస్తారు. పాదాభివందనం చేస్తే తమ ఆధిక్యత తగ్గిపోతుందని భావించే పురుషులు 'హల్లో' అన్నట్లే ప్రవర్తిస్తారు. తలవంచనిదే యోగం అబ్బదు. తలవంచడం "తలవంపు" కాదు. అదొక సంస్కారం ... విధేయత లక్షణం. విధేయత లేనివారు గురువు అనుగ్రహం ఎలా పొందగలరు! ఏ కాస్త యోగం అబ్బినా అదంతా తన కృషి ఫలితమేనని, గురువుగారి పాత్ర, ప్రమేయం లేదని అహంకరించే వారికి యోగం అబ్బదు. ఆడవారు ఎంత కాలంగా యోగం చేస్తున్న వారైనా, ఎంత శక్తి సంపాదించినవారైనా అహంకరించరు. అది గురువుగారి అనుగ్రహం, భగవంతుని అనుగ్రహం అని వినమ్రత చూపిస్తారు – 'యోగం ఇంకా సాధించవలసింది అనంతంగా వుంది, సాధించింది. అత్యల్పం' అని ప్రతి సాధకుడు అనుకుంటేనే ముందుకు పోగలడు. గర్వం, అహంకారం ప్రగతికి ఆటంకాలు.

శక్తిపాతం అటు భౌతిక శరీరంలోను, ఇటు మానస శరీరంలోను సంభవమేనని అనుకున్నాం. అది భౌతిక శరీర స్థాయిలో జరిగినప్పుడు కుండలిని ఒక్కసారిగా మేల్కొని బుసలు కొడుతుంది. నిద్రపోతున్న సర్పాన్ని తన్ని లేపినట్లవుతుంది. యోగసాధనలో క్రమవికాసం కలిగినప్పుడు అలా బుసలు కొట్టడం జరగదు. బయట శక్తి ఏదో ఒకటి దాని విషయంలో జోక్యం కలిగించుకున్నప్పుడే అది ఆగ్రహించినట్లు బుసకొడుతుంది, పడగ విప్పుతుంది. దానిని స్వాధీనం చేసుకోగల శక్తి ఉండాలి. స్వాధిష్టానం వరకు దాని ప్రతాపం చూపుతుంది. స్వాధిష్టానం ఒక విధంగా ఆరోగ్య కేంద్రం. మరొక

విధంగా వాంఛ నిలయం. శారీరకమైన స్వస్థత కోల్పోవడం జరుగుతుంది. కామనలు విజృంభిస్తాయి. స్వాధిష్ఠాన చక్రంపై అధికారం సంపాదించగలిగితే తప్ప, లేకుంటే ఆ రెండు చాలు మనిషిని పతనం చెందించడానికి. గురువు ప్రక్కన వుంటే నాగస్వరం పట్టగలడు. ఆ త్రాచు అణగి మణగి వుంటుంది. దానిని వెంటనే కంట్రోల్ చేసి మూలాధారంలోకి పంపగలగాలి.

గురువు నుండి శక్తి పాతం జరిగినప్పుడు సాధకుడు కొన్ని నెలలు, సంవత్సరాలకుగాని పొందలేని కుండలినీ చైతన్యం నిమిషాలలో పొందడం జరుగుతుంది. ఈ శక్తిపాతాన్ని భరించి, నిలవరించడానికి మొదటి మూడు శరీరాలు తయారై ఉండాలి. అందుకే 'అనుగ్రహం' అని అంగలార్చినా, శక్తిపాతం కోరినా గురువు యివ్వడు. దానిని భరించే మూడు శరీరాలు తయారు కావాలి. ఆ విషయం గురువైన వ్యక్తి గమనిస్తూ వుంటాడు. ప్రతి సాధకుని అభివృద్ధికి అవి పరీక్షలు. భౌతిక, భావ, భూత శరీరాలు రెక్టిఫై కానప్పుడు శక్తిపాతం జరిగితే ప్రయోజనం కన్న ప్రమాదాలే ఎక్కువ.

ఎందువలన మూడు శరీరాలు సిద్ధం కావాలి? అవి లోపరహితం కావాలి? శక్తి అందుకునేది భౌతిక శరీరం కదా? అనవచ్చు. భౌతిక సుఖాల కోసం, ప్రాపంచిక అవసరాల కోసం శక్తిని కోరేవారు భౌతిక శరీరాన్ని, దాని అవసరాలను మాత్రమే గుర్తిస్తారు. శక్తిపాతం జరిగినప్పుడు గురువు నుండి విడుదలైన శక్తి సాధకుని భౌతిక శరీరంలో ఆగిపోదు. ఆ శక్తిని భౌతిక శరీరం భరించలేదు. అక్కడ ఏ మాత్రం నిలవవున్నా ప్రమాదమే. అది భావ, భూత, మనో శరీరాలకు ప్రసరించాలి. సమంగా పంపిణీ జరగాలి. దాని వేగం అంత ఎక్కువ. భౌతిక శరీరాన్ని బోర్ చేసుకుంటూ భావ, భూత శరీరాన్ని చేరుతుంది. మానస శరీరంలో ఆ శక్తిని భద్రంగా దాచుకోగల వ్యక్తి యోగి అవుతాడు. ఆ శక్తి ఒక్కొక్క శరీరాన్ని దాటుతున్నప్పుడు సాధకుడు చాలా హైరానా పడతాడు. అనుభవాలు ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. ముందుకు పోలేడు. వెనక్కి పోడు, సాధన నుండి బయటపడలేక బిగుసుకు పోయినట్లు అవుతాడు. గురువు యాస్టల్ టచ్ యిస్తే ఆ శక్తి నెమ్మదిగా అతని లోపలి సూక్ష్మశరీరాల్లోకి ప్రవహిస్తుంది. ఉపశమనం కలిగిస్తుంది.

అలా కాక, మూడు శరీరాలు బాగా సిద్ధమైనపుడు శక్తిపాతం జరిగితే సాధకునికి అద్భుతమైన అనుభవాలు కలుగుతాయి. ఆనందం అందుకోగలడు. కోరిన దేవుళ్లను, దేవతలను, ప్రత్యక్షం చేసుకోగలడు. అప్సరసలతో ఆడుకోనూ వచ్చు. అలా స్వర్గంలోని నందనవనానికి షికారు పోయి రావచ్చు. గురువుల శక్తిప్రసరణవల్ల కుండలిని చైతన్యం పొందితే సాధకుడు అనాహతం వరకు అనుభూతి చెందగలడు. ఆ తర్వాత ప్రయాణానికి స్వశక్తి అవసరం. గురువుగారి సహాయం సరిపోదు. అక్కడ భయంకరమైన నైరాశ్యం ఆవహిస్తుంది. చీకట్లు కుండలిని క్రమ్ముకుంటాయి. దారి కనిపించదు. వెంట వస్తున్న గురువు నిష్క్రమిస్తాడు. అక్కడ ఒక చిరుదీపం వెలిగించుకోక తప్పదు. ఆ వెలుగు ఆసరాగా ఒంటరిగా ముందుకు నడవాలి. ఆత్మశక్తి పెరిగిన కొద్దీ ఈ వెలుగు పెద్దదవుతుంది. ధైర్యంగా ముందుకు సాగితే వెలుగుబాట రాజబాట అవుతుంది. అక్కడ దృశ్యమే మారిపోతుంది. గతం జ్ఞాపకం రాదు. వెనకచూపు ఉండదు. వెనకడుగు ఉండదు. సాధకుని దృక్పథమే మారుతుంది. లక్ష్యం తెలుస్తుంది. గమ్యం స్పష్టంగా కనిపిస్తుంది. అప్పుడు సాధకుని పూర్ణపరిణామానికి అవకాశం చిక్కుతుంది. కనుక గురువు యిచ్చే శక్తిని అంతవరకే ఉపయోగించుకోవాలి. పూర్తిగా గురుశక్తిపై ఆధారపడకుండా ప్రతిసాధకుడు స్వంతశక్తిని సమీకరించుకోవాలి.

చాలా మంది సాధకులు శ్రమపడడానికి ఇష్టపడరు. డిసిప్లిన్ అంటే భయం. వ్యసనాలకు బానిసలైనవారికి క్రమశిక్షణ, సాధన మరీ కష్టం. ఏమాత్రం శ్రమపడకుండా ఫలితాలు ఇబ్బడిముబ్బడిగా కలగాలని ఆశిస్తారు. యోగం కూడా ఉచితంగా, అప్పనంగా దొరకాలి. అలాంటి అల్పబుద్ధులకు ఏదీ రాదు. ఎవరైనా సరే శ్రమించక తప్పదు. సాధన చేయాలి. ఫలితం అనుభవించాలి. ఉచితంగా దేనినీ వాంఛించ కూడదు

ఎప్పుడూ మనం ప్రతిఫలం చెల్లించడానికి సిద్ధంగా ఉండాలి. అందుకే గురుదక్షిణ అనేది ఏర్పరచారు. లోభికి, పిసినారికి యోగం అసలు అబ్బదు. వితరణ చాలా అవసరం. దయా ధర్మ గుణాలు మరీ ముఖ్యం. అర్హతలు మనం పెంచుకోవాలి. ఇతరులను చూచి, తెలుసుకుని ఆచరించాలి. అర్హతను మించి ఎవరికీ యోగం అబ్బదు. అర్హత లేనివారికి అసలు అబ్బదు. ఫలితాలు సాధనను బట్టి వుంటాయి. కొన్ని కొన్ని ఇబ్బందులు కలిగినా, అవరోధాలు ఏర్పడినా పిరికితనంతో పారిపోకూడదు. కావాలనే గురువులు కొన్ని పరీక్షలు పెడుతుంటారు. ఆ పరీక్షల్లో నెగ్గకపోతే అంతే సంగతులు. రిజర్వేషన్ పనికిరాదు. రిజర్వ్ గా వుండేవారు గురువు అనుగ్రహానికి పాత్రులు కాలేరు. కృషి ప్రధానం, సాధన అవసరం. అప్పుడు మనం ఆశించిన దానిలో కొంతయినా దక్కుతుంది. సాధన ఎప్పుడూ వృధా కాదు. చేసుకున్న వారికి చేసుకున్నంత.

# 6. గురువు ఎలా ఉండాలి?

గురువు అనేవాడు ఉంటే శిష్యులు ఏర్పడతారు. శిష్యులు లేకపోతే ఎవరూ గురువుకారు. గురువు కావడానికి ఒక్కడైనా అనుయాయి ఏర్పడాలి. నిజానికి గురువు, శిష్యుడు చేసే పని ఒక్కటే – సాధన. సత్యాన్వేషణ. ఒకరు ముందు ఒకరు వెనుక. ఒకరికి అనుభవం వుంది. ఒకరికి అనుభవం కలగవలసివుంది. అనుభవం వున్న వారి అడుగుజాడలలో సాధన కొనసాగించడం శిష్యత్వ లక్షణం. ఇద్దరు చేసే పని ఒక్కటే.

శిష్యులు లేనంత మాత్రాన ఎవరి యోగం ఆగిపోదు. గురువు అనే ముద్ర వుండదు. ఏం లేకపోతే? యోగం ప్రారంభించింది, చేస్తున్నది, ఎప్పుడో గురువు కావాలని, శిష్యులు లభిస్తారని కాదు. అలా అని నిజమైన సాధకుడు ఎప్పుడూ అనుకోడు. సాధకుని దృష్టి అది కానే కాదు. అతని లక్ష్యం అది కాదు. అనూహ్యంగా ఒక్కొక్కరు గురువు అయిపోయే పరిస్థితులు ఏర్పడతాయి. శిష్యునికి గురువు అవసరం ఉంటుంది. కాని, గురువుకు శిష్యుని అవసరం బొత్తిగా ఉండదు. ఒకరి అవసరం ఒకరికి ఉన్నప్పుడు అది అనుబంధం అవుతుంది. లేనప్పుడు ఒకరికి రెండవ వారు ప్రతిబంధం అవుతారు. బంధం ఎప్పుడూ ఉండదు. ఉండకూడదు. ఏ రోజునైనా విడిపోవడానికి, దూరం కావడానికి మానసికంగా సిద్ధమై ఉండాలి. గురువు యోగాభివృద్ధికి శిష్యులు ఎప్పుడూ ఆటంకమే. ఆయన కాలాన్ని వీరు హరించివేస్తుంటారు. తమ సమస్యలన్నీ గురువు నెత్తిన పెడతారు. పరిష్కరించమని కూర్చుంటారు. అవి పరిష్కారం కాకపోతే గురువు పైన అభాండాలు వేస్తారు. విషప్రచారం చేస్తుంటారు. గురువు దృష్టి యోగం పైన ఉంటుంది. వీరి దృష్టి ఎప్పుడూ తమకు జరిగే మేలుపైన ఉంటుంది. తమకు సుఖాలు, లాభాలు కావాలి. యోగం పైన దృష్టి తక్కువ. గురువు లేకుండా సాధన చేసుకోగలిగితే ఎంతో మంచిది. ఏ సమస్యలు తలెత్తవు. ఏది వచ్చినా సాధకుడు తానే బాధ్యత వహించవలసి ఉంటుంది. నిందించడానికి, ఆధారపడటానికి ఒక గురువంటూ తనకు లేనప్పుడు ఎవరిని నిందిస్తాడు? స్వతంత్ర సాధన వల్ల ప్రగతి ఆగిపోదు కాని, కాస్త ఆలస్యం కావచ్చు. అనుమానాలు సాధకుని ఆపివేస్తాయి. తన అభివృద్ధిని అంచనా వేసుకోలేడు. అందువల్లనే అనుభవజ్ఞుడైన సాధకుని కొత్తవారు గురువుగా భావించి

యోగం చేస్తారు. సాధకునకు కొన్ని కొన్ని సందర్భాలలో గురువు ఎంతగా అవసరమో, కొన్ని సందర్భాలలో అంతగా అనవసరం. సహాయ సహకారాలు కోరినంత మాత్రాన శిష్యుడై పోనవసరం లేదు. సహాయం చేసినంత మాత్రాన గురువునని ముద్ర వేసుకోవలసిన పనిలేదు. ఎవరూ జన్మతః గురువు కాదు. అది వారసత్వంగా వచ్చింది కాదు. చిరకాలం ఒక్కరే గురువుగా ఉండడమూ కుదరదు. శిష్యులైనవారు యోగంలో సమర్థులైనప్పుడు ప్రతి గురువు తప్పుకోవాలి. అప్పుడైనా తన సాధన తీవ్రతరం చేసుకుని, ఆదర్శవంతుడు కావాలి. అంటే ఆ పదవిపోతే సర్వం కోల్పోయినట్లు దిగులు పడిపోకూడదు. గురుశిష్యుల మధ్య ఉండవలసింది అనుబంధం. ఒకరి అవసరం ఒకరికి ఉండాలి. అది మైత్రిగా, ప్రేమగా మారితే మంచిది. ఒకరి హృదయం మరొకరు అర్థం చేసుకోవాలి. ఇద్దరి శరీరాలు వేరైనా ఆత్మ ఒక్కటేనన్నంత మమేకత్వం ఏర్పడాలి. గురువు ప్రతిబింబం శిష్యుడు అనిపించుకోవాలి. ఒక్క ఆకారంలో, రూపంలో తప్ప మిగిలిన అన్నింటా ఇద్దరి ప్రవర్తన, మాట, పలుకు, ఆంతర్యం ఒక్కటై మనగలగాలి. కానప్పుడు గురువైన వానికి తాను అధికుడిననే అహంకారం కలుగుతుంది. అహంకారం వెంట గర్వం, నాకు ఇంతమంది శిష్యులున్నారు, ఇన్ని వేలమంది భక్తులున్నారు, ఇన్ని దేశాలలో ఇన్ని శాఖలు ఏర్పడ్డాయి అనుకోవడంతో తాను కారణజన్ముడనని, లేకుంటే ఇంతమంది శిష్యులు ఏర్పడరని భావించి, వెంటనే తానొక అవతార పురుషుడినని ముద్ర వేసుకుంటాడు.

ఏవి కూడదో, ఏవి ఆధ్యాత్మికంగా అభివృద్ధికి ఆటంకాలో అవన్నీ ఒక్కటొక్కటిగా చోటు చేసుకుంటాయి. ఆయనగారు ఎదగటం మాట అటుంచి, పతనం చెందుతున్నట్లు భావించడు, గుర్తించడు. లక్షలాది శిష్యపరమాణువులు అతనిని ఆత్మ పరిశీలన చేసుకోనివ్వరు. ఆయనగారు ఆ మెట్టు దిగి వాస్తవాన్ని గుర్తించడు. బ్రతికి ఉన్నంత కాలం ఆ నాటకం' అలా సాగుతుంది. తర్వాత మిగిలేది ఏమీ ఉండదు. మిగలడానికి అలాంటి గురువులో ఏదైనా ఆత్మశక్తి జమపడితేకదా! శిష్యులను చేర్చుకోవడం, ఉపన్యాసాలివ్వడమే 'ఆత్మబోధ' అని నమ్ముతారు, నమ్మించజూస్తారు. తానే భగవంతుడినని, తన పేరు జపిస్తే చాలు మోక్ష ద్వారాలు తెరుచుకుంటాయని చెప్పడం, చేరినవారు నమ్మడంతో అదొక త్రిశంకు ప్రపంచం తయారవుతుంది. ఏ గురువుకైనా

తాను సహకరిస్తున్నాను అనే భావన ఉండవచ్చుగానీ తన యోగశక్తిని వారికి పంచి, వారందరినీ తానే ఉద్ధరిస్తున్నానే భావం ఉండకూడదు. అది అహంభావం అవుతుంది. ఎవరిని ఎవరూ ఉద్ధరించరు. ఎవరిని వారు ఉద్ధరించుకోవలసిందే. తన శిష్యులు ఉత్తచవటలని, అజ్ఞానులనీ, తానొక్కడే మహాజ్ఞానినని అనుకునే గురువు పప్పులో కాలు వేసినట్లే. గురువు కన్న బాగా చదువుకున్నవారు, జ్ఞానులు సైతం శిష్యులు కావచ్చు. శిష్యులని 'చిన్న'గా భావించకూడదు. శిష్యుడు తనతో సమానుడు అనుకునే 'మంచి' తనం లేకపోతే, కనీసం తన సహచరుడనుకోవాలి. ఇరువురు కలిసి చేసేది గొప్ప యోగం. ఎవరి అభివృద్ధి వారిది. పరస్పర సహకారం అవసరమైంది. అంతే. తన వద్దకు వచ్చిన వారంతా అజ్ఞానులు, వారంతా చీకటిలో ఉన్నారు, వారికి జ్ఞానం కలిగించే అర్హత తనకే వుంది, వారిని వెలుగులోకి నడిపించే బాధ్యత తనది అనుకునే గురువును మించిన అజ్ఞాని మరొకరుండరు. అసలు తనకు జ్ఞానం ఎలా కలిగింది? ఎంతకాలం పట్టింది? సింహావలోకనం ఎప్పుడూ అవసరమే. ఇప్పటి– తన శిష్యులు రేపు గురువులు అవుతారు. కొంతకాలం పడుతుంది. వారు తనను మించిన గురువులు, జ్ఞానులు కావచ్చు. ఆ క్రెడిట్ తనది కాదు. అందుకే గురు శిష్య సంబంధం తాత్కాలికమని, మైత్రి శాశ్వతమని భావించాలి. గురుశిష్యులు ఎప్పుడూ మంచి ప్రాణ స్నేహితులు కావాలి. ఆత్మ బంధువులు కావాలి. మరొకరి ఆత్మ తక్కువది, ఒకరి ఆత్మ ఎక్కువది కాదు.

యోగంలో ఎవరికైనా అనుభవం, అనుభూతి ప్రధానం. తమ అనుభవంతో చెప్పిన విషయాలకు ప్రామాణికత అవసరం లేదు. అలాంటివి పూర్వ గ్రంథాలలో వుండనవసరం లేదు. పూర్వం ఎవరికో అలాంటి అనుభవాలు కలిగి వుండనవసరం లేదు. ఎవరి అనుభవమూ పునరుక్తం కాదు. ఒకరికి కలిగిన అనుభవం మనకు కలిగిందంటే, అలాగే కలిగిందంటే అది మానసిక క్రియ తప్ప ఆధ్యాత్మికానుభవం మాత్రం కాదు. చాలామంది స్వామీజీలు అనుభవాలు లేక, సొంతంగా చెప్పేందుకు లేక, ధర్మోపన్యాసాలు చేసి కాలం గడుపుతుంటారు. ఏ భగవద్గీతనో, ఉపనిషత్తునో ఉదహరిస్తూ, ప్రస్తుతిస్తూ కాలం గడుపుతుంటారు. వారిలో స్వీయానుభవం, ప్రజ్ఞ ఉండవు. ఎన్నివేలమంది గీతపై ప్రసంగించలేదు! ఉపనిషత్తుల పై ఉపన్యసించలేదు! అవి విని ఎందరు సత్యా న్వేషణకు ఉపక్రమించారు? ఎందరు యోగసాధనకు

పూనుకున్నారు? ఈ స్వామీజీల జ్ఞానం పరిమితం. అది వారి సొంతం కాదు. స్వంతం అనడానికి యోగానుభవం ఏదీ? జ్ఞానులయినవారు నోరు విప్పరు! ఏముంది గంటల తరబడి ఘోషించడానికి! ఏమాత్రం ఆనందానుభూతి కలగాలన్నా, అనుభవం కలగాలన్నా సాధన ముఖ్యంగాని ఉపన్యాసాలు వినడం కాదు. ఆ రహస్యం తెలిసిన మహాత్ములు ధర్మప్రవచనాలు చేయరు. ధర్మఉపన్యాసాలు వల్లించరు. వెలుగు దర్శించిన వారికి చీకటితో పనేమిటి? ప్రజ్ఞ ప్రభవించిన తర్వాత చాలా తక్కువ మాట్లాడతారు. అదీ తమకు తెలిసింది చెప్పరు. తాము తెలుసుకున్నది చెబుతారు. ఇతరుల అనుభవాలు వల్లించరు. తమ అనుభవం చెబుతారు. అలాంటి వారిలో సత్యజ్యోతి ప్రకాశిస్తుంది. ఆ వెలుగును, లో వెలుగును గుర్తించ గలిగినవాడు శిష్యుడవుతాడు. ఆ వేలుగు సంపాదించినవాడే గురువు కావడానికి అర్హుడు. అలాంటి మహాత్ముల్ని మనం గురువులుగా ఆరాధించవచ్చు కాని వారు తాము గురువులమని అంగీకరించరు. గురువు ముద్ర వేసుకోవడం అంటే ఇతరుల్ని శాసించగల అధికారాన్ని పొందడం. ఇతరుల్ని తన శక్తితో ఉద్ధరిస్తానని అంగీకరించడం. సత్యాన్వేషి ఎవరిని శాసించగలడు? తనకు లొంగివున్న వానిని, అణిగి మణిగి వున్న వానిని శాసించగలడు. తనకు తనలో దర్శనమవుతున్న సత్యమే ఇతరులలో కనిపిస్తున్నప్పుడు వారిని ఎలా శాసించగలడు! తనకు అనుభవంలో తెలిసిన సత్యాన్ని మనకు తెలియచెప్పి, ఆ అనుభవం లాంటి అనుభవాలు పొందడానికి మనల్ని అర్హుల్ని చేసే వ్యక్తి గురువు.

"నేను చెప్పినట్లు నీవు నడుచుకోవాలి. నా ఆజ్ఞల్ని పాటించాలి. నేను ఉపదేశించిన మంత్రాన్ని ఎవరికీ చెప్పకూడదు. అలా చెప్పావో క్షణంలో నీ తపశ్శక్తి అంతా పోతుంది. జాగ్రత్త. నేను తప్ప మరొక గురువు దగ్గరకు పోకూడదు! అలా మరొక చోటికి వెళ్ళినా, మరొకరిని గురువుగా ఎన్నుకున్నా నీకు సర్వ పాపాలు చుట్టుకుంటాయి. నరకానికి వెడతావు" అని మరీ హెచ్చరిస్తారు పాపం గురువులు! వారికి ఎంత భయమో! తమ భండారం బయటపడుతుందని, తన మంత్రంలో పసలేదని మరొకరు గ్రహిస్తే కష్టం! అందుకే ఎవరివద్దకు వెళ్ళకుండా కట్టడిచేస్తారు. అష్టదిగ్బంధం చేస్తారు. అయినా ఎవరైనా తలతిక్కతో వెళ్ళదలిస్తే, తపశ్శక్తి పోతుందని, గురుద్రోహమని, నరకమని పిరికిమందు పోస్తారు! తపశ్శక్తి అంటూ ఏర్పడితే ఎక్కడికి పోతుంది అది

జేబులో డబ్బుకాదు ఒకరు అపహరించడానికి, పోగొట్టుకోడానికి. దీనితో ఆయన గారినే "గురుర్బ్రహ్మః, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః" అని పొగడాలి. అసలు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఎవరో, వారి కథాకమామిషు చెప్పడు. ఆయనకు తెలియదు. పరంపరగా ఒక శ్లోకాన్ని వల్లించడం తప్ప! ఎలాగో తన స్థానాన్ని భద్రపరచుకోవడం గురువుగారి పని. "ఏం ఈ శిష్యులంతా పోతేనేం? వీరితో నాకేం అవసరం! నా యోగం, తపస్సు నేను చేసుకుంటే నాకు ఆత్మానందం కలుగుతుంది కదా!" అని తృప్తి పడవచ్చు! ఉహూ! అలా తృప్తి చెందడు.

సత్యాన్వేషణ లక్ష్యంగా సాధనచేసే గురువు తన వంటి వారిని దగ్గరకు తీసుకుంటాడు. తాను ఏమీకానని తెలిసినవాడు అవతారమూర్తినని ఎలా చెప్పగలడు! శిష్యుడుగా చేరేవారు సత్వర ఫలితాలు ఆశిస్తారు తప్ప సుదీర్ఘ ప్రయాణానికి, సుదీర్ఘ సాధనకు సిద్ధం కారు. గురువు ఎప్పుడు తన శరీరం వదలుతాడా! అ పదవి దక్కించుకుందామా! అని చూస్తుంటారు! అయన చనిపోయిన మరునాడే తమ పేరుకు గురుత్వం కట్టబెట్టుకుంటారు. పదవి లేకపోతే పరపతి వుండదు. గురు పరంపర వారసత్వంగా రాదు. శిష్యులలో ఎవరికి గురువు అయ్యే అర్హత, యోగ్యత వుందో గురువు తెలిసినా చెప్పడు. చెప్పకూడదు. అది స్వయంప్రకాశం. ఆత్మజ్యోతి. గురువు అందుకు అంగీకరించినా పైనున్న మహాత్ములు అంగీకరించరు. సత్యలోకాలతో ఆత్మరూపులైవున్న మహాత్ముల అనుమతి, ఆశీస్సులు లేనిది ఎవరూ గురువు కాలేరు. గురుకృపకు పాత్రులు కావడం వేరు, గురుశక్తిని అందుకోవడం వేరు. సాధకుడు వినయవిధేయతలు కలిగిన వాడైతే, అంకితభావంతో వుండి, సమర్పణ చేసుకుంటే, గురువు నుండే కాదు, ఏ మహాత్ముని నుండి అయినా శక్తిని పొందవచ్చు. వారి అనుగ్రహం పొందవచ్చు. అది కష్టమేమీ కాదు. సాధకునిలో శరణాగతి తత్త్వం సంపూర్ణంగా నెలకొన్నప్పుడే అది సాధ్యం. స్వతంత్రమైన భక్తి ప్రపత్తులతో, అంటే ఒకరి పైన ఆధారపడకుండా, అర్థించ కుండా, అలాంటి అనుభవం కలిగితే, అంటే గురువు అనుగ్రహానికి పాత్రులమైతే ఫలితం అద్భుతంగా వుంటుంది. చాలా మంది గురువులు శిష్యుల పట్ల "నీకు ఇంత చేశాను, అంత చేశాను, నీవు నాకు శిష్యరికం చేస్తూనే ఉండాలి నేను చచ్చేవరకు" అన్నట్లు ప్రవర్తిస్తారు. కాదంటే గురుద్రోహమని వీరి భయం.

స్వతంత్రించడానికి గురువులు ఒప్పుకోరు. ఎవరైనా స్వతంత్రంగా వ్యవహరిస్తేనే తట్టుకోలేరు. ఏ శక్తి గురువు స్వంతం కాదు. అతని అర్హతే అతని శక్తి. అది జల వలె ఊరుతుంది గానీ నిలవ వుండదు. అయోగ్యుల విషయంలో, అనర్హుల విషయంలో, ఏ స్వార్థ ప్రయోజనాల కోసమో గురువు తన 'శక్తి'ని వెచ్చించడానికి ప్రయత్నించి విఫలమవుతుంటాడు, కారణం అవతలివారి అయోగ్యత. అదే సాధకుడు ఉత్తమ గుణ సంపన్నుడైతే, అంకిత భావంతో ఆశ్రయిస్తే, ఆ శక్తి బయటకొస్తుంది. సాధకునికి అందుతుంది. అయినప్పుడు తన శక్తి పై గురువుకు కంట్రోల్ ఉన్నట్లా? లేనట్లా? యోగశక్తిని అందరివలె గురువూ సంపాదించు కుంటాడు. కాని, ఆ శక్తిని ఇవ్వడానికి సాధకునికి అర్హత ప్రధాన లక్షణం.

యోగం ప్రారంభంలో కలిసి వున్నా, ముందుకు వెళ్ళినకొద్దీ ఎవరికి ఎవరు ఏమీ కారు. ఎవరి నడక వారిది. ఏ ఇద్దరూ కలిసి అడుగులు వేయలేరు. ఎన్నో ఆత్మలు యోగ భూములలో సంచరిస్తుంటాయి. ప్రయాణం అనంతంగా సాగుతూ ఉంటుంది. రోదసిలో నక్షత్రాల వలె, గ్రహాల వలె ఆత్మలు సైతం చీకటిలో మిణుగురుల్లా కచులుతుంటాయి. మెరుస్తుంటాయి. పై పైకి పోతుంటాయి. కొన్ని ఆత్మలు అలిసిపోయి దారి తప్పి, వెనుతిరిగి వస్తాయి. ముందుకుసాగే ఆత్మలు అసంఖ్యాకంగానే వుంటాయి. నాటికి రూపాలుండవు. పేర్లు ఉండవు. మహాత్మలు మనలాగా భౌతిక నిబంధనలకు కట్టుబడి ఉండవు. ఇది రమణ మహర్షి ఆత్మ అని, ఇది అరవిందుల ఆత్మ అని పోల్చుకోలేం. కాని అవి సంకల్పిస్తే, వాటి పూర్వ రూపాలు మనకు దర్శనమిస్తాయి. ఆపీ ఆత్మ శరీరం నుండి ఒక మెట్టు దిగి అరూప, రూప శరీరాలు, భావ శరీరాలు ధరించవలసి వస్తుంది. మహాత్మలు మనకోసం వెనుతిరిగి రావు. వారికి రాబుద్ధి కాదు. మన సంకల్పం చాలా బలంగా వుండి, మన ఆత్మల్ని వారి మహాత్మలతో లింక్ చేస్తే, అప్పుడు తమనెవరో సంకల్పిస్తున్నారనే స్పృహ కలిగి, ఇటు చూడటం, అనుగ్రహించడం జరుగుతుంది. అంతేగానీ, మనం కలల్లో చూచినా, భావంతో తెలుసుకున్నా అవి మహాత్మల రూపాలు కాదు. అరూప భావచిత్రాలు మాత్రమే. ప్రేరణతో ఉత్తేజం పొంది చైతన్యంతో ముందుకు సాగడమే సాధకుని లక్ష్యం కావాలి.

# 7. మానవుడులో కరుణ ఎలా వస్తుంది?

'ధ్యాన'మే అన్నింటికీ మూలం. కరుణ ఆ మూలంలోంచి ఉప్పొంగి పొర్ల ప్రవహించే ప్రవాహం. ధ్యానప్రవృత్తి లేనివాడు ప్రేమించే శక్తినీ, కరుణ శక్తినీ, ఆనందోత్సవాన్ని పంచుకునే శక్తినీ లేనివాడే అవుతాడు. ధ్యాని కానివాడు తన మూలాధార శక్తితో సైతం సంబంధం తెగిపోయిన వాడే అవుతాడు. శక్తి సాగరంతో సంబంధం లేని వాడే అవుతాడు. ఆహారం. ద్వారా, శ్వాస ద్వారా, పదార్థాల ద్వారా లభించే ఓ స్వల్పమైన శక్తితోనే తన జీవితాన్ని వెళ్ళబుచ్చుతూ, భౌతిక శక్తి తోనే తన జీవితాన్ని వెళ్ళబుచ్చుతూ, భౌతిక శక్తి మీదే ఆధారపడి బతికేస్తూ ఉంటాడు. భౌతికశక్తికి పరిమితులున్నాయి. కాల ప్రవాహంలో ఏదో ఓ క్షణాన్న జన్మించి, మరో క్షణంలో అంతమై పోయే శక్తి అది. కేవలం జీవన్మరణాల మధ్య మాత్రమే దాని ఉనికి ఉంటుంది. నూనె మీద ఆధారపడి వెలిగే దీపం లాంటిది అది. నూనె అయిపోగానే దీపం ఆరిపోయేట్లుగానే ఈ భౌతికశక్తి ఉనికి కూడా ఉంటుంది. .

ధ్యాని అనంతాన్ని గురించి కొంత తెలుసుకోగలిగి అవధుల్లేని శక్తిమూలంతో బలంగా అనుసంధింపబడతాడు. అతని దీపకళిక ఎప్పటికీ ఆరిపోదు! ఆ దీపశిఖ ఎప్పటికీ క్షీణించదు! ఎప్పటికీ మాయమైపోలేని వెలుగుజ్వాల అది – ఎందుకంటే ఎప్పుడూ ప్రత్యక్షం కాని కాంతిరేఖ అది. దానికి అంతం లేదు, ఆరంభం కూడా లేనిది కనుక.

ఆ అనంత జీవాధారంతో, ఆ అనంత సంపదతో తన ఆత్మను అనుసంధించుకోవడం ఎలా? ఆ అవధుల్లేని శక్తి మూలాన్ని మీరు "దేవుడు" అనీ, 'సత్యం' అనీ, లేకపోతే మీకు నచ్చిన మరో పేరుతో కానీ ఉదహరించుకోవచ్చు. కానీ ఒక్క విషయం మాత్రం ఖచ్చితంగా నిజం : ఆ అనంత సాగరంలో మానవుడూ ఓ కెరటమే. ఆ కెరటం ఒక్కసారి వెనక్కు తిరిగి చూసుకుంటే దానికి అనంత సాగరమే కనిపిస్తుంది. బాహ్యం వైపు చూపుతో ఉరుకులు పెడుతూన్నంత వరకూ దానికి మూలంతో వున్న మౌలిక సంబంధం కనిపించదు. తన ఉనికి నుండి తానే దూరమై, తన సామ్రాజ్యం నుండి తానే బహిష్కరింపబడుతూ ఉంటుంది. దీన్నే జీసస్ 'దివ్య సామ్రాజ్యం' అన్నాడు. ఆయన పదే పదే "దివ్య సామ్రాజ్యం మీలోనే ఉంది, అంతర్యానం చేసి చూడండి" అని చెబుతూ ఉండేవాడు.

ధ్యానం మిమ్మల్ని మీ అంతరంగానికి అనుసంధించే వారధే తప్ప మరొకటి కాదు. ధ్యానం మీలో స్థితమైన తరువాత ఇక మిగిలింది కరుణాంతరం మీలో ఏర్పడడమే. అతీషా బోధనలకు ఆద్యుడైన బుద్ధుడు "కరుణ" అన్నది మీలో ప్రతిష్ఠింపబడేంతవరకూ ధ్యానంతో సంతృప్తి పడి ఊరుకోవద్దని ప్రబోధించాడు. ధ్యానం మీలో స్థితమైనప్పుడు మీరు సగం దూరాన్నే అందుకున్నట్లు అర్థం చేసుకోవాలి. మిగిలిన సగాన్ని కూడా మీరు పయనించి తీరాలి. ధ్యానం మీలో కరుణగా ఉప్పొంగి తీరుతుంది. ఓ ప్రమిదను వెలిగించిన తక్షణం అది వెలుగుల్ని అన్ని దిశల్లో విరజిమ్మినట్లు, తక్షణం అంధకారాన్ని తరిమికొట్టే ప్రయత్నాన్ని ప్రారంభించినట్లు, 'ధ్యానజ్యోతి' మీలో వెలిగిన తక్షణం ఓ "కరుణా ప్రభ" దాని నుండి బయల్వెడలుతుంది.

ధ్యాన ప్రవృత్తి మీలో స్థితమయిందన్న విషయానికి ఋజువు కరుణ మీలోంచి ఉప్పొంగి వస్తూ కనిపించడమే! మీ అంతరంగంలో సహస్ర దళ కమలం విచ్చుకున్నప్పటి పరిమళమే ఈ ప్రేమ'! "మీరు ఇదివరకు ఉన్నటువంటి మనిషి కాదనీ, ఓ వసంతం మీలో వెలిగిందనీ అది నిరూపిస్తుంది. మీ పాత మనుగడ అంతమై, ఓ నవ్య వ్యక్తిత్వం మీలో ఏర్పడిందనీ, ఇప్పటి వరకూ లాగా మీ ప్రస్తుతపు ఉనికి అంధకారంలో కాదనీ, మీరే ఆ వెలుగనీ అది నిరూపిస్తుంది."

# 8. ధ్యానం

ధ్యాన మంటే చిత్తంలో ఏ సంతాపము, ఏ ప్రశ్న, ఏ జిజ్ఞాస లేని స్థితి, మనము నిరంతరము జీవన సత్య సంబంధంలో ఏదో ఒకటి అడుగుతూ ఉంటాము. జీవన సత్య సంబంధంలో అడగని మనిషిని వెతకడం కష్టము. మనకు తెలియదు. నేనెవరు? మనకు తెలియదు మన నలువైపుల వ్యాపించి ఉన్న జగత్తు ఏమిటి? ఏ సమాధానము ఏ జవాబు లేకుండానే జీవిస్తున్నాము. మనిషికి నలువైపుల అనేక రకాల ప్రశ్నలు ఉన్నాయి. **ఈ ప్రశ్నలలో ఎంతో జీవన మూల సంబంధముంది. ఎలా - నేనెవరు? నా అస్తిత్వమేమిటి? నేను తప్పకుండా ఉండవలసిన అవసరమేముంది? మరి నేనెవరు? జీవనములో ఈ జన్మము, మృత్యువు ఈ సమస్త వ్యాపారమెందుకు? ఇది తెలుసుకోవాలన్న కోరిక ప్రతి ఒక్క వ్యక్తి మనసులో ఉంది. అతడు ఏ ధర్మములో ఏ దేశములో జన్మించినా...**

ఈ జిజ్ఞాసను పరిష్కరించడానికి రెండు మార్గాలున్నవి. ఒక మార్గము ఫిలాసఫీ, తత్వజ్ఞానముతో మనము ఆలోచించవచ్చు, విచారించవచ్చు మనమెవ్వరము? ఎందుకోసమున్నాము? జీవన సమస్యను చింతన, విచారము ద్వారా వెతికి నిర్ణయించుట బుద్ధితో సంబంధం ఉంది. పశ్చిమదేశాలు సత్యాన్ని ఈ మార్గం ద్వారా తెలుసుకొని ఫిలాసఫీకి జన్మనిచ్చాయి. భారతీయులు దర్శనాన్ని ఫిలాసఫీ అంటారు. కాని ఈ రెండు శబ్దాలు సమాన అర్థాన్ని ఇవ్వవు. గత రెండు వేల ఐదు వందల సంవత్సరాలలో పశ్చిమదేశస్తులు చింతన ద్వారా ఏమియు నిర్ణయించలేకపోయారు. ఒకరిచింతసకు మరొకరిచింతనకు ఏకాభిప్రాయం ఉండదు. ఒక చింతకుడు యువ అవస్థలో చెప్పినది వృద్ధ అవస్థలో మార్చును. నేడు చెప్పినది రేపు మారిపోవును. చింతన నిత్య సత్యం వైపుకు మరియు శాశ్వతము వైపుకు తీసుకెళ్ళదు.

అసలు ఆలోచన అనేది తీసుకెళ్ళదు. ఆలోచన అర్థం: మనకు తెలియని దాని సంబంధంలో విచారించుట. అంధుడు ప్రకాశసంబంధంలో ఏమి ఆలోచించగలడు? కన్ను లేని వాడు ప్రకాశసంబంధంలో విచారించే ఉపాయమేలేదు. ఏదో ఆలోచించవచ్చు కానీ అది చీకటిలో వెతికినట్లు అవుతుంది. మీరు అనుకోవచ్చు. అంధునికి కనీసం అంధకారము అగుపడును. కాని అంధునికి అంధకారము కూడా అగుపడదు.

అంధకారము చూచుటకుకూడా కన్ను అవసరము. అంధునికి అంధకారము మరియు ప్రకాశము రెండు అగుపడవు. మన మందరము జీవన సత్య సంబంధంలో అంధులము. మనము ఏది ఆలోచించినా విచారించినా ఏ సమాధానము లభించదు. ఇందుకే భారతీయులు చూసే పద్ధతిని ఒక క్రొత్త ద్వారాన్ని తెరిచే ప్రయత్నము చేశారు. ఆ ద్వారము చింతనది కాదు దర్శనముది.

**దర్శన అర్థం: సత్యాన్ని ఆలోచించుట కాదు, సత్యాన్ని చూచుట.** విచారించుట మరియు చూచుటలో చాలా బేదముంది. మనము సత్యాన్ని విచారించ్చదలచినచో విచారించలేము. మనము సత్యాన్ని చూడదలచినచో చూడగలము. అప్పుడు తర్కం సహకరించక యోగం సహకరించును. చింతనకు తర్కం సహకరించును. ఇందుకే తూర్పు దేశాలలో దర్శనము వెంట యోగం వికసించింది. పశ్చిమ దేశాలలో ఫిలాసఫీ వెంట తర్కం వికసించింది. చింతనకు పుష్టి తర్కము, దర్శనానికి పుష్టి యోగం. మనము చూసినచో అగుపడనిచో అక్కడ ఈశ్వరుడు లేదా ఆత్మలేదని కాదు మన వద్ద దానిని సంవేదించే, తెలుసుకొనే కన్ను లేదు. సత్యం లేదని కాదు, కన్ను లేదు. ఒకవేళ నా వద్ద కన్ను ఉంటే ఏది ఉందో అది తప్పక అగుపడును, ఒకవేళ నా వద్ద కన్ను లేనట్లైతే ఏది ఉందో అది నా కొరకు లేనట్లే. ఇందుకే భారతీయ దర్శన శాస్త్రములో మనుష్యుని లోపల అంతఃచక్షువు, లోపలి కన్నును వికసితం చేసింది.

మౌలుంకపుత్త అను యువకుడు బుద్ధుని వద్దకు వెళ్ళి పదకొండు ప్రశ్నలు అడిగాడు. ఆ పదకొండు ప్రశ్నలతో తత్వచింతన చేస్తే, జీవన సమస్త సమస్యలు ప్రారంభమవుతాయి. అతి మధుర సంవాదము జరిగింది. బుద్ధుడన్నాడు, నా ఒక మాటవింటావా? ఒక సంవత్సరము నా వద్ద ఆగి నిరీక్షించగలవా? ఒక సంవత్సరం తురువాత అడుగు, నేను జవాబు ఇస్తాను. మౌలుంకపుత్త అన్నాడు: ఒకవేళ జవాబు తెలిస్తే ఇప్పుడే చెప్పు. ఒకవేళ తెలియనిచో తెలియదని చెప్పు, నేను వెళతాను, జవాబు ఇవ్వడానికి ఒక సంవత్సరము ఆలోచించ వలసివస్తుందా? బుద్ధుడన్నాడు "నా కంటే ముందర కూడా నీవు ఇవే ప్రశ్నలు ఎందరినో అడిగి ఉండవచ్చు. మౌలుంకపుత్త అన్నాడు అనేక మందిని అడిగాను. కాని వారు వెంటనే జవాబిచ్చారు. ఎవరు ఇన్ని రోజులు ఆగుమని అనలేదు.

బుద్ధుడన్నాడు: ఒకవేళ ఆ జవాబులు నిజానికి జవాబులు అయిఉంటే మరల మరల అవే ప్రశ్నలు అడగవలసిన అవసరమేముండే? ఇందులో సందేహము లేదు నీవు మరల అడుగు తున్నావంటే అవి జవాబులుకావు. నేను కూడా నీకు ఇప్పుడే సాక్షి సాధన జవాబు ఇవ్వగలను, కాని ఇతరుల ద్వారా ఇవ్వబడ్డ జవాబు ఇవ్వగలను, కాని ఇతరుల ద్వారా ఇవ్వబడ్డ జవాబులు వ్యర్థమగును. జవాబు నీలోనే జన్మించాలి. ఇందుకే నేనంటాను ఒక సంవత్సరము ఆగమని ఒకవేళ సంవత్సరం తరువాత అడుగుతే నేను జవాబు ఇస్తాను.

బుద్ధుని ఒక శిష్యుడు ఆనందుడు నవ్వుతూ మౌలుంకపుత్తతో అన్నాడు, నీవు ఆయన మాటల మధ్యలరాకు. నేను అతని వెంబడి 20 సంవత్సరములనుండి ఉంటున్నాను. ఇలానే ఎంతో మంది ఎన్నో ప్రశ్నలు అడిగారు. బుద్ధుడు అందరితో ఇదే అంటాడు, సంవత్సరము, రెండు సంవత్సరాలు ఆగండి. నేనుకూడా సంవత్సరము రెండు సంవత్సరాలు ఆగి ఎదురు చూస్తున్నాను ఏదైన జవాబు లభిస్తుందేమోనని కాని ఎందుకో తెలియదు సంవత్సరము రెండు సంవత్సరముల తరువాత వారు ప్రశ్ననే అడగరు. బుద్ధుని జవాబు ఎమిటో ఇప్పటి వరకు తెలియలేదు. ఇందుకే నీకు అడగాలని ఉంటే ఇప్పుడే అడుగు, ఇదైతే నిశ్చయం ఎలాగో సంవత్సరము తరువాత నీవు అడగవు. బుద్ధుడన్నాడు, నేను ఇచ్చిన మాట తప్పను, నీవు అడిగితే తప్పక చెప్పుతాను. నీవు అడుగకపోతే అది వేరే మాట. మౌలుంకపుత్తు సంవత్సరము ఆగాడు. సంవత్సరము తరువాత బుద్ధుడు అన్నాడు అడుగుతావా? అతడు నవ్వి అన్నాడు "అడుగవలసిన అవసరము లేదు."

భారతీయులు సత్య సంబంధ విషయంలో బయటినుండి జవాబు పొందరు, లోపల ఒక ద్వారాన్ని తెర్చెదరు ఆ ద్వారము తెరుచుకుంటే ప్రశ్నకు జవాబు వస్తుందని కాదు, అసలు ప్రశ్నలే పడిపోతాయి ప్రశ్నలకు జవాబు లభించడం ఒక మాట. ప్రశ్నలు పడి పోవటము పూర్తిగా వేరే మాట. జవాబు లభించడం మహత్వ పూర్ణము కాదు. మహత్వపూర్ణమేమిటంటే ప్రశ్నలు పడిపోవుట. భారతదేశము యోగ ప్రయోగము ద్వారా కొంత సారము నిచ్చింది. అందులో ఒకటి ప్రశ్నలు మన అశాంత వ్యాకుల చిత్త ఉత్పత్తి. చిత్తం శాంతమైతే ప్రశ్న ఉత్పన్నము కాదు. ఈశ్వరునికి సంబంధించిన, జన్మ

మృత్యువుకు సంబంధించిన వ్యాకుల సమస్త ప్రశ్నలన్నీ అశాంత, వ్యాకులచిత్త ఉత్పత్తే అగును. చిత్తం శాంతమైతే అవన్నీ విసర్జితమగును. ప్రశ్నలు లేనిచో జ్ఞాని అగును. ప్రశ్నల జవాబులు పొందితే పండితుడగును. ప్రశ్నలకు జవాబు పొందడము బుద్ధి సంబంధం, ప్రశ్నలు విసర్జన మగుట ఆత్మ సంబంధం.

దానిని నేను ధ్యాన మంటాను, దానితో ప్రశ్నలకు జవాబు లభించదు, క్రమంగా మెల్ల మెల్లగా ప్రశ్నలు విసర్జితమగును. ప్రశ్న లేని చిత్తస్థితియే సమాధానము, అదే సమాధి. అక్కడ ఏ ప్రశ్న ఏ కోరిక వ్యాకులత వెతికినా లభించదు. ఇంకా తెలుసుకోవలసినది లేని స్థితిలో సత్య సాక్షాత్కారం లభించును. ప్రశ్నలున్నచో సత్యాన్ని వెతకలేవు, ప్రశ్నలు పడిపోగానే సత్యం ప్రకటితమగును. సమాధి అర్థం సమాధానము. సమాధానము, జ్ఞానము మరో వ్యక్తి వచ్చి నీకు ఇవ్వలేడు. అలా ఇచ్చేవాడు మోసగాడు. నీ అజ్ఞానమును పెంచుతున్నాడు. అతనికి సత్యం తెలియదు. ఇందుకే బుద్ధ పురుషులు, అవతార పురుషులు జ్ఞానమిస్తామని అనరు. వారు కేవలము జ్ఞానము ఎలా లభిస్తుందో ఎలా పొందవచ్చునో ఆ విధిని చర్చిస్తారు. మీకు సరిగా అనిపిస్తే ప్రయోగం చేయమంటారు. జ్ఞానము, సత్యము ఇవ్వబడదు. సత్యము ఏమిటి? జవాబు ఫిలాసఫర్ ఇస్తాడు. సత్యము ఎలా పొందవచ్చు అనేదానికి జవాబు యోగి ఇస్తాడు. అంతఃచక్షువు ఎలా తెరచుకొనును? సత్య సాక్షాత్కరము ఎలా అవుతుంది అనేది యోగం చెప్పగలదు.. .

జపాన్లో రింఝుఈ అనే సాధువు ఉండేవాడు, అతని ఆశ్రమములో 500 భిక్షువులు ఉండేవారు. జపాన్ చక్రవర్తి ఆశ్రమము చూడడానికి వస్తే ఆశ్రమమంతా చూయించాడు. మధ్యలో ఒక పెద్ద విశాల, సుందర, శాంత భవనం ఉంది. దాని గురించి చక్రవర్తి అడిగితే చివరకు చెపుతానని భోజన శాల, నివాస స్థానం, అధ్యయనశాల, వ్యాయమశాల, తోట, గ్రంథాలయము అన్ని చూయించాడు. చక్రవర్తి ఆశ్రమము పూర్తిగా చూచి వెళ్ళేసమయాన మరల అడిగాడు, ఆ భవనములో భిక్షువులు ఏమిచేస్తారో చెప్పనే లేదు. ఆ సాధువు అన్నాడు. అక్కడ సన్యాసులు ఏమిచేయరు, అక్కడ తనను ఏమిచేయని స్థితిలో వదులుతారు. అది ధ్యానభవనము. మిగతా ఆశ్రమములో ఏదో పని, క్రియ జరుగును. అక్కడ సమస్తపనులు, వదిలి మౌనంగా వుండేందుకు వెళ్ళుతారు.

ధ్యానం క్రియకాదు. మీరు అనుకోవచ్చు కూర్చొని ఏదో చేస్తారు, అది ధ్యానం కాదు, ధ్యాన అర్థం చిత్రంలో నిరంతరము నడుస్తున్న పనులన్నింటికి విశ్రాంతి నివ్వడం. చిత్తాన్ని పూర్తిగా క్రియా శూన్యంలో వదలాలి. ఆ క్రియా శూన్య స్థితిలో కేవలము దర్శనం మాత్రమే వుండును. కేవలము చూడడం అనేదే ఉండును. ఆ స్థితిలో, మన స్వభావం వుంటుంది.

దర్శనము, జ్ఞానం మన స్వభావము. మనము సర్వము త్యజించవచ్చు, కానీ జ్ఞానాన్నీ, దర్శనాన్ని మాత్రం త్యజించలేము. ఎల్లప్పుడు 24 గంటలు జ్ఞానం మన వెంటనే వుండును. గాఢనిద్రలో, స్వప్నంలో, సుషుప్తిలో కూడా ఉండును. మనము ఉదయము లేచి అంటాము, రాత్రి చాల ఆనందపూర్ణనిద్ర ఉండెను. రాత్రి చాలా ఆనందంగా గడిచింది. అప్పుడు కూడా మనలో ఎవరో మేల్కొని ఉన్నారు, ఏదో చైతన్యము ఉంది. లేస్తే-కూర్చుంటే, నిద్రిస్తే - మేల్కొంటే పనిచేసిన, చేయక పోయిన మనలోపల సతతము ఎల్లప్పుడు జ్ఞానము అవిచ్చిన్నంగా ప్రవహించుచునే ఉండును. కేవలము ఉన్నాను, అని మాత్రమే తెలుస్తుంది. ఉన్న బోధ, ఉనికి, అస్తిత్వబోధ మాత్రం మిగిలి ఉండును.

ఆ బోధలో, ఆ ఉనికిలో, ఆ అస్తిత్వములో దూకడము ధర్మము. అక్కడ, ఏ అనుభవము అవుతుందో, అది జీవన సమస్త బంధనములనుండి మరియు జీవన ఆసక్తి, ఆశ, దుఃఖం, పీడ, పాపము నుండి విముక్తి చేయును. ఇవన్ని దాన్ని మలినము చేయలేవు. ఆ చైతన్యము నిత్యశాంతి, నిత్యముక్తి, నిత్య బ్రహ్మస్థితిలో ఉండును. ఆ ధర్శనాన్ని, ఆ ప్రకాశాన్ని, ఆ ఆనంద అనుభూతినే నేను ధ్యానం, సమాధి అంటాను. ఏ విధమైన వ్యవస్థ, క్రియ లేకుండా పరిపూర్ణ శూన్యమే ధ్యానము.

వ్యక్తి ఆ పరిపూర్ణ శూన్యము కావాలనుకుంటే, అతడు మూడు అంశములపై ప్రయోగము చేయవలెను. మొదటిది శరీరం పై శరీరాన్ని ఏ విదమైన క్రియ, కదలిక లేకుండా వదులుగా ఉండవలెను. మృత్యువులో శరీరాన్ని వదిలినట్లు ఉండాలి. అప్పుడా శరీరము ఏ బిగింపు, బిగువు లేకుండా వుండటం వల్ల చిత్తము శాంతమగును.

మీకు అనుభవము ఉండవచ్చు, శరీరములో ఎక్కడైన బిగువు, నొప్పి ఉన్నచో చిత్తము అక్కడికే వెళ్ళును. తలనొప్పి ఉంటే తల తెలియును. శరీరము అనారోగ్యంగా

ఉంటే శరీరము తెలియును. శరీరము ఆరోగ్యంగా ఉంటే శరీరము ఉన్నట్లే తెలియదు. శరీరాన్ని పూర్తిగా వదులుగా విడ్చినచో దాని సమస్త బిగింపులు విలీనమగును. అప్పుడు శరీర బోధనే ఉండదు. కొన్ని రోజులు ఈ ప్రయోగము చేసినచో శరీర బోధ విసర్జితమగును. శరీర బిగువు పూర్తిగా శూన్యమగుటకు, శరీరముతో ముక్తమగుటకు ఇది చాలా మంచి ఉపాయము. ఇందుకే ధ్యాన మొదటి చరణములో శరీరాన్ని వదులుగా ఉండవలెను.

ఇప్పుడు ధ్యాన ప్రయోగము ప్రారంభిస్తాం, శరీరాన్ని పూర్తిగా వదలుగా ఉంచాలి. శవమైనట్లు ప్రాణమేలేదు, అనేవిధంగా మట్టి ముద్దలా పడి ఉండనివ్వాలి. శరీరములో బిగువు, పట్టు ఉండకూడదు. నేను రెండు నిమిషాల వరకు మీ సహాయోగం కొరకు సూచన లిస్తాను, మీ శరీరము శిథిలమవుతుంది, వదులౌతుంది. మీరు కూడా ఆ భావము చేయాలి. భావములో ఇంత శక్తి ఉంది. ఒకసారి సంకల్ప పూర్వకంగా భావము చేసినచో ప్రాణము శరీరాన్ని విడువవచ్చు. దానిని ఇచ్ఛామృత్యువు అంటారు, కేవలము భావము చేసినంత మాత్రాన శరీరము అలాగే అవుతుంది.

ఒకవేళ మనము పరిపూర్ణ, సమగ్ర చిత్తంతో భావము చేసినచో రెండు నిమిషాలలో శరీరములో ప్రాణం లేనట్లు అగును, శిథిలమగును. ఆ స్థితిలో శరీరము క్రింద పడినచో ఆపకూడదు, పడిపోవాలి. తరువాత రెండు నిమిషాలు శ్వాస శాంతమవుతుందని భావము చేయాలి. రెండు నిమిషాలలో శ్వాస కూడా శాంత మగును. మనము పరిపూర్ణ శూన్యము లోకి వెళ్ళాలంటే శరీరము శిథిలము మరియు శ్వాస శాంతము తప్పక కావాలి. ఆ తరువాత రెండు నిమిషాల వరకు భావము చేయాలి. చిత్తము మౌనమవుతుంది. విచారాలు శూన్యనువుతున్నాయి. రెండు నిమిషాల వరకు ఈ భావము చేసినచో విచారాలు శూన్యమైపోతాయి. .

ఈ ఆరు నిమిషాల చిన్న ప్రక్రియలో మీరు అకస్మాత్తుగా ఒక రిక్త స్థానములో ఒక ఆకాశములో, ఒక శూన్యములో ప్రవేశించెదరు. చిత్తము మౌనమైపోవును. లోపల వాణి , శబ్దాలు లేచి విలీనమగును, లోపల ఒక రిక్త స్థానము, ఖాళీ స్థలము ఉండును, అక్కడ ఏమియు ఉండదు. అక్కడ ఏ విచారము, ఏ ఆలోచన, ఏ రూపము, ఏ ఆకృతి, ఏ గ్రంథము, ఏ ధ్వని, ఏదియు ఉండదు. కేవలము మీరు ఒంటరిగా ఉందురు. ఆ

ఒంటరి తనములో, ఆ లోన్లీనెస్లో ఆ రిక్త ఆకాశములోనే 'స్వ' తన అనుభవమగును. దానినే మహావీరుడు ఆత్మ అన్నాడు, బుద్ధుడు శూన్యమన్నాడు, శంకరుడు బ్రహ్మ అన్నాడు, ఎందరో ఎన్నో పేర్లు ఇచ్చారు. ఆ సత్య అనుభవము ఆ అత్యంత ఏకాంతములో అగును.

మనము ఏకాంతాన్ని అడవిలో, పర్వతాల మీద వెతుకుతాము. కాని ఏకాంతానికి సంబంధము స్థానముతో లేదు, మనం ఉండే స్థితితో సంబంధం ఉంది. అడవిలో పశుపక్షులతో సంబంధము ఏర్పడును. ఏకాంతాన్ని అడవికి వెళ్ళి వెతుకలేము. ఏకాంతాన్ని మనలోపలే పొందవచ్చు, ఎక్కడ అంత రిక్తమై కేవలము నేను మాత్రం ఉంటానో, అక్కడ పొందిన అనుభవము జీవనములో క్రాంతి నిచ్చును. దాని కొరకు, అతి చిన్న సరళ ప్రయోగము ద్వారా ఇంత గొప్ప సాక్షాత్కరము, ఎలా లభించును? కాని బీజము ఎల్లప్పుడు చిన్నగానే ఉండును, పరిణామములో వృక్షము విరాటమగును. బీజము చిన్నదనుకొన్నచో, ఆ వృక్షముతో వంచితులగుదురు. అత్యంత సూక్ష్మ ధ్యాన బీజము నాటినచో, ఆ అనుభవ విరాట వృక్ష పుష్పఫలములను పొందెదరు.

ఒక అతి ప్రాచీన కథ ఈ కథ పూర్తిగా అబద్ధమైన, నాకు అర్థపూర్ణంగా ఉంది.

నారదుడు వైకుంఠము వెళ్ళుతుండగా, మార్గ మధ్యలో ఒక వృద్ధ సన్యాసి తపస్సు చేస్తూ కలుస్తాడు. అతడన్నాడు. మీరు ప్రభవుతో అడగాలి నాకు మోక్షము ఎప్పుడు లభిస్తుందని, నారదుడు సరే అని అన్నాడు. ప్రక్కనే మరొక యువసన్యాసి కీర్తన చేస్తూనృత్యము చేస్తు కనిపిస్తాడు. నారదుడే వెళ్ళి అతన్ని అడిగాడు, నేను వైకుంఠం వెళ్ళుతున్నాను మీ విషయమేమన్న అడగాలా? ఆ సన్యాసి మాట్లాడనే లేదు.

నారదుడు తిరిగి వచ్చి ఆ వృద్ధు సన్యాసితో అన్నాడు, "ఇంక మీకు మూడు జన్మలు కావాలట!" ఆ వృద్ధ సన్యాసి కోపంగా మాలను క్రిందపడేసి అన్నాడు, "నేను ఇన్ని సంవత్సరాల నుండి చేస్తున్నాను ఇంక మూడు జన్మలా? మూడు జన్మలు నిరీక్షించే ధైర్యము నాకు లేదు అని అంటాడు. నారదుడు ఆ యువ సన్యాసి వద్దకెళ్ళి ఇలా అంటాడు మీ విషయంలో కూడా అడిగాను, ప్రభువు అన్నాడు "మీరు ఏ చెట్టు క్రింద ఉన్నారో ఆ చెట్టు ఆకులన్ని జన్మలు సాధన చేసినచో మీకు మోక్షము లభించునట! ఆ సన్యాసి సంతోషముతో అన్నాడు, "ఇన్నే ఆకులా! మొత్తానికి దొరుకుతుంది కదా సంతోషం, ప్రపంచములో ఉన్న చెట్ల ఆకులకంటే చాలా తక్కువ కదా అని ఆడ సాగాడు". కథ చెప్పుతుంది. అతడు అదే క్షణాన ముక్తుడైయ్యాడని. .

అధైర్యము బాధ. అధైర్యము సమయాన్ని పోడిగించును. ఒక వేళ అనంత ధైర్యముతో సాధన చేసినచో ఒక క్షణము లోనే శాంతం లభించును. అధైర్య పరిణామము చింత, ప్రయోజనం, కోరిక వీటినన్నింటిని వదిలి సమగ్రంగా సాధన చేసినచో కొన్ని రోజులలోనే ఏదో అగుట అగుపడును. దానికంటే మూల్యమైనది మరేది ఉండదు.

నేను ఆశిస్తున్నాను మీరు ప్రయోగము చేయగలరు. ఒకవేళ ధైర్యముతో ప్రయోగము చేసినచో పరిణామము నిశ్చితము. శాంతమయ్యే, స్వయమును, సత్యాన్ని, తెలుసుకొనే ఉపాయము మరొకటి లేదు. ధర్మ గ్రంథాలు ఏది ఇవ్వలేదో, అది మనలో దిగినచో ఉపలబ్దమగును.

అమృతము, అనంతాన్ని, నిత్య చైతన్యాన్ని పొందే మార్గము ఒకటే ఉంది, అది ఏదో విధంగా బయటి జగత్తును చూసే కన్ను, లోపల చూడాలి. కన్ను లోపల చూసినచో శూన్యము ఘటించును. విచారాలు శూన్యం కాగానే బయట చూడడానికి ఏమి మిగులదు. ఎప్పుడయితే బయట చూసేది ఏమి లేనిచో, చూసే శక్తి, దర్శన శక్తి బయట చిక్కుకొని ఉండదు. శక్తికి బయట ఆధారములేనందున అది స్వ-ఆధారమగును. ఆ చేతనానికి బయట నిలిచే స్థానం దొరకనిచో, అది తప్పక స్వయం లో నిలుచును. ఇందుకే శూన్యము తప్ప మరే ధ్యానము లేదు. మీరు ప్రయోగము చేయగలరని ఆశిస్తున్నాను.

# 9. సమాధి

సమాధి సాధించబడదు, కాని అది రావచ్చు. ఇది తెలుసుకోవలసిన మొదటి మాట. మనం ఇంట్లోకి సూర్యుని ప్రకాశాన్ని మూటలో కట్టి తేలేము, కాని ద్వారాన్ని తెరిచి పెట్టినచో ప్రకాశము రావచ్చు. తీసుకురాబడదు, రావచ్చు. సమాధి రావడానికి ద్వారము తెరిచి ఉంచాలి. ఇది అత్యంత ఉపేక్షకరమైన పని. కేవలము బాధలు తొలిగిస్తే సమాధి వస్తుంది.

ఒక చిన్న ఘటనతో ఈ మాటను అర్థం చేయించే ప్రయత్నం చేస్తాను.

రవీంద్రనాథ్ తన అధిక జీవన రాత్రులు పెద్ద పడవలో నది మీద గడిపాడు. ఇందుకే అతని కావ్యములో ప్రకృతి ధ్వనులు, నదుల గల-గల నాదము, శీతల స్వచ్ఛమైన గాలుల స్పర్శ ఉండును. గదులలో లాంతరుల ముందు వ్రాసే కవుల గీతాలలో, సాహిత్యములో కిరోసిన్ వాసనుండును. రవీంద్రనాథ్ ఒక పూర్ణిమ రాత్రి పడవలో క్రొవ్వొత్తి వెలిగించి రాత్రి రెండు గంటల వరకు చదివేవాడు. క్రొవ్వొత్తిని ఆర్పి పరుపులో నిద్రించే ముందు గమనించాడు. పడవ కిటికీలు, ద్వారముల రంధ్రముల నుండి చంద్రుని వెన్నెల ప్రవేశించుచుండెను. అప్పుడు అతడు ఒక గీతము వ్రాశారు. ఒక చిన్న క్రొవ్వొత్తి పచ్చని వెలుతురు, ద్వారము వద్ద నిలిచి ఉన్న చంద్రుని వెన్నెలను, లోపలికి ఏరాకుండా ఆపింది. మైనపువత్తి ఆరిపోగానే చంద్రుని ప్రకాశము లోపలికి వచ్చింది.

మనలోని కొన్ని ఆటంకాలు పరమాత్ముని ప్రకాశాన్ని, ద్వారము వద్ద బయటే ఆపుతాయి. సమాధి, ఆనందం నలువైపుల దగ్గరలోనే ఉంది, కాని మనలోని కొన్ని అడ్డంకులు ఆపుతాయి. దానిని తేలేము, దాని బాధలు వేరుచేసి మార్గాన్ని ఇచ్చి, ద్వారము తెరిచినచో అది తనంతట తానే సహజంగా వచ్చును. జీవనములో శ్రేష్టమైనవి ప్రేమ, పరమాత్ముడు, సౌందర్య బోధ, సత్య అనుభవమును తీసుకరాబడవు. బాధలు తొలిగిస్తే అవి వచ్చును. మనిషి మనస్సుతో చేసినవి, తెచ్చినవి మనిషి మనస్సు కంటే గొప్పవి కాలేవు. మనిషి మనస్సు అల్పము కావున అన్నీ అల్పమే. సమాధి లేదా పరమాత్ముని అనుభూతి మనుష్యునిచే తేబడే అనుభూతి కాదు. సమాధి సాధన ఉపేక్షకరమైనది. కేవలము కొన్ని వస్తువులను తొలగించి మార్గాన్ని ఇచ్చి ప్రతీక్షించినచో మనిషికంటే విశాలమైనది, మనకంటే గొప్పది. ప్రవేశించును. మనము అందులో సశింతుము.

ధర్మసాధనలో సాధువులు, సన్యాసులు మేము యోగాన్ని, ధ్యానాన్ని, సమాధిని సాధిస్తాము, పరమాత్ముని ధర్శనము చేస్తాము, మోక్షము పొందుతాము అందురు. ఇవన్నీ అహంకారపూరిత తెలివిలేని మాటలు. మీరు ఒక ఇల్లు నిర్మిస్తారు, ఒక దుకాణము పెట్టి కుంటారు, ఏదో రాజ్యానికి మంత్రి అవడము ఇవన్ని కూడా అహంకారమే. కాని మీ అహంకారము కంటే సాధు సన్యాసుల అహంకారము గొప్పది. మీరు ప్రపంచములోని సామాన్య వస్తువులను వెతుకుతున్నారు, వారు పరమాత్ముని జయించడానికి బయలుదేరారు. పరమాత్ముని పై విజయము, ఆక్రమణ చేసే కోరిక చాలా తుచ్ఛమైనది.

మహావీరుని సమయములో చాలా పెద్ద రాజు శ్రేణిక్ ఉండెను. అతడు చాలా రాజ్యాలను జయించాడు, లెక్కలేనంత ధనాన్ని కూడబెట్టాడు. ఇప్పుడతడు ఆత్మను కూడా జయించ దలచాడు. అతడు మహావీరునితో అన్నాడు. ఇప్పుడు నేను ఆత్మను కూడా జయించదలచాను. ఒకవేళ పరమాత్ముడు ఉంటే, నేను అతన్ని కూడా జయించగలచాను. మహావీరుడు ఇలా అన్నాడు. "నీవు ఇక్కడి నుండి వెళ్ళిపో! ఎందుకంటే భావముతో ఈ దిశ లో వస్తే అతడు ఓడక తప్పదు. జయించే భావము అహంకారభావము. ఇక్కడ ఓటమికి సిద్ధమైన వాడే జయించును." రెండు రకాల ప్రపంచములున్నవి. ఒకటి మనకు తెలిసిన ప్రపంచమును జయించినవాడే జయించును. మరో ప్రపంచములో ఓడిన వాడే జయించును. సమాధి ఓటమితోనే లభించును, జయిస్తే లభించదు. మీరు పూర్తిగా లేని రోజు లభించును.

సమాధిని, సత్యాన్ని, సాధించలేరు. మీరు విలీనం కావాలి, నశించాలి. నీటి బిందువు సాగరాన్ని పొందలేదు, కానీ సాగరములో విలీనమై సాగరమగును. నీటి బిందువుగానే ఉండి సాగరాన్ని జయిస్తానంటే ఎండకు ఎండి నశించును. మనిషి తన చేతులతోనే తన మృత్యువును స్వీకరించినచో నశించినచో సత్యాన్ని పొందును. నీవు నీవుగా ఉండి పరమాత్మున్ని కలవలేవు. నీవు లేని రోజే పరమాత్ముడు ఉండును అని కబీర్ అన్నాడు. అతని సంది చాలా సన్నన అందులో ఇద్దరు ఉండలేరు. అతడైనా లేదా నీవు.

రూమీ ఒక సూఫీ గీతము వ్రాసాడు. అందులో ప్రియుడు ప్రేయసీ ఇంటికెళ్ళి తలుపు తట్టును. లోపలినుండి ఎవరు అని అడుగును. అతడనును నేను నీ ప్రియుణ్ణి.

అది లోపలి నుండి చప్పుడొచ్చింది, "నేను" ఎప్పటి వరకు ఉందో అప్పటి వరకు ప్రేమ ద్వారము తెరవబడదు. ప్రియుడు "నేను" ను నశింపచేయుటకు తపస్సు చేసి కొన్ని సంవత్సరముల తరువాత వచ్చి తలుపు తట్టాడు. మరల అదే ప్రశ్న. ఇప్పుడు అతడన్నాడు, ఎవరు లేరు, నీవే ఉన్నావు. ద్వారము తెరవబడింది. ద్వారము తెరిచే ఉంది, నేను అనే అహంకారము యొక్క అంధకారములో అగుపడలేదు.

ఏ రోజు మనిషి నేను లేనని తెలుసుకొనునో అదే రోజు సమాధిలో ప్రవేశించును. సమాధి లోపల ఉంది, బయట లేదు. సత్యం, సమాధి, పరమాత్ముడు ఎప్పుడు ఉండే ఉండును. మన ఆటంకముల వల్ల అగుపడడములేదు. మన ఆటంకాల మొదటి సూత్రం. సహజ జీవనము.

మన జీవనము చాలా అసహజంగా, కృత్రిమంగా, అసత్యంగా, మోసపూరితంగా ఉంది. మనము ఇతరులను మోసగించడములేదు, మనకు మనమే మోసగించు కుంటున్నాము. మోసము నిరంతరము చేయడం వల్ల మోసమని తెలియడము లేదు. ఒక వ్యక్తి హత్యచేసి పట్టుబడ్డాడు కోర్టులో అతని వకీలు కొన్ని నెలలు దృఢమైన తర్కముతో వాద వివాదము చేసి నేరము నుండి విడిపించాడు. వకీలు హంతకునితో అడిగాడు, నిజం చెప్పు. నీవు హత్య చేశావా లేదా? అతడన్నాడు, మొదట నేను చేసాననే ఉండేది. కాని మీ యుక్తి, తర్కం విని విని నేను హత్య చేసానా లేదా అని అనుమానంగా ఉంది. ఈ కేసు ఇంకా 4,5 నెలలు ఉంటే నేను హత్య చేయలేదని సమ్మకము కుదిరేది.

జీవితమంతా మనము ఇతరులకు బోధించి, మెల్ల మెల్లగా మనకు విశ్వాసమవుతుంది, అదంతా మనకు తెలుసని, మనము అలాగే ఉన్నామని, అప్పుడు మన జీవనము పూర్తిగా కృత్రిమము మరియు అబద్ధమగును. మన ప్రేమ అబద్దం, మన చరిత్ర అబద్ధం, మన వ్యక్తిత్వము అబద్ధం, మన మనస్సు అబద్ధం, మన ప్రాణం అబద్దం, ఇంత అసహజ వ్యక్తిత్వ కారణంగా ఆటంకాలు, బాధలు ఏర్పడును. మన వ్యక్తిత్వములో సత్యం, సహజము ఎక్కడున్నది. మన మాట, మన నడవడిక అంత అసహజమే. మనము దారిలో ఒంటరిగా ఉన్నప్పుడు ఒక రకంగా నడిచెదము, సలుగురు ఉన్నప్పుడు మరో రకంగా నడిచెదము. స్నానపు గదిలో ఒక రకంగా ఉందుము, అతిథి

గదిలో మరో రకంగా ఉందుము.

మన వ్యక్తిత్వము ఎలా ఉంది? మనము ఇతరుల కళ్ళను చూసి మారుతున్నాము. నలుగురు పెద్ద మనుష్యుల ముందు మన వ్యవహారము పూర్తిగా మారును. ఉదయము ఒక రకంగా మధ్యాహ్నము ఒక రకంగా, రాత్రికి ఒక రకంగా మారుతున్నాము. పత్ని ముందు ఒక రకంగా, మిత్రుని ముందు ఒక రకంగా, పుత్రుని ముందు ఒక రకంగా, తండ్రి ముందు ఒక రకంగా, నౌకరు ముందు ఒక రకంగా, యజమాని ముందు ఒక రకంగా, 24 గంటలు ముఖాలు మారుస్తూ కృత్రిమ వ్యవహారము మరియు అభినయము నటన చేస్తున్నాము. దీని వల్ల అసలైన ముఖమును మరిచి పోదుము. మందిరములో, చర్చిలో చేతులు జోడించి నిలబడుదుము. ఈ అబద్ధపు వ్యక్తిత్వము వల్ల పరమాత్ముడి వద్దకు చేరలేము.

రష్యాలో గొప్ప విచారశీలుడు లియో టాల్స్ టాయ్ ఒక రోజు తెల్లవారు జామున చర్చికి వెళ్ళాడు. అక్కడ ఒక ధనికుడు పరమాత్ముని ముందు తన అపరాధాలను స్వీకరిస్తున్నాడు. నేను దొంగను, పాపిని, మోసగాన్ని నన్ను క్షమించు పరమాత్మా! ఇదంతా టా టాయ్ విన్నాడు. తెల్లవారింది టాల్స్ టాయ్ బయటికి వచ్చి అతనితో అడిగాడు, ఇప్పుడు మీరు అన్నమాటలన్నీ అందరితో చెప్పవచ్చా? అతడన్నాడు, నోరు ముయ్యి! నీవు ఉన్నది నాకు తెలియదు. నీవు ఎక్కువ మాట్లాడితివా నన్ను అవమానించాడని కేస్ పెట్టి బంధింపచేసెదను. అవి నా మరియు పరమాత్ముని మధ్య మాటలు. అవి అందరి ముందు చెప్పేటివి కావు. టాల్స్ టాయ్ ఇంటికెళ్ళి తన డైరీలో వ్రాసాడు, నాకు ఈ రోజు తెలిసింది పరమాత్ముని ముందు ఒంటరిగా చెప్పిన మాటలు అందరి ముందు చెప్పరు.

సత్య సాక్షాత్కారము కావాలంటే మన వ్యక్తిత్వము సత్యంగా ఉండాలి. మనము ఎలా ఉన్నామో అలానే స్వీకరించినచో కపటము విలీనమై జీవనము సహజమగును. మనము ఎందుకు సహజము కాలేకపోతున్నాము? అసహజము ఎందుకు అవుతున్నాము? నేను ఏదో విశిష్టున్ని, ఉత్తమున్ని, గొప్ప వాన్ని, అసాధారుణ్ణి కావాలన్న ప్రయత్న కారణంగా కలత, చింతతో అసహజమవుతున్నాము. ఎంత ప్రయత్నించినా గులాబీ మల్లికాలేదు, మల్లి గులాబీ కాలేదు. మామిడి చెట్టు, వేప చెట్టు కాలేదు, వేప చెట్టు మామిడి చెట్టు కాలేదు. మనము ఎలా ఉన్నామో అలానే ఉండుటకు స్వీకరించినచో క్రాంతి జీవనములో వికసితమగును. అప్పుడు మనము చేసే ప్రతి పని మనది కాదు మనలో పరమాత్ముడు చేయును. అలెగ్జాండర్, నెపోలియన్, రాజకీయ నాయకులు, ధనవంతులు, సజ్జనులు, సాధువులు అహంకారకేంద్రము మీద ఏదో అయ్యే ప్రయత్నము చేయుదురు.

# 10. ప్రజ్ఞ అంటే ఏమిటి?

మనసు తేనెతుట్టె లాంటిది. తేనెటీగల్లా ఆలోచనలు ముసిరి రోద పెడుతుంటాయి. ఆలోచనల ఒత్తిడితో మనిషి జీవిస్తుంటాడు. జీవిత విలువలు తెలియాలంటే మనసు నిశ్శబ్దం కావాలి. బుడగలు లేని సరోవరం కావాలి. మానస సరోవరం కావాలి. దుమ్ము, ధూళి సోకని అద్దంలా మెరుస్తుండాలి.

మనసులో ఆలోచనలు ముసరడం ఆరోగ్య లక్షణం కాదు. మనసు నిర్మలంగా, అద్దంలా ఉంటే ఆలోచనలు అద్దం పైన వాలవు. ఆలోచనలు లేని మనసు చైతన్యం పొందుతుంది. చైతన్యం పొందని మనసు చచ్చేవరకు మగ్గిపోతుంది. అయితే ఆలోచనల్ని వదిలించుకోవడం ఎలా? అదీ సమస్య. కావాలని ఆలోచనల్ని ఆహ్వానిస్తోంది మనమే! ఆలోచించడం మేధావి లక్షణం అనుకుంటున్నాం. రమ్మని పిలిచి తర్వాత పొమ్మంటే ఎట్లా పోతాయి? చెట్టుకు నీళ్లు పోస్తూ చిగురించకూడదంటే ఎలా! ఆకులు రాకూడదంటే వేళ్లను కత్తిరించి వేయాలి. మూలాల్లోకి వెళ్లి పెళ్లగించాలి. –

వేల సంవత్సరాలుగా మనం ఒక భ్రమలో ఉన్నాం. ఇతరుల ఆలోచనలు, అన్ని అనుభవాలు గుచ్చి గుచ్చి జ్ఞానహారాలుగా మెడలో వేసుకు కులుకుతున్నాం. అది మొదటి తప్పు. మనం జ్ఞానం అని మురిసిపోతున్నది మన జ్ఞానం కాదు ... ఇతరుల అనుభవం, ఇతరుల ఆలోచనలు. అది అజ్ఞానం. జ్ఞానం అన్నది మనలో స్వతస్సిద్ధంగా పుట్టుకురావాలి. లోపల నుండి ఫౌంటెన్ లా పై కుబికి రావాలి. జ్ఞానం లోపల నుండి పుట్టుకొస్తుంది. ఆలోచనలు బయటినుండి వచ్చి వాలతాయి. ఇతరుల నుండి సంగ్రహించినదాన్ని జ్ఞానం అనకూడదు. మన అజ్ఞానాన్ని దాచి పెట్టడం, ఎవరి మాటలో, సూక్తులో, సూత్రాలో ఉటంకించడం జ్ఞానం కాదు.

వాటిని వదిలితే నీలో మిగిలేది శూన్యం, అజ్ఞానం. నీ స్వంతం అయినది మాత్రమే జ్ఞానంగా భాసిస్తుంది.

ఒక బావిని త్రవ్వ దలిచారు. మొదట మట్టిని ఎత్తిపోయాలి. తర్వాత రాళ్లు, బండలు తగిలితే వాటిని పగులగొట్టి తొలగించాలి. బాగా లోపలకు పోయిన తర్వాత జల పడుతుంది. నీరు ప్రక్కల నుండి ఊరుతుంది. ఆ నీరు లోపలి పొరల్లో ఉన్నది, పై నుండి వచ్చి పడ్డది కాదు. జ్ఞానం అలాంటి ఊట. మనం ధ్యానంలో హృదయం

లోతుల్లోకి వెళ్లిన కొద్దీ, అవరోధాల్ని తొలగించిన తర్వాత జ్ఞానం జల తెలుస్తుంది. అవరోధాలు తొలగించడం, లోపలికి వెళ్లడం రెండే పనులు సాధనలో. జ్ఞానకూపంలో అప్పుడు జ్ఞానజలాలు లభిస్తాయి.

చిన్నకుంట తవ్వితే నీరు ఊరదు. ఏ వర్షపు నీటితోనే దానిని నింపాలి, లేదా ఏ కాలవ నుండో మళ్లించి నింపుకోవాలి. కుంటకు, బావికి ఉన్న తేడా భూమికి, ఆకాశానికి ఉన్నంత దూరం. బావిలోని నీరు చేసిన కొద్దీ ఊరుతుంది. కుంటలోని నీరు వాడిన కొద్దీ తరిగిపోతుంది. జ్ఞానం లోతుకు వెళ్లిన కొద్దీ పెరుగుతుంది. బావి చిన్నదే కావచ్చు. అది మన స్వంతం. ఆ నీటి పైన హక్కు మనది. లోతులకు వెళ్లిన కొలదీ జ్ఞాన జలాలు ఊరుతుంటాయి. బావి నీటి కున్న రుచి విలువ కుంట నీటి కుండదు.

మనసు బావి కాగలదు, చెరువూ కాగలదు. ఎంత పెద్ద చెరువు అయినా నీరు అడుగంటిపోయే ప్రమాదం ఉంది. బావినీరు ప్రమాణం తగ్గదు. తీసిన కొద్దీ ఊరుతుంది. ఇప్పుడు మన బుర్రలన్నీ పెద్ద చెరువులైనాయి. వాననీటితో పాటు చుట్టుపట్ల మురికినీరు వచ్చి కలవడంతో కలుషితమై పోతున్నాయి. పుస్తకాలు చదివి జ్ఞానులమైనా ఘనుకుంటున్నారు. జ్ఞాని బావివంటివాడు. ప్రజ్ఞ కలవాడు ఇతరులపై ఆధారపడడు.

అరువు తెచ్చుకున్న జ్ఞానం పంచిన కొద్దీ తరిగిపోయే సంపద వంటిది. ప్రజ్ఞానం పంచిన కొద్దీ పెరుగుతుంది. అరువు తెచ్చుకున్న విద్యతో బ్రతికేవాడు. అనుక్షణం భయపడుతుంటాడు. సుజ్ఞాని నిర్భయంగా జీవిస్తాడు.

ఆత్మ గురించిన అవగాహన సుజ్ఞానం వల్ల కలుగుతుంది తప్ప పుస్తక పఠనం వల్ల, శాస్త్ర పాండిత్యం వల్ల కలగదని. శాస్త్రాలు చదివి విషయం గ్రహించవచ్చు. అనుభవం లేనిది దాని అనుపానులు తెలియవు. హృదయం స్పందించదు. ఇతరులు చెప్పినవి మనం చిలక పలుకుల్లా పలకవచ్చు. అది జ్ఞానం కాదు, సుజ్ఞానం అంత కన్నా కాదు. కేవల పరిజ్ఞానం అవుతుంది తప్ప 'పర' జ్ఞానం కాదు. పరేంగిత జ్ఞానం అసలు కాదు. వాస్తవానికి అవి మన అజ్ఞానానికి అద్దం పడతాయి. తను అనుభూతించేదే జ్ఞానం.

అది మాయ ... మాయ మనిషిని భయకంపితుని చేస్తుంది. ఇతరుల నుండి పొందిన జ్ఞానం రాళ్లవంటిది. మన లోపల ఉన్నది బంగారం. బంగారం కాని వాటిని నిర్భయంగా వదిలి పెడుతుండాలి.

ఒక కొండ గుహలో ఒక యోగి చిరకాలంగా తపస్సు చేసి, పండిపోయాడు. ఆయన చెప్పే విషయాలు వినడానికి చాలామంది వస్తుండేవారు. ఒక యువకుడు ఆసక్తితో వచ్చి గురుబోధ వినసాగాడు. ఏడాది గడిచింది. యువకుడు అనుకున్నాడు .... ఈ పెద్దాయనకు ఏం తెలియదు, చెప్పిందే చెబుతున్నాడు, బొత్తిగా పాండిత్యం లేదు, ప్రపంచ ప్రజ్ఞానం లేదు. ఒకరోజు వెళ్లిపోవాలని నిర్ణయించుకున్నాడు.

ఆరోజు మరొక స్వాముల వారు ఆ గుహకు వచ్చాడు. గురువు గారిని దర్శించి ఆ రోజు రాత్రి గొప్పగా ఉపన్యసించాడు. రెండు గంటల సంగంలో అనేక విషయాలు చెప్పాడు. శిష్యులంతా సంతసించారు. చాలా విషయాలు తెలుసుకున్నామని మురిసిపోయారు. ఆ స్వామి గురువుగారి అభినందనలకోసం వచ్చాడు. ఆ గురువుగారి ప్రశంసలు కావాలి.

"గురూజీ! నా ఉపన్యాసం ఎలా ఉంది?" అడిగాడు గర్వంగా".

గురువుగారన్నారు : "నా' ప్రసంగం అంటున్నావు. నీవు చెప్పిన విషయాలు ఏవీ నీ స్వంత అనుభవంతో చెప్పినవని అనిపించలేదు. పూర్వం ఎవరెవడో చెప్పిన విషయాలే నీవూ చెప్పావు. ఆ జ్ఞానం నీది కాదు. నీ అజ్ఞానానికి ఎవరి జ్ఞానంతోనో పూత పూశావు."

స్వామి గారికి కోపం వచ్చింది .... "అంటే నేను శుంఠననా మీ అభిమతం." "శుంఠ వని, అజ్ఞాని వని నేననను. నీకు శాస్త్ర పాండిత్యం ఉంది. అనుభవం లేదు. నీ హ ృదయంలోంచి చెప్పిన మాట ఒక్కటీ లేదంటున్నాను. అంతా మనసు గారడీ, మాటల గారడీ ... స్పందన ఏదీ? నీ వంటి జబ్బు మనుషులు లోకం నిండా ఉన్నారు. చెత్తా చెదారం తింటే జీర్ణమై చావదు. అరక్క వాంతి చేసుకుంటారు నాలాంటి వారు". అవమానంతో ఆ స్వామి వెళ్లిపోయాడు. వెళ్లిపోవాలనుకున్న యువకుడు గుహలోనే ఉండి, గురువుగారికి అత్యంత ఆత్మీయ శిష్యుడైనాడు. గురువుగారి కళ్ల వెలుగుల్ని చూచి తన 'ధ్యానం' పదిలపరచుకున్నాడు.

ఏనాటికైనా 'సత్యం' ఒక్కటే మనిషికి మార్గం చూపిస్తుంది.

2వ భాగం

# 1. హిమాలయ యాత్ర

2017 ఆగష్టు 20 స్వామీజీ హిమాలయాలకు వెళుతున్నారు. నేను స్వామీజీకి ఫోన్ చేసి మీతో పాటు హిమాలయాల వద్దకు వస్తాను స్వామీజీ అని అడిగాను. దానికి స్వామీజీ సరే రండి అని అన్నారు. అప్పుడు నేను నాతో పాటు మా బావగారు మల్లేశం, గోదావరిఖని కుమార్, శివ కలిసి స్వామీజీతో పాటు హిమాలయాలు వెళ్ళాము. రిషికేష్ లో టి.టి.డి. లో బస చేశాము. మరుసటి రోజు ఉదయం రామ్ జూలా, లక్ష్మణ్ జూలా, తేరే మందిర్ చూసి భగీరథ ఆశ్రమముకు వెళ్ళాము. ఆశ్రమంలో ఉమేష్ సంద స్వామీజీతో కాసేపు మాటలు జరిగాయి. నేను వారి వద్దకు వెళ్ళాను స్వామీజీ స్నానానికి వెళ్ళారు. నేను ఉమేష్ నందను అడిగాను "సుగుణానంద స్వామీజీ మీకు ఎప్పటి నుండి తెలుసు?" అని, దానికి ఉమేష్ నంద గారు చెప్పారు "స్వామీజీ మాకు చాలా రోజుల నుండి తెలుసు మంచి సాధకుడు ఎప్పుడు చూసినా మౌనంలో ఉండేవాడు చాలా గొప్ప వ్యక్తి" అని చెప్పారు. ఆరోజు నైట్ అక్కడే పడుకున్నాము. ఉదయాన్నే లేచి నీలకంఠం టెంపుల్ కి వెళ్ళాము అక్కడ నుండి జెలినెని గుహ వద్దకు వెళ్ళాము అక్కడ నుండి ఇంకా ముందుకు వెళితే గణేష్ గుహ ఉంటుంది. గణేష్ గుహ నుండి కొంచెం లోయలోకి దిగితే అక్కడ ఒక మంచి గుహ ఉంది. ఆ గుహలో ఒక సాధువు ఉన్నారు. ఆ సాధువు వయస్సు 90 లేదా 100 సంవత్సరాలు ఉండవచ్చు. మన స్వామీజీని చూడగానే ఆ సాధువు కౌగిలించుకున్నాడు. ఎలా ఉన్నావు బేటా! అని పలకరించారు. వాళ్ళిద్దరూ కాసేపు మాట్లాడుకున్నారు. నేను స్వామీజీ దగ్గర ఆశీర్వాదము తీసుకున్నాను. అక్కడ నుండి తిరిగి రిషికేష్ వచ్చాము. రాత్రి గం|| 9-30 ని||లు అయ్యింది. మహేష్ యోగి ఆశ్రమము ప్రక్కన కొండ లోపల ఒక కుటీరం తయారు చేసుకొని ఉన్నారు. స్వామీజీ ఆ కుటీరం వద్దకు వెళ్ళి పిలిచారు. "బాబాజీ!" అని అప్పుడు లోపల నుండి ఒక సాధువు వచ్చారు. ఆ సాధువు వయస్సు 90 సంవత్సరాలు పైన ఉంటాయి. ఆ సాధువు పేరు ధీరెంధర్ బాబా మన స్వామీజీని చూడగానే ఎంతో ప్రేమగా కౌగిలించుకున్నాడు. మమ్మల్ని లోపలికి తీసుకుని వెళ్ళాడు. ఆ సమయంలో మాకు వంట చేసి భోజనం పెట్టారు. ధీరేందర్ బాబా ఒంటరిగా ఉంటారు. నేను

ధీరెందర్ బాబాను సుగుణానంద స్వామీజీ మీకు ఎప్పటి నుండి తెలుసు అని అడిగాను. బాబా చెప్పారు స్వామీజీ నాకు 18 సంవత్సరాలు నుండి తెలుసు. స్వామీజీ నా దగ్గరకు వచ్చినప్పుడు చాలా చిన్న పిల్లవాడు. స్వామీజీ ఉండడానికి నేను గుహ ఇచ్చాను, మంచి సాధకుడు ఎక్కువ మౌనంలో ఉంటారు. స్వామీజీ సిద్ధి పొందారు అని ధీరెంధర్ బాబా చెప్పారు. స్వామీజీ సాధన చేసిన గుహలు చూసాము మన స్వామీజీ గురించి ధీరెందర్ బాబా చెబుతూ తాను చాలా ఆనందంగా ఫీలవుతున్నాడు. ధీరెందర్ బాబా ముఖంలో సంతోషాన్ని నేను గమనించాను. ఇంకా సుగుణానంద స్వామీజీ గురించి తెలుసుకోవాలనే తపన నాలో ఎక్కువైంది. అలా నేను ధీరేందర్ బాబాను ప్రశ్నించడం మొదలుపెట్టాను. ధీరెందర్ బాబా చెప్తున్నారు. సుగుణానంద స్వామీజీ ఇక్కడ గంగానది తీరాన గుహలో 6 నెలలు ఉండేవారు. మిగతా 6 నెలలు గంగోత్రి లేదా కేథార్నాద్ వెళ్లిపోయేవారు. అక్కడ సాధన చేసేవారు. ఇక్కడ సాధన చేసేవారు అని చెప్పారు. బాబా గారు ఓషో రజానిష్, మహేష్ యోగి వాళ్లిద్దరి దగ్గర శిష్యునిగా చేసిన వ్యక్తి మరియు ఆధ్యాత్మికంగా మంచి అనుభవం ఉన్న వ్యక్తి, 90 సం॥లు పైబడిన వ్యక్తి తన జీవితం మొత్తం బ్రహ్మచర్యం సాధనలోనే ఉండేవారు. రిషికేష్ లో బ్రహ్మచర్య ధీరెందర్ బాబా అంటే అందరికి తెలుసు. అటువంటి గొప్ప సాధకుడు సుగుణానంద స్వామీజీ గురించి చెబుతూ ఉంటే నాకు ఎంతో ఆనందం అనిపించింది. ఆ రోజే చెప్పారు బాబా గారు సుగుణానంద స్వామీజీ వల్ల ప్రపంచానికి ఒక అద్భుతం జరగబోతుంది అని చెప్పారు. ఏంటి బాబాగారు ఆ అద్భుతం గురించి అడిగాను. ముందు, ముందు మీకే తెలుస్తుంది అని చెప్పారు.

నేను, ధీరేందర్ బాబా మాట్లాడుతుంటే రాత్రి 12 గంటలు అయ్యింది. ఇంకా బాబా నాకు నిద్ర వస్తుంది అని పడుకున్నాడు. మరుసటి రోజు ఉదయం తిరుమల తిరుపతి దేవస్థానంలో మేము రూమ్ తీసుకొని ఆ రూమ్ కి వచ్చేశాము. అక్కడ నుండి బద్రీనాథ్ వెళ్ళాము, బద్రీనాథ్ లో స్వామీజీ భారత్ సేవా ఆశ్రమంలో మమ్మల్ని ఉంచి తను తన గురువు గారిని కలుస్తానని వెళ్ళారు. స్వామీజీ ఒక రోజు మొత్తం రాలేదు మేము దర్శనం చేసుకొని బద్రీనాథ్ మొత్తం తిరిగి రాత్రి పడుకున్నాము మరుసటి రోజు ఉదయం 10 గంటలకు స్వామీజీ వచ్చారు. వచ్చి అందరం కలిసి దర్శనం చేసుకున్నా తరువాత ఇక్కడ ఏమైనా చూపించమంటారా వెళ్తారా అని అడిగారు స్వామీజీ. అప్పుడు మేము చూపించండి స్వామీజీ అని అన్నాము. పైకి వెళ్తే ఎర్రటి కలర్ వేసిన

ఆశ్రమము ఉంటుంది. అక్కడ భారతీర్థ స్వామి ఉంటారు. ఆ స్వామీజీ దగ్గరకు తీసుకువెళ్లారు. ఆ స్వామీజీ సంవత్సరము సంవత్సరము అక్కడే ఉండేవారు అంతా ఇప్పుడు కొంచెం ఆరోగ్యం బాగోలేక ఉండటం లేదు. ఆ స్వామీజీ దగ్గరకు తీసుకువెళ్ళి దర్శనం చేసుకొని కాసేపు మాట్లాడి అక్కడ నుండి కేదార్‌నాథ్ వచ్చాము. గౌరి కుండ నుంచి కేదార్‌నాథ్ నడుచుకుంటూ వెళ్ళాము. కేదార్‌నాథ్ వెళ్ళిన తరువాత కేదార్‌నాథ్ లో నిలబడితే లెఫ్ట్ సైడ్ లో పైకి వెళితే చిన్న చెరువు ఉంటుంది. దాని ప్రక్కన కొన్ని గుహలు ఉన్నాయి. ఆ గుహలు దగ్గరకు తీసుకువెళ్లారు. అందులో స్వామీజీ గుహ ఉంది. ఆ గుహలో డోర్ తీసి చూసాము అందులో స్వామీజీ ఫొటో ఉంది. స్వామీజీవి కొంచెం సామాన్లు ఉన్నాయి, స్వామీజీ గుహ చూడగానే నాకు కేదార్‌నాథ్ లో ఉండాలి అని అనిపించింది. స్వామీజీ అన్నారు నీకు సమయం ఉందిలే శ్రీను ఇప్పుడే వద్దు అన్నారు స్వామీజీ. అక్కడ నుండి ఇంకా లోపలికి వెళితే బ్రహ్మగుహ ఉంటుంది. బ్రహ్మగుహకు వెళ్ళాలి అని ప్రయత్నం చేశాము కాని నాతో పాటు వచ్చిన నాతోటి ప్రయాణికులు ఇబ్బంది పడ్డారు. చలికి వారు ఉండలేరు అనే ఉద్దేశం కొద్ది తిరిగి వచ్చాము. వచ్చి దర్శనం చేసుకున్నాము. అక్కడ గుహలో కొంతమందిని కలిసి మాట్లాడాము. అక్కడ స్వామీజీకి తెలిసిన వాళ్ళు ఉన్నారు. అక్కడ నుండి గంగోత్రి వచ్చాము. గంగోత్రిలో స్వామీజీ తపస్సు చేసిన గుహలు చూపించారు. దండి ఆశ్రమములో దిగాము స్వామీజీ ఏ గుహలో తపస్సు చేశారో ఆ గుహను చూసాము నది తీరాన చాలా గుహలు ఉన్నాయి. నా ప్రశ్న ఏమిటి అంటే మనకు ఇంత పెద్ద హాలు, రెండు బెడ్ రూమ్ లు, కిచెన్లు అన్ని ఉండగానే మనకి ఇల్లు ఇరుక్కుటం అనిపిస్తుంది. కానీ గుహ అంటే ఒక ఇద్దరు మనుషులు పడుకోవచ్చు. అంతే అంతకుమించి ఏమీ ఉండదు. అంతటి చిన్న గుహలో స్వామీజీ సగం జీవితం గడిపారు అంటే నిజానికి స్వామీజీ గ్రేట్ అనిపించింది.

అక్కడ నుండి పైకి వెళితే అక్కడ ఒక స్వామిజీ ఉన్నారు. తాను 18 సంవత్సరాలు నుండి గంగోత్రిలో ఉంటున్నారు. వెళ్ళగానే స్వామీజీని చూసి పలకరించారు. మన స్వామీజీ కూడా పలకరించారు. 18 సంవత్సరాలు నుండి ఆ స్వామీజీ కిందకు రాలేదు అంట. అంటే గంగోత్రి ఆరు నెలలు మూసివేసిన ఆ స్వామీజీ అక్కడే ఉంటారు. అక్కడ నుండి తపోవనం, గోముఖ్ అన్ని చూసాము. తపోవనంలో ఎవరో సాధకులు ఉన్నారు. స్వామీజీ వాళ్ళని అడిగేవారు. మీరు ఎవరు, ఎక్కడ, ఏమిటి అని ఏ సాధన చేస్తున్నారు అని వాళ్ళకి స్వామీజీ చెప్పారు ఇక్కడ చలిలో ఉండాలంటే సూర్యభేడి,

ప్రాణాయామం చెయ్యాలి అని చెప్పారు. అది ఎలా స్వామీజీ అని వాళ్ళు అడిగారు. మన స్వామీజీ అప్పుడు వాళ్ళకు కొన్ని సాధన రహస్యాలు చెప్పారు. చెప్పి కిందకు వచ్చాము. కిందకు వచ్చినప్పుడు స్వామీజీని అడిగాను అదేమిటి స్వామీజీ తను సాధన మార్గాలు నేర్పమని అడగలేదు కదా ఎందుకు నేర్పించారు స్వామీజీ అని. దానికి స్వామీజీ ఇలా చెప్పారు. అడిగినప్పుడు అన్నం పెడితే మనవాళ్ళు, అడగకుండా అన్నం పెడితే అమ్మ అంటారు. అంతే వాళ్ళు ఏ స్థితిలో ఉన్నారో చూస్తే అర్థమవుతుంది. వాళ్ళు సాధన కోసం తపన పడుతున్నారు కాబట్టి మనకున్న జ్ఞానాన్ని పంచడమే. అందుకు అర్హత ఉన్నవారికి నేను నా జ్ఞానాన్ని అందిస్తాను. వారు ఏ దేశమైనా సరే, ఏ కులమైనా సరే, ఏ మతమైనా సరే వాళ్ళకి ఆత్మజ్ఞానం అందుకోవాలి అనే తపన ఉంటే చాలు. నేను జ్ఞానాన్ని అందిస్తాను అని స్వామీజీ చెప్పారు. ఆ మాట వినగానే నాకు చాలా సంతోషం అనిపించింది. గంగోత్రి నుంచి ఉత్తరకాశి వచ్చాము. ఉత్తరకాశిలో రాత్రి అక్కడే పడుకున్నాము. ఉదయాన్నే ఉత్తరకాశిలో బస్టాండ్ లో టీ త్రాగుతున్నాను. స్వామీజీ వచ్చి శ్రీను యమునోత్రి వద్దులే మనం రిషీకేష్ వెళ్ళిపోదాము అని అన్నారు. అదేమిటి స్వామీజీ ఇంత దూరం వచ్చాక అలా అంటారు అని అన్నాను. ఇది ఒకటి కూడా చూస్తే బాగుంటుంది అన్నాను. స్వామీజీ నా మనస్సుకు వద్దు అని అనిపిస్తుంది శ్రీను అన్నారు. అయినా లేదు స్వామీజీ వెల్దాము అని బలవంతం చేసి వెళ్ళాము. సగం దూరం వెళ్ళగానే కొండచరియలు విరిగిపడ్డాయి. దారి బంద్ అయినాయి. మూడు రోజుల వరకు రాకపోకలు నిలిపివేశారు. అప్పుడు అది చూడగానే స్వామీజీ చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి. స్వామీజీ ఆగిపో అన్నప్పుడు ఆగిపోతే బాగుండేది అనిపించింది. మళ్ళీ మేము తిరిగి ఉత్తరకాశి వచ్చే సరికి రాత్రి అయ్యింది. ఆ రాత్రి ఉత్తరకాశిలో పడుకున్నాము. మరుసటి రోజు ఉదయం రిషీకేష్ వచ్చాము. స్వామీజీ పాటు హిమాలయాలలో ఉండే అనుభవాలు ఇంకా చాలా ఉన్నాయి. కానీ హిమాలయాలు గురించి రాస్తే ఒక పుస్తకం అవుతుంది. అందుకే మహాతపస్వి–3, 4లో ఇంకా పూర్తిగా అందిస్తాను. ఇప్పుడు కొంత వరకు మాత్రమే అందిస్తున్నాను. రిషీకేష్ వచ్చి అక్కడే మూడు రోజులు ఉన్నాము. అక్కడ గంగా హారతి, చూసి మనసాదేవి దర్శనం, చండి దేవి దర్శనం చేసుకున్నాము. ఆ తరువాత గంగానది తీరాన వచ్చినప్పుడు రాత్రి 11 గంటలు అయ్యింది. అందరం గంగానది తీరాన కూర్చున్నాము. స్వామీజీ హిమాలయాలలో శాంబలా, నాగలోకం అనేవి ఉన్నాయా స్వామీజీ అని అడిగాను. అప్పుడు స్వామీజీ ఈ విధంగా సమాధానం చెప్పారు.

# 2. శంబల, నాగలోకం

'శంబలా' అనే ప్రాంతం భూగోళం పైన ఉన్నదో, లేదో ఎవరికీ తెలియదు. కాని శంబలాకు చాలా ప్రాముఖ్యత వుంది. సంస్కృత సాహిత్యంలో 'తపోలోకం' ప్రస్తావన వుంది. అది అమృత సరోవర తీరాన సుందర నందన వనాలతో నిండిన ప్రదేశమని, అక్కడ మహా మహా తపస్సంపన్నులు ధ్యాన మగ్నులై ఉంటారని చెబుతారు. దాని గురించిన ప్రస్తావన రెండువేల సంవత్సరాల నాటి ఒక టిబెట్ గ్రంథంలో వుంది. మహాయాన బౌద్ధ సాహిత్యంలో శంబలా కాల్పనిక ద్వీపం. హెచ్.పి. బ్లవటిస్కీ బయట పెట్టేవరకు దాని గురించి బయటి ప్రపంచానికి స్పృహ లేదు.

ఒక కాలంలో బహుజనాదరణ పొందిన సత్యం మరొక కాలంలో అంతగా ప్రాచుర్యం పొందకపోవచ్చు. కాలాన్ని బట్టి సత్యం విలువ మారుతుంది. ఒకరికి సత్యసమ్మతమైంది మరొకరికి సత్యం అనిపించకపోవచ్చు. కొందరు తొలి స్పర్శతోనే సత్యాన్ని అనుభూతించి, ఆస్వాదిస్తారు. కొందరు పరీక్షలు పెట్టి నిగ్గు తేల్చిగాని దానివైపు మొగ్గుచూపరు. మహోన్నత సత్యాలు మహాత్ములు మాత్రమే అందుకుని స్పందించగలరు. పరమ నిగూఢ సత్యాలు పరమ గురువులు ప్రసాదించ వలసిందే. అలా పరమసత్యాలను ఆవిష్కరించేవారిని జ్ఞానులని సోక్రటీస్ ప్రవచించాడు.

'మనిషి నిజ నివాసం నక్షత్రాలు పొదిగిన రోదసి. అప్పుడప్పుడు భూమ్మీదికి విహార యాత్రగా వచ్చి పోతుంటాడు" – అన్నదీ సత్యమే.

"ప్రాచీన కాలం నుండి భారతదేశమే విశ్వవిజ్ఞాన కేంద్రం. అప్పట్లో జ్ఞానులను ఋషులనే వారు" అని అవతుంశక సూత్ర' అనే ప్రాచీన గ్రంథం పేర్కొనడం జరిగింది. నాగరికత మొదలైన నాటినుండి "ఏది సత్యం? ఏది అసత్యం?" అనే మీమాంస కొనసాగుతూనే వుంది. జ్ఞానాన్ని నిక్షిప్తం చేసి రక్షించడానికి ఆలయ విజ్ఞానం ఏర్పడ్డది. దానిని రక్షిస్తున్నవారు హిమాలయ యోగులు. వారే పరమ గురువులు. పరమ గురువుల ఆవాసమే శంబలా, కంటితో చూస్తే గాని నమ్మలేని నేటికాలం వారికి కామరూపులుగా, అదృశ్యంగా ఉండే పరమ గురువుల ఆచూకీ తెలిసే అవకాశం లేదు. కాని ఆ పరమగురువులు ఆధ్యాత్మిక గురువులకు అందుబాటులో ఉంటారు. వారితో సంభాషిస్తారు. వారికి సందేశాలిస్తారు. వారిని నడిపిస్తారు. వారి సంభాషణకు 'భాష' అవసరం ఉండదు. అది హృదయస్పందన. యుగాంతం వరకు విజ్ఞానాన్ని రక్షించే బాధ్యత పరమ గురువులది.

కారల్మన్ ఎకార్ట్సునెస్ (1762-1813) "The Discovery of Magic" అనే గ్రంథంలో పరమగురు సంప్రదాయం ఐరోపాలోను, ఆఫ్రికాలోనూ ఉన్నట్లు రాశాడు. వారి వారి భాషలు వేరైనా ఆత్మస్పందన ఒక్కటేనట. ఆ జ్ఞానులు నిగూఢంగా ప్రపంచం దృష్టి పడనిచోట ఉంటారట. అలాంటి పరమగురు మండలిని హిమాలయ ప్రాంతంలో ఉన్నవారిని 'మహాత్మ' లంటారు. టిబెట్ లోనూ, భారత్ లోనూ గురువులపై ఈ హిమాలయ మాస్టర్ల ముద్రలు కనిపిస్తాయి. ఇక్కడ యోగుల పైన, ఆధ్యాత్మికవేత్తల పైన మాస్టర్ల ప్రభావం వుంది.

చైనా ప్రాచీన గాథల ప్రకారం 'కున్‌లున్' పర్వత శ్రేణులలో మ ృత్యువును జయించిన వారుంటారు. ఆ పర్వత శ్రేణులు చాలా ఎత్తుగా, మంచుతో కప్పబడి ఉ ంటాయి. నరమానవుడు వాటిని దాటడానికి సాహసించడు. ఆ రహస్య ప్రదేశాన్ని టిబెటన్లు, మంగోలియన్లు సదా రక్షిస్తుంటారు. దానిని 'షాన్ టుంగ్' అని 'యాంగేట్సే' లోయ అని పిలుస్తారు. ఆ లోయలో తొమ్మిది అంతస్తుల భవనం ఉన్నదని, కల్పవ ృక్షా లుంటాయని చెబుతారు. ఆ కల్పవ ృక్షాలు ఆరువేల సంవత్సరాలకు ఒకసారి పూలు పూచి కాయలు కాస్తాయట. ఆ కాయలు తిన్నవారు మ ృత్యుంజయు లవుతారు. నిత్య యవ్వనులుగా జీవిస్తారు. వారు అన్ని లోకాలలో సంచరిస్తుంటారు. నక్షత్రగోళాలకు సైతం వెళ్లివస్తుంటారు.

భారతీయ యోగశాస్త్రం అష్టసిద్ధులు పొందిన యోగులకు ఈ లక్షణాలు చెబుతుంది. ఆ మహాత్ములు శరీరాలు త్యజించి అశరీరులుగా సంచరిస్తుంటారు. కోరినప్పుడు భౌతిక శరీరాలు ధరిస్తారు. వారివి దివ్యశరీరాలు - అంటే నశించని శరీరాలు. మరణం లేని అమరులు వారు. ఆ పరమ గురువుల సంఖ్య తక్కువే కావచ్చు. వారి జ్ఞానం పరమాద్భుతం.

"It is the abode of fully evolved souls
who were formerly ordinary men and women"

చైనీయుల విశ్వాసం వంటిదే భారతీయుల నమ్మకం. మహా తపస్సంపన్నులు, మహర్షులు, యోగులు భౌతిక శరీరాలు త్యజించిన తర్వాత తపో లోకాలు చేరతారని మన వారి నమ్మకం. అంటే వారు మృత్యుంజయులు, అమృతులు అని. ఈ తపోభూములు హిమాలయాలకు ఉత్తరాన (టిబెట్) ఉన్నట్లు భాగవత పురాణంలో వాచస్పత్యంలో

ఉద్ఘాటించారు. కల్కి అవతరణ ఆర్యావర్తంలోనే జరుగుతుందని మరొక నమ్మకం. అది కైలాస శిఖరానికి ఉత్తరంగా టిబెట్ కు పడమటి దిక్కున ఉంటుందని, బోధిసత్వులు ఈ శంబలా లోయలోనే శాశ్వతా వాసాలు కల్పించుకుంటారని బౌద్ధుల విశ్వాసం.

ఇప్పటి జాగ్రఫీ వేరు – ప్రాచీన కాలం నాటి జాగ్రఫీ వేరు. అప్పుడు ఇన్ని ఖండాలు, దేశాలు, ద్వీపాలు ఉండేవి కావు. భూ భాగం తక్కువ, సముద్ర భాగం ఎక్కువ. కూర్మ పురాణం ప్రకారం ప్రాచీన కాలంలో ఉత్తర సాగరంలో శ్వేత దీపం ఒకటి ఉండేది. అంటే అప్పుడు హిమాలయాలకు ఉత్తరంగా అంతా మహాసముద్రం అన్న మాట. ఆ శ్వేత ద్వీపమే తపోలోకం. మహర్షుల తపోభూమి. గోబీ ఎడారి అప్పట్లో నీట మునిగి ఉండేదన్నమాట. కాలక్రమాన సముద్రం తీసిపోగా కొండలు, లోయలు బయటపడ్డాయి.

శంబలా ద్వీపం బహుసుందర ప్రదేశం. బ్రహ్మాండమైన భవనాలు, తోటలు. ఆ ద్వీపాన్ని చేరాలంటే 'స్వర్ణహంస' పైన ప్రయాణం చేయాలి. ఆ స్వర్ణహంస యోగ్యులైన వారు సిద్ధంగా ఉన్నప్పుడు తానే వచ్చి ఎక్కించుకు పోతుంది. శంబలా'ను 'శంభలింగ్' అనికూడా అంటారు. శంబలాకు 'భగవన్ వజ్రపాణి గుహ్యభిదేశ తంత్రరాజు" అని మరొక పేరుంది. బౌద్ధ గురువైన "పెంచన్ లామా'కు శంబలా గురించిన అవగాహన ఉంది. ఆయన 1923లో ఇండియా దర్శించినపుడు ఒకరు ప్రశ్నించారు, "మీ లామాలకు అతీంద్రియ శక్తులుంటా యంటారు. నిజమా?"

ఆయన సమాధానం చెప్పకుండా, చిన్నగా నవ్వాడు. మరుక్షణంలో ఆయన అదృశ్యమై పోయాడట. చుట్టుపట్ల ఎంత వెదికినా ఆయన దొరకలేదు. ఎక్కడో దూరాన ఒక చెట్టుకింద ప్రత్యక్షమైనాడట! మహత్తులు, సిద్ధులు ఉన్నవారు నోటితో చెప్పరు. పెంచన్ లామా విద్య పూర్తి చేసిన తర్వాత టిబెట్లో 1915లో ఒక పెద్ద గుహాలయం తయారు చేసి అందులో మైత్రేయ విగ్రహం ప్రతిష్టించాడు. మైత్రేయ అవతారమే బుద్ధుడని పెంచన్ లామా విశ్వాసం. 1923లో లామా టిబెట్ వదిలి రాగానే మంచు తుఫానులు చెలరేగి అక్కడి జనాభా నాశనమైందని అంటారు. ఆయన తన మందిరంలో 'చూపు' తోనే దీపాలు వెలిగించేవాడు.

ప్రఖ్యాత రష్యన్ చిత్రకారుడు నికొలస్ రోరిక్ రచనల్లో, చిత్రాలలో శంబలా కనిపిస్తుంది. ఆయన శంబలా లోయలో కొంతకాలం గడిపివచ్చాడంటారు. రోరికకు, మైత్రేయకు మహాత్మ మోరియా సంధానకర్తగా పనిచేశాడు. మాడం అవట్ స్కీ మాస్టర్ మోరియా గురించి రాశారు. మోరియా 'అగ్ని యోగం' గురించి చాలా విషయాలు చెప్పాడట. హిమాలయ గురువులు సంకల్పించి అనుమతిస్తే తప్ప ఎవరూ శంబలా చేరడం జరగని పని. వారి సందేశాలు యోగులు మాత్రమే అందుకోగలరు. శంబలా సరిహద్దుల వరకు వెళ్ళగలిగితే అర్హులైన వారికి స్వాగతం లభిస్తుంది. అనర్హులు దోవ తప్పి పోతుంటారు.

నాగలోకం మన పురాణాలలో నాగలోకం ఉంది. నాగులు, నాగినులు, నాగ కన్యలు ఉన్నారు. వారిది భూమి పైన ఒక ప్రాంతం కాదు. వారిది సర్పజాతి. కామ రూప కళలు సొంతం చేసుకున్నది నాగజాతి. భూమి లోపలి పొరల్లో వీరి ఆవాసం. అంటే పాతాళం నుండి భూమిపైకి వచ్చి, ఆకాశంలో విహరించగలరు. గొప్ప అతీంద్రియ శక్తులు వీరి హస్తగతం. నాగులు, నాగినులు మానవులను వలచి, వలపిస్తూ వీరితో సఖ్య సంబంధాలు సాగిస్తుంటారు. మనవారు వీరిని 'నాగదేవత' అంటారు. అంటే దేవతలంత ఉన్నతులు నాగులు. రాజులు, రాణులు, మహర్షు లతో నాగులకు సంబంధాలుంటాయి. ఆధ్యాత్మికతకు కుండలినికి సంబంధం ఉన్నట్లే, కుండలినీ శక్తికి, ఇడ పింగళ నాడులకు నాగనాగినులతో సంబంధం ఉంటుంది. యు.జి. కృష్ణమూర్తి నాగలోక రాజధాని భోగవతి. ఆ నగరంలో ఎక్కడకు వెళ్ళినా వజ్రాలు, వైడూర్యాలు రాశులుగా కనిపిస్తాయంటారు. అర్జునుడు నాగలోకం వెళ్ళి నాగకన్య ఉలూచిని వివాహం చేసుకున్న కథ తెలిసిందే. గౌతమబుద్ధుని ప్రవచనాలు సంపుటీకరించి 'ప్రజ్ఞాపారమిత సూత్ర' గ్రంథాన్ని భోగవతి నగరంలో రాజాంతః పురంలో భద్రపరిచారంటారు. మహాయాన స్థాపనాచార్య నాగార్జునుడు నాగలోకం వెళ్ళి ఆ గ్రంథాన్ని తెచ్చి బౌద్ధ ధర్మాన్ని పునరుద్ధరించాడని కథనం.

భారతీయ వాఙ్మయంలోను, బౌద్ధ సాహిత్య సంప్రదాయాల్లోనూ నాగులకు విశేష స్థానం వుంది. పర్వత శ్రేణులలో వందలమైళ్ల పొడవైన సొరంగ మార్గాల ద్వారా నాగులు తమ స్థావరాలకు వెళ్లేవారు. 'సాంగ్ పో' లోయకు పశ్చిమంగా మానస సరోవర్ ఉంటుంది. దానిని పూర్వం 'నాగసాగరం' అనేవారు. ఆ సరోవరంలో పెద్ద పెద్ద పద్మాలు తేలుతుంటాయి. కాంతిశరీరాలు గల పరమ గురువులు ఆ పద్మాల పైన తేలిపోతూ దర్శనమిస్తారు. అందరికీ కనిపించక పోవచ్చు. మనవారు మానస సరోవరం వెళ్లేది అందుకే కాని ఎందరు పరమ గురువుల్ని దర్శించారో చెప్పలేం గదా! ...

ఆ పరమ గురువులు మానస సంచారులు. వారికి భౌతిక శరీరాలు ముఖ్యం కాదు. ఇచ్ఛ కలిగినపుడు శరీరాలు ధరించగలరు. వీరిని బౌద్ధంలో 'అర్హతులంటారు. చైనా భాషలో 'లోహన్' అంటారు. అర్హతులు అంటే అర్థం పరిణామంలో పూర్ణత్వం సాధించి, పూర్ణ మానవులై, జనన మరణ వలయాన్ని ఛేదించి అమృతులైన వారని అర్థం. వీరిని నాలుగు శ్రేణులుగా విభజిస్తారు చరిత్రకారులు:-

1. శ్రోతపత్తి : కాలప్రవాహంలో ఎదురీది నిలిచినవారు.

2. సకృత్ ఆగామి : తిరిగి భూమిపైన అవతార పురుషులుగా అవతరించేవారు.

3. అనాగామి : తిరిగి మానవజన్మకు రానవసరంలేనివారు.

4. అర్హతులు : జీవన్ముక్తులు, జ్ఞానులు.

టిబెట్లో నెలకొన్న విశ్వాసాన్ని బట్టి అర్హతుల విధులు రెండు. ఒకటి : బోధిసత్వులు కావడం. రెండు : క్రిందివారిని సంస్కరించడం.

అర్హతులు నిర్వాణపథంలో ప్రవేశించినపుడు విశ్వచైతన్యాన్ని అందు కుంటారు. అణిమాది అష్టసిద్ధులు పొందుతారు. కాలం, దూరం, ప్రకృతి శక్తులపై అధికారం పొందుతారు. ఆపైన భూమిపైన మరల జన్మించే అవసరం లేని స్థితిమంతులవుతారు. అర్హతులలో కొందరు భూమిపైనే విహరిస్తూ, మానవతను ఉద్ధరించే పని పెట్టుకుంటారు. వారు విధిగా మానవ జన్మకు రాకుండానే, అవసరమైనపుడు ఎవరిలోనో తమ ప్రజ్ఞను ప్రవేశింపచేసి, మహత్కార్యాలు నిర్వహిస్తుంటారు. అటువంటి బోధిసత్వులు అయిదుగురు సర్వదా లోకాల్ని రక్షిస్తుంటారని బౌద్ధుల నమ్మకం. వీరు ఏడాదికొక మారు హిమాలయ గుహల్లో సమావేశమై భవిష్యత్ ప్రణాళికలు తయారు చేసుకుంటారు. వారిలో ఒక్కరు మాత్రం అక్కడ నుండి కదలరు. అలా స్థిరంగా ఉండే మహాగురువు 'మైత్రేయ'. టిబెట్ లామాలకు శంబలాలోని పరమ గురువులతో సంబంధాలుంటాయి. పరమ గురువులు అర్హులైన లామాలను స్వయంగా శంబలాకు రప్పించుకుంటారు. అలా వెళ్లి వచ్చిన వారే మోరియా, కుల్తోమి, జ్వాల్ కూల్.

19వ శతాబ్దంలో బ్లవటిస్కీ టిబెట్ వెళ్లి, బౌద్ధారామాలు దర్శించినప్పుడు జ్వాల్ కూల్ దర్శనమైంది. ఆమెకు శంబలా'కు సంబంధించిన ఒక ఆశ్రమం చిత్రపటం బహూకరించాడు. అందులో మహాత్మ మోరియా గుర్రం మీద స్వారీ చేస్తున్నట్లు ఉంది. మహాత్మ జ్వాల్ కూల్ ప్రవాహం పైన నిలబడినట్లు ఉంది.

'శంబలా దర్శించాలంటే పెంచన్ లామా అనుమతి అవసరం. షిగాట్సే సమీపంలోని 'తాషిలంపో' బౌద్ధారామం పెంచన్ లామా నివాసం.

తాషిలంపోలో మైత్రేయ బుద్ధుని ఆలయం వుంది. అది లామా మత గురువు పెంచన్ లామా సృష్టి. 1916లో ఆ ఆలయంలో మైత్రేయ బుద్ధుని విగ్రహ స్థాపనకు పెంచన్ లామా తన గురువైన 'యోంగ్ పూ రిన్ పోషే'ను ఆహ్వానించాడు. ఆయన తాను వయోవృద్ధుడి నైనానని రాలేనని చెప్పాడు. అయినా వినక, నలుగురు మనుషులతో ఒక పల్లకిని పంపించారు. పెంచన్ లామా గురువు గారు కనిపించ లేదు. కానీ ముహూర్తం వేళకు గురువు స్వయంగా నడుచుకుంటూ వచ్చాడు. అందరూ ఆశ్చర్యపోయి చూస్తుండగా ఆయన మెట్లెక్కి వచ్చి 'మైత్రేయ బుద్ధి విగ్రహాన్ని ఆలింగనం చేసుకున్నాడు. ఆపైన విగ్రహంలో లీనమైపోయాడు.

గౌతమబుద్ధుని జీవితంలో చాలామందికి తెలియని ఉదంతం ఒకటి ఉంది. సిద్ధార్థుడు అంతఃపురం వదలి, రెండు వారాలు ప్రయాణం చేసి శంబలా చేరిన కథ వుంది. సిద్ధార్థుడు అరణ్యంలో పోతుండగా ఒక వేటగాడు కనిపిస్తాడు. అతను నిజం వేటగాడు కాదు. వేటగాని వేషంలో ఉన్న ఒక సన్యాసి. అతను సిద్ధార్థుని రాకకై నిరీక్షిస్తున్నాడు. ఆ రాత్రి సిద్ధార్థుడు సన్యాసి ఆశ్రమంలో నిద్రించి, మర్నాడు ఉదయం మంచుతెరలు విడిపోయిన తర్వాత, సన్యాసి వెంట ఒక నదీ తీరానికి చేరతాడు.

వేటగాని వేషంలో ఉన్న సన్యాసి విల్లు ఎక్కుపెట్టి నదిపైకి ఒక బాణం వదిలాడు. ఇద్దరూ నిరీక్షిస్తుండగా సిద్ధార్థుడు తన స్వర్ణాభరణాలు తీసి ఆ సన్యాసి కిచ్చాడు. ఆయన వాటిని నదిలో విసిరివేశాడు. ఆ తర్వాత నది అవతల ఒడ్డు నుండి ఒకాయన పడవలో ఇవతలి ఒడ్డుకు వచ్చాడు. వచ్చి గౌతముని తనవెంట తీసుకుపోతాడు. అవతలి ఒడ్డుకు చేరగానే ఇద్దరు గుర్రాలెక్కి మంచు పర్వతాల పైన ఏడు రోజులు ప్రయాణం చేసి 'శంబలా' చేరుకున్నారు.

బుద్దుడు తాను తిరిగి జన్మించనవసరం లేదని, తాను 'మైత్రేయ'గా వ్యవహరిస్తానని చెప్పాడు.

పునర్జన్మలు లేవన్న బుద్ధునికి పూర్వజన్మలున్నాయి. మనిషి ఆయుర్దాయం అరవైవేల సంవత్సరాలుగా ఉన్న కాలంలో వరదరాజ కుమారుడు బుద్ధ క్రకుచ్ఛందగా జన్మించాడు. అప్పటి ఆయన బోధలు నశించిపోయాయి. మానవ ఆయుర్దాయం ఇరవైవేల సంవత్సరాలుగా ఉన్న కాలంలో క్రికిరాజ కుమారుడు బుద్ధ కశ్యపగా జన్మించాడు. ఆ తర్వాతనే శుదోధనుని కుమారుడు బుద్ధ శాక్య మునిగా జన్మించాడు.

# 3. హృషీకేష్ లో గంగానది తీరాన

"గంగానది తీరాన స్వామీజీ ధ్యానంలో కూర్చున్నారు. నేను నా మనస్సులోని కొన్ని ప్రశ్నలు రాసుకొని స్వామీజీ వద్దకు వెళ్లి కూర్చున్నాను"

**ప్రశ్న : స్వామీజీ మీరు ప్రపంచానికి ఏమి ఇవ్వాలి అనుకుంటున్నారు?**

**జవాబు :** ఇవ్వడానికి నా దగ్గర ఏమీ లేదు. కానీ చూపించగల్గుతాను. ఎలా అంటే మీ దగ్గర ఉన్న ధనాన్ని చూపించగల్గుతాను. నాకు తెలిసిన 10 మంది వాళ్ళ ఊహ తెలిసినప్పుడు నుండి ధనము కోసం భిక్షాటన చేస్తున్నారు. నేను ఒకసారి వాళ్ళదగ్గరకు వెళ్ళాను. వాళ్ళు నన్ను అడిగారు అయ్యా ఏమైనా దానము ఇవ్వండి అని. ఆ పదిమందితో చెప్పాను. ఇద్దఆనికి నా దగ్గర ఏమీ లేదు. కానీ మీ జీవితం మొత్తం తరగని అంత ధనం మీకు ఇస్తాను అని చెప్పాను. అవునా! ఎలా ఇస్తారు చెప్పండి అయ్యా అని అడిగారు. అవును రోజు మీరు ఎక్కడ పడుకుంటున్నారు, ఎక్కడ కూర్చుంటున్నారు అని అడిగాను. వారు చెప్పారు మా తాతగారు ఒక్క పెట్టె ఇచ్చారు. ఆ పెట్టె మీద కూర్చుంటాను అని చెప్పారు. నన్ను అక్కడికి తీసుకు వెళ్ళండి అని చెప్పాను. వాళ్ళు నన్ను ఇంటికి తీసుకువెళ్ళారు. అప్పుడు వాళ్ళు ఏ పెట్టె మీద కూర్చుని అన్నం తింటారో, ఏ పెట్టె మీద రోజూ పడుకుంటారో ఆ పెట్టె తాళాన్ని తీయమని అడిగాను. అడిగితే దానికి తాళము చెవి లేదు అన్నారు. నా దగ్గర ఉన్న తాళం చెవితో ఆ పెట్టెను తెరిచారు. ఆ పెట్టె నిండా ధనం, వజ్రాలు ఉన్నాయి. బంగారం రకరకాల విలువైన నగలు ఉన్నాయి. అలాగే మీరు రోజంతా కూర్చొని రోజు పడుకున్నప్పుడు పెట్టెలో ఏమి ఉందో తెలియదు నాకు తెలుసు. అలాగే మీరు దేహంతో నడుస్తున్నారు. మీ దేహంతో కష్టపడుతున్నారు. కానీ మీ దేహంలో ఏముందో మీకు తెలియదు. కొందరికి తెలిసిన ఎలా ఓపెన్ చెయ్యాలో తెలియదు. కాబట్టి మీ దేహంలో ఉన్న ఆత్మ శాశ్వతమైన ఆనంద స్వరూపం పరమాత్మ స్వరూపం. నేను మీకు మీ తాళాన్ని తీసి చూపించగల్గుతాను అంతే ఇవ్వడానికి నా దగ్గర ఏమీ లేదు.

ప్రశ్న : **స్వామీజీ మా మనస్సులో కొన్ని సందేహాలు ఉన్నాయి, మీరు మా సందేహాలను తీర్చగలరా?**

**జవాబు** : నేస్తమా! నా ముందు కూర్చునే ముందు మీ మనస్సుని ఖాళీ చేసి కూర్చోండి.

ప్రశ్న : **స్వామీజీ నాకు అర్థం కాలేదు?**

**జవాబు** : మిత్రమా! నీ మనస్సులో పొందుపరచుకున్న సమస్త భావాలు అన్ని తుడిచి వేయగలగాలి. ఏ వేదము, ఏ ఉపనిషత్తు, ఏ పురాణము, ఏ ఊహ లేకపోవడం, ఏ ఇచ్ఛ లేకపోవడం, ఏ ప్రయత్నం లేకపోవడం నీ మనస్సును ఖాళీ చేసి కూర్చో.

# 4. భక్తిలో జ్ఞానం ప్రశ్న

ప్రశ్న : **స్వామీజీ అలాగే, నా మనస్సుని ప్రశాంతంగా చేసుకొని కూర్చున్నాను. నా మనస్సులో ఉన్న కొన్ని ప్రశ్నలు మీ ముందు ఉంచుతాను. వేదాలు, ఉపనిషత్తులు, జ్ఞానం, సాధకుడికి ఎంత వరకు ఉపయోగపడతాయి?**

**జవాబు** : నాలుగు వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు అన్ని చదివినా జ్ఞానం కలిగినట్లు కాదు. పాండిత్యం అబ్బుతుంది. ప్రావీణ్యం కలుగుతుంది. వివేకం పెరుగుతుంది. అజ్ఞానం తొలగినట్లు మాత్రం కాదు.

అంటే ఏమిటి? జ్ఞానం ఎక్కడో బయటనుండి దిగుమతి అయ్యేది కాదని, పుస్తకాలలో, మస్తకాలలో జ్ఞానం ఉండదని. మేధకు అందనిది జ్ఞానం. అంటే అసలు సిసలైన మౌలిక జ్ఞానానికి మనసు అవరోధం. ప్రతిబంధకం అని. ఏమి చదవకపోయినా, కాలం కలిసొస్తే జ్ఞానం బయటపడుతుంది. మాయ ముసుగు తొలగడమే జ్ఞానోదయం. జ్ఞాని అయినవాడే గురుస్థానానికి అర్హుడు. సాయిబాబా సద్గురువు. జ్ఞానేశ్వర్ మహాగురువు. గురువు అయినవాడు మహాపండితుడు కానవసరం లేదు. జాసం పాతాళగంగ. అది ఊట. హృదయం నుండి ఉబికి వస్తుంది. "

జ్ఞానికి వేదాలు అవసరం లేదు. ఉపనిషత్తుల విజ్ఞానం అవసరం లేదు. ఒక మాధ్యమం ద్వారా గ్రహించగలిగింది జ్ఞానం కాదు. అది పరిజ్ఞానం మాత్రమే. జ్ఞాని స్వయంసిద్ధుడు. ఒకరిపై ఆధారపడడు. శ్లోకాలు వల్లించడు. తన జ్ఞానానికి ఆధారాలు వెతకడు. పాండిత్యం ఆధారంగా ఎన్ని సిద్ధాంతాలైనా చేయవచ్చు, రాద్ధాంతాలు చేయవచ్చు, వ్యాఖ్యలు చేయవచ్చు. ఏవీ సత్యం కాదు. అన్నీ మానసికాలు, మానసిక వికారాలు. ఏ ఇద్దరి వ్యాఖ్యలు ఒక్కలా ఉండవు. ఏ ఇద్దరి అభిప్రాయాలూ కలవవు. అన్ని వ్యర్థాలు పోగుచేయడం వల్ల మనసు తన మౌలికతను, సున్నితత్వాన్ని కోల్పోయి మొద్దుబారుతుంది. స్వతంత్రంగా సత్యాన్ని గ్రహించదు. అనవసరంగా మెదడు భ్రష్టుపట్టిపోతుంది.

ఒకే విషయాన్ని పదిమంది మేధావులు పది విధాల వ్యాఖ్యానిస్తారు. సత్యానికి దూరంగా లాగడమే మేధావులు చేసే పని. ఏది నిజం? ఏది సత్యం? నమ్మినంత మాత్రాన, నమ్మించగలిగినంత మాత్రాన అది సత్యసమ్మతం కాదు. ఒకరి అభిప్రాయంతో మనం ఏకీభవించినట్లే అవుతుంది తప్ప సత్యాన్ని అంగీకరించినట్లు కాదు. ఉదాహరణకు భగవద్గీతకు ఎన్ని టీకాలు, తాత్పర్యాలు చదివినా శ్రీకృష్ణ హృదయం అర్థం కాదు. అది వ్యాఖ్యాతల అవగాహన, దృక్పథం. అసలు శ్లోకాలు చదివినప్పుడు మనకు అవగాహన కలిగినంతమేరకే సత్యం. ఒక్క భగవద్గీత అని కాదు – అన్నీ అంతే.

గీత జ్ఞాన భాండారం. తరచిన కొద్దీ పరమసత్యాలు బయటకి వస్తుంటాయి. అంటే ఏమిటి? సత్యాన్ని మాటలతో చెప్పలేమని. మాటలు, భాష వ్యక్తం చేయలేనిది సత్యం. సత్యం అవ్యక్తం అని. ఏదైనా మనం అనుభూతించిన మేరకే సత్యం – మిగిలింది అసత్యం అని కాదు. సత్యాసత్యాలను పరిశోధించేది హృదయం. ఎన్ని పుస్తకాలు చదివినా మాటలతో అర్థాలు చెప్పలేం. మాటలకు అందనిది సత్యం. అది అనంతం. మౌనరాగాలు ఒక పట్టాన అర్థం కావు.

ఎంత ప్రయత్నించినా మామిడిపండు రుచిని వర్ణించలేం గదా. పండును చిత్రించవచ్చు. ఫోటో తీయవచ్చు. రుచిని ఫొటోలో చూపలేం. అనుభవంతో పొందే అనుభూతి రుచికి ప్రమాణం. అలాగే యోగఫలాన్ని వర్ణించలేం. అదీ అనుభూతించవలసిందే. జ్ఞాని అయినా తన జ్ఞానం ఇదీ అని చెప్పలేడు. జ్ఞానానికి అంతం లేదు. శిష్యునికి మాత్రమే గురువు యొక్క జ్ఞానం రుచి తెలుస్తుంది. గురువు హృదయం తెలుస్తుంది. అర్థించినంత మాత్రాన గురువు తన జ్ఞానాన్ని ఎవ్వరికీ ఇవ్వలేదు. ప్రార్థించినా ప్రయోజనం లేదు. సాధనతో హృదయం ప్లావితం కావాలి. జ్ఞానం మొలకెత్తాలి. గురువును హృదయంతో ఆరాధించిన వారికే జ్ఞానమార్గం కనిపిస్తుంది. అయినా అది అవాచ్యం, అది అవ్యక్తం. జ్ఞానం పంచడం గురువు అధీనంలో ఉండదు. జ్ఞానం అతని స్వంతం కాదు. అది ఘటన. అది శిష్యుని సత్కృతికి ఫలం.

శిష్యులు అనిపించుకున్న ప్రతి ఒక్కరు జ్ఞానార్థులు కాదు. శిష్యులు గురువును పూర్తిగా విశ్వసించరు. గురువుపట్ల పూర్తి నమ్మకం ఉండదు. అటువంటి వారిని గురువు అంత దూరంగానే ఉంచుతాడు. వారు తమ నమ్మకాలు వదలరు. అలా పూర్వవాసనలు వదలకపోవడం శిష్యుల బలహీనత. అదే వారి అనర్హత. శిష్యులకు పాతది కావాలి, కొత్తదీ కావాలి. ఏదీ వదులుకోరు. పాతబట్టల పైన కొత్తబట్టలు ధరిస్తారు. అది వికారం! అనవసరమైన వాటిని వదులుకోకపోతే ఎలా? ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవు కదా! అజ్ఞానం జ్ఞానం సమపాళ్లలో ఉంచుకుంటాడు శిష్యుడైనవాడు. తాము కష్టపడకుండా ఫలితం పొందాలనుకోవడం శిష్యుల బలహీనత.

'నేను' అనే భావం వదలడు. అహంకారం తగ్గించుకోడు. పైగా అతిశయం, స్వార్థం. తనను మైనస్ చేసుకుంటే తప్ప గురువు అనుగ్రహం లభించదు. ఉత్తినే గురువుదయ కావాలంటే ఎట్లా? శిష్యుడు తన వ్యక్తిత్వాన్ని, అహాన్ని వదిలేవరకు గురువు ప్రసన్నం కాడు. అంటే గురుతత్వాన్ని అర్థం చేసుకుని అందులో తను లీనం కావాలి. నేటి కాలంలో అటువంటి నిస్వార్థ, నిరహంకార శిష్యులు కనిపించరు. సద్గురువులు కనిపించరు.

ఏమి త్యాగం చేయకుండా ఆధ్యాత్మికంగా అభివృద్ధి సాధ్యపడదు. భౌతిక, ప్రాపంచిక కాపీనాలు పోతే తప్ప ఆత్మ గురించి తెలియవు. ఆత్మను ఆశ్రయించడం అంత సులభం కాదు. "నేను, నాది" అనుకున్నంతకాలం ఇతరం చీకటిగానే ఉంటుంది. మార్గం కనిపించదు. మసకగా ఉంటుంది. జ్ఞానం కలగదు. బురదలో మొలదాకా కూరుకుపోయి బయటపడడం ఎలా వీలు? కనీసం మానసికంగానైనా త్యాగాలు చేయరు. ఒడ్డుకు చేరితే గదా అడుగు ముందుకు పడేది.

అయితే ఏం చేయాలి? శూన్యం కావాలి? శూన్యంలో ప్రయాణించాలి. శూన్యంలో ప్రయాణించేవరకు ఆత్మస్పృహ కలగదు. నేను లేనన్న తెలివిడి కలగాలి. మనసును దాటిపోతే తప్ప ఆత్మ చైతన్యం కలగదు. మనంగా ఏమి చేయనవసరం లేదు. శూన్యం అయితే చాలు. ఆత్మే మనల్ని తనవైపు లాగుతుంది. అది ఆత్మ ఆకర్షణ.

ఆత్మను గురించి ఆలోచించడం అనవసరం. ఆలోచనకు ఆత్మ అందదు. ఆ విషయం తెలియడమే ఆత్మజ్ఞానం. జ్ఞానోదయం అవడం' అంటే బ్రాహ్మీ ముహూర్తంలో భళ్లున తెల్లారడం కాదు. జ్ఞానభాస్కరుడు అంటారు. అది నిజం కాదు. అక్కడ వేడి ఉండదు – వెలుగు తప్ప, తీవ్రంగా ధ్యానం చేయడం ఒక్కటే ఉపాధి. రోజుల తరబడి సమాధిలో ఉన్నా ఒరిగేది లేదు. జ్ఞానం కలగదు.

ఒక హఠయోగి ఉండేవాడు. ఆయన రోజులు తరబడి సమాధిలో ఉంటూ తనంతటి మహర్షి ఎవరూ లేడనుకునేవాడు. ఒక రోజున అతనికి ఆకలైంది. కళ్లు తెరిచి, శిష్యుని పిలిచి 'శిష్యా! భోజనం తెప్పించు' అన్నాడు. ఆ శిష్యుడు ఊల్లోకి వెళ్లి, భోజనం తెచ్చేలోగా మరల సమాధిలోకి వెళ్లిపోయాడు. పది రోజుల తర్వాత కళ్లు విప్పి "ఏదిరా డింభకా భోజనం' అని అరిచాడు. అతను పదిరోజుల సమాధి వేస్టు. అన్ని రోజులు అతని ధ్యాస భోజనం పైనే ఉంది.

అతని ఆకలి తీరలేదు. తినాలన్న కోరిక పోలేదు. శిష్యునిపై హుంకరించడంతో అతని అహంకారం తగ్గలేదు, పైగా పెరిగింది. ఆ ధ్యానం వల్ల మనసు నిర్మలం కావాలి. నిష్కల్మషం కావాలి.

ప్రశ్న : **స్వామీజీ ఆత్మజ్ఞానం పొందాలంటే భక్తి మార్గంలో వెళ్లాలంటే బ్రహ్మచారి అయ్యి ఉండాలి అని అంటారు, గృహస్థులకు అవకాశం లేదా ?**

**జవాబు** : సోదరా! నీ ప్రశ్న వింటుంటే నా చిన్నతనంలో తర్కశాస్త్రం చదువుతున్నప్పుడు మా గురువుగారు చెప్పిన కథ గుర్తుకు వస్తుంది. మాత "గార్గి" మహర్షి యజ్ఞవల్కుడ్ని ఇదే ప్రశ్న వేసింది. ఈ ప్రశ్నకు సమాధానం యజ్ఞవల్కుడు ఎప్పుడో సమాధానం చెప్పాడు. అయినా మళ్ళీ నేను మీకు వివరిస్తాను. మాత "గార్గి" ఏమని అడిగింది అంటే బ్రహ్మచారి స్వతంత్రుడు తను పరమాత్ముడ్ని పొందగలుగుతాడు. గృహస్థుడు బంధములో ఇరుక్కొని ఉంటాడు. పిల్లలు జన్మిస్తే వారికి చింతన మొత్తం కుటుంబంపై ఉంటుంది. అని మాత "గార్గి" యజ్ఞవల్కుడ్ని

ప్రశ్నించింది. యజ్ఞవల్కుడు ఈ విధంగా సమాధానం ఇచ్చాడు. ప్రేమ స్వార్థం అయితే బంధము అవుతుంది. ప్రేమ పరిపూర్ణం అయితే పరమాత్మ అవుతుంది అని చెప్పాడు. యజ్ఞవల్కుడు దానికి మాత గార్గి ఏ గ్రంథాన్ని ఉదహరించి మాట్లాడుతున్నారు అని అడిగింది గార్గి

యజ్ఞవల్కుడు సూర్యుడ్ని సాక్షిగా తీసుకొని ఆ తర్కంలో గెలిచాడు యజ్ఞవల్కుడు. మాత గార్కి యజ్ఞవల్కుడ్ని బ్రహ్మజ్ఞానిగా ప్రకటించింది.

ప్రశ్న : **స్వామీజీ ప్రేమ స్వార్దం అయితే బంధం ఏర్పడుతుంది. ప్రేమ పరిపూర్ణం అయితే పరమాత్మ అవుతుంది అని అన్నారు మాకు అర్థం కాలేదు.**

**జవాబు** : మిత్రమా! ప్రేమ స్వార్థం అంటే నా కొడుకు, నా భార్యా నేను చెప్పినదే వినాలి. వాళ్ళు లేనిదే నేను లేను. అతిగా మమకారము పెంచుకుంటే అది స్వార్థమైన ప్రేమ. అది బంధమై బాధపెడుతుంది. పరిపూర్ణమైన ప్రేమ అయితే ఈశ్వరా! ఈ సృష్టి అంతా నీ స్వరూపమే నాతో పాటు కలిసి బ్రతకడానికి భార్య, పిల్లల్ని ఇచ్చావు అంతే. వాళ్ళు నీ వాళ్ళు ఈశ్వరా! వాళ్ళ స్వేచ్ఛకి ఏ భంగం కలిగించను. మాటల వల్ల కానీ, నా ప్రవర్తన వల్ల కానీ ఏ ఇబ్బంది కలిగించను. ఈ సృష్టి నీది నేను ఒక ప్రయాణికుడిని. నాతోటి ప్రయాణికులైన నా కుటుంబాన్ని ప్రేమిస్తూ కేవలం నీ కొరకు నా మానవ జీవన ప్రయాణాన్ని కొనసాగిస్తాను. అని గృహస్తుడు తన సాధన కొనసాగించినట్టయితే ఏ బ్రహ్మచర్యం పాటించనవసరం లేదు. గృహస్తు జీవితంలో ఉండి ముక్తి పొందవచ్చు. కబీర్ దాస్, సప్తఋషులు, వీరంతా గృహస్తులే మిత్రమా.

ప్రశ్న : **స్వామీజీ మానవుడికి శత్రువులు అనేవారు ఎవరు లేరు నీలోపల శత్రువు, మిత్రువు ఉన్నారు అంటారు అది ఎలా?**

**జవాబు** : మిత్రమా! నీ ఆలోచనే నీ శత్రువు. నీ ఆలోచన పుట్టిన ప్రతిసారి నీవు పుడుతున్నావు. నీవు అంటేనే అహంకారం, అహాన్ని దాటితేనే శత్రువు అనే వాళ్ళు లేరు అది అంతర్గతం కావచ్చు, బహిర్గతం కావచ్చు.

**ప్రశ్న : స్వామీజీ కొన్ని సందర్భాలలో మాట్లాడడం వల్ల కర్మ పెరుగుతుంది అంటారు. అది నేజమేనా?**

**జవాబు :** మిత్రమా! మాట్లాడటం వల్ల కర్మ పెరగడం కాదు, మరల కూడా జన్మించే అవకాశం ఉంటుంది. ఉదాహరణకు ఒక కథ చెబుతాను. "ఒక రాజు ఉండేవాడు. ఆయనకు సంతానం లేదు. ఆయన ఎందరో సాధువులను, సన్యాసులను ఆశ్రయించాడు. ఎందరో దేవతలకు మ్రొక్కుతాడు. అయినా సంతానం కలుగలేదు. ఇలా ఉండగా అతని రాజ్యంలోకి కొత్తగా ఎవరో గొప్ప మహత్తు గల సాధువు వచ్చాడు. ఈ సంగతి విని రాజు ఆ సాధువు దర్శనం కోసం వచ్చాడు. తనకు సంతానం కలగాలంటే "ఈ విషయంలో నేనేమీ చెయ్యలేను. మహారాజా! మీకు సంతానయోగం లేదు" అని చెప్పాడు సాధువు. రాజు నిరాశతో తిరిగిపోసాగాడు. దారిలో ఆ సాధువు యొక్క శిష్యుడు ఎదురయ్యాడు. అతడు మహారాజు ఉ దాసీనంగా ఉండటం చూసి, "రాజా! ఎందుకలా ఉన్నారు?" అని అడిగాడు. రాజు 'పుత్రేచ్ఛతో ఇక్కడకు వచ్చాను. కానీ నిరాశతో తిరిగి వెళ్ళిపోతున్నా"నని బదులిచ్చాడు. రాజుదైన్యాన్ని చూసి, జాలితో ఆ శిష్యుడు "మహారాజా! బాధపడకండి. మీకు తప్పక సంతానం కలుగుతుంది" అన్నాడు. రాజు సంతోషంతో తిరిగి వెళ్ళిపోయాడు. ఈ సంగతి అంతా తెలుసుకున్న గురువు శిష్యునిపై కోపించాడు. "రాజు జాతకంలో సంతాన యోగం లేదు. నువ్వేమో సంతానం కలుగుతుందని దీవించావు. ఇప్పుడు ఏం చేస్తావు? అని గద్దించాడు. శిష్యుడు "అయ్యా! ఇప్పుడు నేనేం చెయ్యను? అనాలోచితంగా నానోట వెంట అలా వచ్చేసింది?" అని బాధపడ్డాడు. గురువు "నీకు అసత్యదోషం రాకుండా ఉండాలంటే నువ్వే రాజుకు పుత్రునిగా జన్మించాలి" అన్నాడు.

విధిలేక శిష్యుడు తన దేహాన్ని త్యజించి, మహారాజుకు పుత్రునిగా జన్మించాడు. అయితే గురుకృప వలన అతనికి పూర్వం జన్మ జ్ఞానం నశించలేదు. రాజకుమారుడికి అన్నీ శుభలక్షణాలే గాని, మాటామంతీ లేకుండా ఉండేవాడు. మూగవాడైనా తన కుమారుడిని ఎందరో వైద్యులకు

చూపించాడు మహారాజు. అయినా ఫలితం లేకుండాపోయింది. చివరకు తన కుమారుడికి మాట తెప్పించిన వారికి లక్ష రూపాయలు బహుమానం ఇస్తానని రాజ్యంలో దండోరా వేయించాడు. ఎందరోవచ్చి ఏమేమో చేశారు. కానీ ఫలితం శూన్యం.

రోజులు గడిచిపోతున్నాయి, రాకుమారుడు కొంచం పెద్దవాడయ్యాడు, ఒక రోజు రాజాధికారులు, రాజకుమారుడిని వనవిహారం కోసం తీసుకువెళ్ళారు. అక్కడ ఒక బోయవాడు పక్షులను కొట్టడానికి మాటువేసి కూర్చున్నాడు. కానీ అతనికి ఒక పిట్ట కూడా కనపడలేదు. ఇంతలో ఒక పిట్ట చెట్టుమీద కువకువలాడింది. అయితే, వేటగాడు పిట్టను గమనించి దాన్ని బాణంతో కొట్టాడు. అది విలవిలలాడుతూ నేలపై పడి చనిపోయింది.

ఇదంతా చూసిన రాజకుమారుడు నోట అప్రయత్నంగా "మాట్లాడితే మరణమే'' అనే మాటలు వెలువడ్డాయి. అతడి వెంటనున్న రాజాధికారులు, రాజకుమారుడు మాట్లాడటం చూసి ఆశ్చర్యపోయారు. పరుగుపరుగున మహారాజును చేరుకుని జరిగినది వివరించారు. రాజు వారి మాటలను నమ్మలేదు. తన ఎదురుగా రాజకుమారుడిని మాట్లాడిస్తే మీరు చెప్పినది నమ్ముతానన్నాడు. రాజాధికారులు ఎంత ప్రయత్నించినా, ఎంత బ్రతిమిలాడినా రాజకుమారుడు పెదవి కదపలేదు. రాజు వారు చెప్పింది అబద్ధమనుకున్నాడు. డబ్బుకోసం ఆశపడి రాజాధికారులు అబద్ధం చెప్పారనుకొని, వారిని ఉరితీయమని ఆజ్ఞాపించాడు. వెంటనే రాజకుమారుడు 'మాట్లాడితే మరణమే" అన్నాడు.

మహారాజు ఎంతగానో ఆశ్చర్యపోయాడు. అతడు రాజకుమారుడిని మరల మాట్లాడమని ఎంతగానో ప్రాధేయపడ్డాడు. చివరకు రాజకుమారుడు "మహారాజా! నేను పూర్వజన్మలో మీకు సంతానం కలుగుతుందని దీవించిన సన్యాసిని, మీ జాతకంలో సంతానయోగం లేకపోయినప్పటికీ నేను మిమ్ములను అలా దీవించాను. దాని ఫలితంగానే ఈ జన్మనెత్తి మీకు పుత్రునిగా పుట్టవలసి వచ్చింది. ఒకవేళ ఆ రోజు నేనలా మాట్లాడకపోయి ఉంటే, చక్కగా తపస్సు చేసుకుని ముక్తిని

పొందేవాడిని, నాకిక జన్మనెత్తవలసిన అవసరమే ఉండేది కాదు. పక్షి కూడా ఏ శబ్దమూ చెయ్యకుండా, మౌనంగా ఉండి ఉంటే, దాన్ని బోయవాడు చంపేవాడు కాదు. అలానే ఈ అధికారులు నేను మాట్లాడానని మీకు చెప్పకపోయి ఉంటే వారికి ఈ మరణశిక్ష ఉండేది కాదు. అన్ని అనర్థాలకు కారణం అనవసరంగా మాట్లాడటమే. అందుకనే "మాట్లాడితే మరణమే"నని అనుకోకుండా అన్నాను. నేనింతవరకు మాట్లాడాను కనుక నేను కూడా మరణిస్తాను అని చెప్పి తనువు చాలించాడు.

ప్రశ్న : **స్వామీజీ మీరు ధర్మగ్రంథమైన భగవద్గీత శ్లోకాలు నేటి సైన్సుకి అర్థమైన విధంగా చెబుతారు. అంతా మా కోసం ఒక శ్లోకం చెప్పగలరు? అలాగే భక్తికి సంబంధమైన ఏ శ్లోకాన్ని అయిన ఇప్పుడు ఉన్న యువతకు, సైన్సుకకకు అర్థమైన విధంగా చెబుతారు అని విన్నాను, అదేవిధంగా మాకు అర్థమయ్యే విధంగా చెప్పగలరు?**

జవాబు : మిత్రమా! భగవద్గీతలో మొదటి శ్లోకాన్ని చెబుతున్నాను విను.

**"ధర్మక్షేత్రే కురుక్షేత్రే నమవేతా యుయుత్సవః**
**మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥"**

ఈ శ్లోకం భగవద్గీతలో మొదటి శ్లోకం. ఈ శ్లోకాన్ని పరిశీలించినట్లయితే కండ్లులేని ధృతరాష్ట్రుడు ధర్మక్షేత్రం నందు ఏమి జరుగుతుంది అని సంజయుడిని అడిగారు. కొన్ని వందల కిలోమీటర్లు దూరంలో జరుగుతున్న యుద్ధం గురించి ఇక్కడ కూర్చున్నవారు చెప్పవచ్చా! అది సాధ్యమా! కాదా! . అని చాలా మంది నన్ను అడిగిన ప్రశ్న. ఎలా సాధ్యము అవుతుంది సంజయుడు యోగ సాధకుడు కాదు, జ్ఞాని కాదు, ఒక మామూలు వ్యక్తి. అలాంటిది సంజయుడు ఎక్కడో జరుగుతున్న యుద్ధాన్ని చూసి ధృతరాష్ట్రుడికి ఎలా చెప్పగలుగుతున్నాడు సంజయుడు జన్మతహా జ్ఞాని అని తెలుసు కొంతవరకు జ్ఞానం పొందిన వ్యక్తి. కాబట్టి సంజయుడు ఆ ఉన్న జ్ఞానంలో కండ్లు మూసుకొని ధర్మక్షేత్రంలో ఏమి జరుగుతుంది అని చెప్పగల్గుతున్నాడు. కాబట్టి చెప్పడం సాధ్యమే, సాధ్యమౌతుంది కూడా ఉదాహరణకు రెండు ఉదాహరణలు

చెబుతున్నాను. అంతే నేటి సైన్సుకి అనుకూలంగా అమెరికాలో టెట్ సిరియో అనే వ్యక్తి ఉండేవాడు. న్యూయార్క్ లో కూర్చున్న టెట్ సిరియో అనే వ్యక్తి కొన్ని వేల కిలోమీటర్ల దూరంలో ఏమి జరుగుతుందో చూసి ఆ విషయం చెప్పేవారు. ఇది నిజంగా కొన్ని రోజుల క్రితం అమెరికాలో జరిగింది. కేవలం చూసి చెప్పేది మాత్రమే టెట్ సిరియోకి ఉంది. అలాగే ప్రస్తుతం మన ముందు లైవ్ లో ఉన్న అమ్మాయి తన పేరు యోగమాత, యోగమాత 10 సంవత్సరాల వయస్సు తమిళనాడులో నిత్యానందస్వామి వద్ద ఉన్నది. ఆమె కండ్లకి గంతలు కట్టి ఏ పుస్తకం ఇచ్చినా చదువుతుంది. అమెరికా కాలిఫోర్నియాకు ఆమెను తీసుకువెళ్ళి పరిశీలించారు. మీకు ఇంకా విషయం తెలుసుకోవాలంటే గూగుల్ లో చూడవచ్చు. దీన్ని మనం ఏమని అంటే గిన్నీస్ బుక్ రికార్డు అంటారు. అంటే ప్రకృతి కొందరికి కొంత ఉన్నతమైన శక్తిని ఇస్తుంది. వారే గిన్నీస్ బుక్ రికార్డు వాళ్ళు, అలాగే సంజయుడు ఇక్కడ కూర్చొని కొన్ని వేల కిలోమీటర్ల దూరంలో ఏమి జరుగుతుంది చూసి చెప్పే శక్తి సాధ్యమవుతుంది. అది ఒక సిద్ధిలాంటిదని చెప్పవచ్చు.

**ప్రశ్న : స్వామీజీ శ్రీ లలితా సహస్రనామములు గురించి చెప్పండి?**

**జవాబు :** శ్రీ లలితా సహస్ర నామాలలో మొదటి శ్లోకం గురించి మీకు చెబుతున్నాను.

**"ఓం శ్రీమాతా శ్రీమహారాజ్ఞే శ్రీమత్సింహాసనేశ్వరీ!**
**చిరగ్నికుండసంభూతా దేవకార్యసముద్యతా ॥"**

ఈ లలితా సహస్ర నామాలు గురించి అగస్త్య మహర్షి చెప్పారు కాబట్టి అగస్త్య మహర్షి చెప్పిన వాటికి నేను అర్థాన్ని చెబుతున్నాను. "శ్రీమాతా శ్రీ మహారాష్ట్ర" అంటే అమ్మ మహాదేవత. అగస్త్య మహర్షి జనులకు గురించి ఉద్దేశించి ఏమి చెబుతున్నారు అంటే, "శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరి" సింహాన్ని ఎక్కి వస్తున్న దేవి అని అర్థం. "చిదగ్నికుండ సంభూతా" అగ్ని కుండ స్వరూపిణివి అమ్మా అని "దేవకార్యసముత్యతా ఈ శ్లోకాన్ని ఇదే అర్థ: అని అనుకుంటారు. కానీ అది తప్పు.

"శ్రీ మాతా శ్రీమహారాజ్ఞై శ్రీమత్సింహాసనేశ్వరిశ్రీ" అంటే జనులు అమ్మవారు పూజ చెయ్యాలనుకుంటే "శ్రీమత్సింహాసనేశ్వరి" అంటే సింహం మీద ప్రయాణం చేస్తున్నారు అని అర్థం. సింహం అంటే అడవిరాజు మరియు ఆ సంహాన్ని ఎక్కి ప్రయాణం చేస్తున్నామా! అవును చేస్తున్నాము. మనలో ఉన్న అహంకారాన్ని తీసివేసి అగ్నికుండలో వేసి "దేవకార్య సముద్యతా" అప్పుడు మీరు దేవకార్యాన్ని ప్రారంభించండి, అని అర్థము. అగస్త్య మహర్షి ఈ శ్లోకాన్ని మనలో ఉన్నా అహంకారాన్ని పూర్తిగా ఆహుతి ఇచ్చి అహంకారం లేని స్థితిలో దేవకార్యాన్ని ప్రారంభం చేయమని చెప్పారు. ఇది ఈ శ్లోకానికి అర్థం.

ప్రశ్న : స్వామీజీ బిల్వష్టకం గురించి తెలియజేయగలరా?

జవాబు : బిల్వష్టకం గురించి పరిశీలించినట్లయితే

**"త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చత్రియాయుధం ।**
**త్రిజన్మ పాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ ॥"**

అంటే ఒక త్రిదళం ఆకును సమర్పిస్తే మూడు జన్మల పాపాలు హరిస్తుంది అని అర్థము. ఇదే అర్థాన్ని కొంతమంది చెబుతూ ఉంటారు. కొన్ని పుస్తకాలలో కూడా ఇదే అర్థాన్ని రాసారు. కానీ నిజమైన అర్థం అది కాదు "త్రిదళం, త్రిగుణాకారం" మూడు ఆకుల సమూహం, మూడు గుణాలు అని అంటే తమోగుణం, రజోగుణం, సాత్విక గుణం ఈ మూడు గుణాలు, మూడు ఆకులతో కలిపి "త్రినేత్రం చ త్రియాయుధం" అంటే మూడో నేత్రంతో ఉన్న స్వరూపుడా! నీ ఆయుధంతో నా మూడు గుణాలను భస్మం చేయమని మూడు ఆకులకి, మూడు గుణాలను అర్పించి వేయాలి అని అర్థము. "త్రిజన్మపాపసంమారం ఏకబిల్వం శివార్పణమ్" ఎప్పుడైతే మీ మూడు గుణాలను శివునికి అర్పిస్తున్నారో అప్పుడు మీ మూడు జన్మల పాపం నశిస్తుంది అని అర్థం. బిల్వదళాలను శివునికి అర్పిస్తే మన పాపాలు పోవు. మనలో ఉన్న ఈ తమోగుణం, రజోగుణం, సాత్వికగుణం ఈ గుణాలను ఎప్పుడైతే అర్పిస్తామో అప్పుడు మాత్రమే మనలో ఉన్న పాపాలు నశిస్తాయి.

# 5. పాము కథ

ప్రశ్న : **స్వామీజీ ఒకసారి మీరు ధ్యానంలో కూర్చుంటే ఉదయం 7 గంటలకు ఒక పాము మీ వద్దకు వచ్చి గంటసేపు మీ వైపే చూస్తూ పడగ విప్పి ఉన్నది అని దానికి మీరు ఏదో చెప్పారు. అని వెంకట నరసయ్య మాకు చెప్పారు. అది నిజమేనా స్వామీ? మీరు చెప్పిన భాషా పాముకి అర్థమౌతుందా స్వామి?**

**జవాబు** : మిత్రమా! మనస్సు విశాలంగా ఉంటే ఏ భాషయైనా అర్తమవుతుంది. ఒక్కసారి స్వామి, రమా రిషికేష్ కొండ ప్రాంతంలో వెళ్ళినప్పుడు తేనె తీగ గుంపు ఉంటుంది. స్వామి రామతో చాలామంది శిష్యులు భయపడుతూ ఇక్కడ చాలా తేనెటీగలు ఉన్నాయి. అప్పుడు స్వామి రామ శిష్యులతో ఇలా అన్నారు. మీరు భయపడకండి. నేను వెళ్ళి ఒక మంత్రము చెప్పి వస్తాను. ఇంకా మన వద్దకు రావు అన్నారు. అప్పుడు స్వామి రాము తేనెపట్టు దగ్గరకు వెళ్లి ఒక మాట చెప్పి వస్తారు. అప్పుడు శిష్యులు స్వామి రామాను మీరు ఏమి చెప్పి వచ్చారు అని అంటారు స్వామి రామ. తేనెటీగలతో మీరు మమ్మల్ని ఏమీ అనవద్దు, మేము మిమ్మల్ని ఏమీ అనము అని చెప్పాను. భావన అర్థమైతే చాలు భాషతో పనిలేదు అని అంటాను.

అలాగే శ్రీరామ్ శర్మ గారి జీవిత చరిత్ర చదివాను తను ఇంట్లో ఉండేటప్పుడు పైన ఏవో శబ్దాలు వచ్చేవి అని అప్పుడు శ్రీరామ్ శర్మగారు పైకి వెళ్లి ఇక్కడ మీరు ఎవరు ఉన్నారో తెలియదు. కానీ మీకు ఎటువంటి ఇబ్బంది కల్గించను. మీరు కూడా నాకు ఎటువంటి ఇబ్బంది కల్గించవద్దు అని తలుపువేసి వస్తారు. ఆ రోజు నుండి శబ్దం ఆగిపోయింది. దానిని భావన అర్థం చేసుకోవడం అని అంటాము. అన్నింటిలో ఉండేది పరమాత్మ స్వరూపమే. దేహాలు వేరు కావచ్చు ప్రాణం ఒక్కటే. అలాగే ఒక రోజు ధ్యానంలో కూర్చున్నప్పుడు ఒక పాము వచ్చింది దానిని నేను చూసినప్పుడు దాని భావన నాకు అర్థమైంది. మీరు మానవులు స్వేచ్ఛగా జీవించగలుగుతున్నారు. ఇంతా స్వేచ్ఛగా ఉండి కూడా మీకు ఈర్ష్య,

ద్వేషాలు, పగలు, పట్టింపులు ఉంటాయి. స్వార్థంతో బ్రతుకుతున్నారు. అన్ని విధాలుగా ఆలోచించే శక్తి ఉన్నా కూడా మీరు మాయకు బానిస అయిపోతున్నారు. 84 లక్షల జీవరాశులలో మానవుడు ఒక్కటే ముక్తి పొందే అవకాశం ఉంది అంటారు అలాంటి మానవ జన్మను వృథా చేస్తున్నారు చాలామంది మీరైనా చెప్పవచ్చు కదా అని తన భావన అర్థమైంది. అలాగే మేము బ్రతకడం కోసం శరీరాన్ని దాచి పెట్టుకోవాల్సి వస్తుంది. చిన్న చిన్న సందుల్లో, చిన్న చిన్న బండరాయిల క్రింద, చిన్న పుట్టలో ఎవరికి కనిపించకుండా భయపడుతూ బ్రతకాలి ఇది మా జీవితం. మీకు అలాంటి భయము లేదు కదా మీరు స్వేచ్ఛాపరులు. మీరైనా సాధన చేసి ముక్తి పొందవచ్చు కదా అనే భవన నాకు అర్థమైంది. అప్పుడు నేను పాముతో చెప్పాను గత జన్మలో చేసిన పాపపుణ్యాలు ఈ జన్మలో పగ్గాలు అయ్యి అంటే అవి త్రాడులా ఆ పాపాల వైపు లాగుతాయి. పుణ్యాలు చేసి ఉంటే అవి త్రాడులా పుణ్యంవైపు లాగుతాయి. కానీ గత జన్మ సంస్కారం ఎలా ఉందో తెలియదు కదా! ఎవరి సంస్కారం బట్టి వాళ్ళ జీవితం ఉంటుంది దానికి మనము ఏమి చెయ్యలేము. ప్రయత్నించడం జ్ఞానిగా నా బాధ్యత, కాబట్టి ప్రయత్నం చేస్తాను అని చెప్పాను. అప్పుడు ఆ పాము వెనుతిరిగి నిదానంగా, నెమ్మదిగా వెళ్లిపోయింది. అలాగే ఆ తరువాత నేను ఆలోచించాను ఇదంతా సృష్టి మాయ, కానీ మానవుడు మారడు కానీ మానవుడు తన నిజస్వరూపాన్ని తెలుసుకోలేకపోతున్నారు. కాబట్టి దానివల్ల మానవుడే జనన-మరణ చక్రంలో ఇరుక్కుపోతున్నారు. కాబట్టి వీలైనంత మంది ఆత్మసాక్షాత్కారం పొందాలి. ఏదో ఒక భక్తి మార్గంలో వచ్చి ఈ జన్మలో విత్తనాలు వేసుకుంటే మళ్ళీ వచ్చే జన్మలో మొలకలు వస్తాయి. కాబట్టి అందరూ సాధన చేస్తే బాగుంటుంది అని అంటాను.

ప్రశ్న : **స్వామీజీ జ్ఞాని ఎలా ఉంటారు? జ్ఞానిని గుర్తించడం ఎలా?**

**జవాబు** : మిత్రమా! నిజమైన జ్ఞాని ప్రచారం కోరుకోరు. ఎందుకంటే ఈ దేహమే శాశ్వతం కాదని తెలుసు, మరి ఈ దేహానికి పెట్టిన పేరు కోసం ఎందుకు తపన పడుతాడు. తను ఆత్మసాక్షాత్కారం పొందిన తరువాత తన ఆనందం

ముందు, ఇదంతా చాలా చిన్నది. ఎంత పెద్దవారు అయినా చనిపోవాల్సిందే. కాబట్టి వీటన్నింటి ముందు ఆత్మానందం చాలా గొప్పది. కాబట్టి వాళ్ళందరూ ఉదాసీనంగా ఉంటారు. షిర్డీసాయిబాబా, రమణ మహర్షి, రాకాడీ బాబా, మాతా ఆనందమయి (హరిద్వార్) వీళ్ళ జీవిత చరిత్రను ఒకసారి పరిశీలించండి, వీళ్లు జీవించి ఉన్నంత వరకు వీళ్ళ గురించి ఎకువగా తెలియదు. వీరు దేహాలు వదిలేసినా తర్వాత ఈ రోజు వాళ్ళందరికి ఉన్నతమైన పూజలు జరుగుతున్నాయి. కాబట్టి జ్ఞాని అనేవాళ్ళు వేషధారణ అనేది ఏమీ ఉండదు. వాళ్ళ దగ్గర నిజమైన జ్ఞానతత్వం ఉంటుంది.

ప్రశ్న : **సాధకుడికి భయము ఉండకూడదు అని అంటారు. అది ఏవిధమైన భయము స్వామీజీ?**

**జవాబు** : భయము అనేది మూడు రకాలుగా ఉంటుంది. మొదటిది అడవిలో ఉన్నప్పుడు జంతువులతో గాని, పక్షులతో గాని భయము ఒకటి. రెండవది శాస్త్రంతో భయము ఉంటుంది. నేను ఏమైనా అక్షరాలు తప్పు పలికానేమో, ఏదైనా శాస్త్రానికి చెందిన పుస్తకం చెయ్యి జారి క్రింద పడితే అయ్యో క్రింద పడిపోయింది. నాకు ఏమైనా పాపం కలుగుతుందేమో అని ఇదే ఆధ్యాత్మిక భయం అంటారు. నేను మంత్రం తప్పు చెప్పాను. నేను ఈ రోజు పూజా చెయ్యలేదు. దేవుడు ఏమైనా అనుకుంటారు. దీనినే ఆధ్యాత్మిక భయం దీనిలో శాస్త్రానికి సంబంధించి కావచ్చు, గురువుకు సంబంధించి కావచ్చు. మూడవ రకమైన భయాన్ని గురించి చెబుతాను వినండి. ముందు నీలో నుంచి గతాన్ని త్రోసెయ్యాలి భయపడకుండా నిన్ను నీవు వదిలేసుకోవాలి. అంటే పరమాత్ముడికి నిన్ను నీవు అర్పించుకోవాలి. ఊరికే ఆగిపో వెతకడం ఆపాలి. ఏ ఉపనిషత్తులు, ఏ వేదాలు ఉండకూడదు, ఏకాకివై నిలవగలిగే ధైర్యం నీలో ఉండాలి. ఒక మహావీర్ కావచ్చు, ఒక బుద్ధుడు కావచ్చు, ఒక గురునానక్ కావచ్చు, ఆదిశంకరులు, రమణ మహర్షి, యోగి వేమన వీళ్ళు అందరు ఏ విధంగా అన్ని వదిలేసి తను ఏకాకిగా నిలబడి తాను ఒక సంస్థగా మారారు అలా ఉండగలిగే ధైర్యం నీలో ఉండాలి. ఈ మూడింటికి నువ్వు సిద్ధంగా ఉంటే నువ్వు అర్హుడికి అలా జీవించడమే సాధకుడిని జీవితం.

ప్రశ్న : **స్వామీజీ ఆశ, ఆశనే జీవితమని, అది జీవితాన్ని నడిపిస్తుంది అని అంటారు మీరు? అది ఎలా?**

జవాబు : మిత్రమా! ఆశనే నిన్ను కొనసాగిస్తుంది. ఆశ అనేది లేకపోతే నీకు జీవితం అనేది లేదు. దేని గురించి ఆశించకుండా నీ జీవితాన్ని ముందుకు తీసుకువెళతావా, సుఖానికే నువ్వు అన్వేషిస్తున్నావు. దుఃఖంలో నువ్వు కొనసాగిస్తున్నావు కాబట్టి మీరు అందని సుఖం గురించి ఆశపడుతూ, దుఃఖంలోనే జీవితాన్ని కొనసాగిస్తున్నారు. ముగిస్తున్నారు. కూడా.

ప్రశ్న : **స్వామీజీ నేను ఎన్నో గ్రంథాలు చదివాను, ఎన్నో యాత్రలు తిరిగాను, ఎన్నో ఆశ్రమాలు తిరిగాను కానీ నాకు తృప్తి అనేది కలగలేదు. ఎందువలన?**

జవాబు : మిత్రమా! మీరు వెతుకుతున్నారు కనుకనే మిమ్మల్ని మీరు పోగొట్టుకుంటున్నారు. అందుకే నేను చెబుతాను బయట వెతకడం ఆపివెయ్యండి. మీ లోపల వెతకడం మొదలు పెట్టండి. తృప్తి, శాంతి కాదు సర్వం లభిస్తాయి.

ప్రశ్న : **మిథ్య అంటే ఏమిటి?**

జవాబు : అసలు మనిషి ఒక మిథ్య. ఆ మధ్య మనస్సు కనిపెట్టింది. ప్రతిది మిధ్యే. కంటికి కనిపించేది మిధ్యే, కంటితో చూసేది, మనసుతో ఆలోచించేది మిధ్యే. అందుకే చెబతారు కంటికి కనిపించే దృశ్యం మానివేసి కండ్లు మూసుకొని త్రినేత్రంతో చూడు అప్పుడు నీకు నిజం కనిపిస్తుంది. అది మిధ్య కాదు, ఇంద్రియములకు కనిపించేది మిధ్య. ఇంద్రియాలను నడిపించేది మనస్సు కూడా మిధ్య.

ప్రశ్న : **వివేకం అంటే ఏమిటి?**

జవాబు : ప్రశ్నించడం వివేకానికి గీటురాయి అని అనుకుంటారు అందరూ కానీ కాదు. ప్రశ్నించడం ఆగిపోయినప్పుడే వివేకం వికసిస్తుంది. ఎప్పుడు వరకు నీ మనస్సులో ప్రశ్న ఉంటుందో అది తర్కానికి సంబంధించింది. జ్ఞానానికి సంబంధించింది. కాదు ఎప్పుడైతే నీలో మౌనం శూన్యం అవుతుందో అప్పుడు జ్ఞానానికి సంబంధించి అవుతుంది. కాబట్టి ప్రశ్నించడం ఆగిపోతే మీరే వివేకం.

ప్రశ్న : **మానవుడు ఏ సమస్య లేకుండా జీవించాలంటే ఏమి చెయ్యాలి?**

**జవాబు** : మిత్రమా! మీకు ఏ విషయం లేకపోతే మీకు మీరే ఒక సమస్యను సృష్టించుకుంటారు. సమస్య లేకపోతే మీకు జీవితం లేదు అని అనిపిస్తుంది. మీకు సమస్య లేకపోతే ప్రక్కవారి సమస్యలో తల దూరుస్తారు. మీరు సమస్యను స ృష్టించుకుంటారు.

ప్రశ్న : **మానవ జన్మకి తృప్తి అనేది అసలు ఉన్నదా? అసలు ఉంటే ఎలా ఉంటుంది? అది చెప్పగలరా స్వామీజీ?**

**జవాబు** : మిత్రమా! నీకు ఒక కథ చెబుతాను విను, ఒక శిష్యుడు ఒక గురువు వద్దకు వెళ్లి అయ్యా నాకు పరిపూర్ణమైన తృప్తికావాలి నేను ఏమి చెయ్యాలో చెప్పండి అని అడిగారు. అప్పుడు గురువు అక్కడ ఒక పాత్ర లాంటిది ఉండి అది మానవుడి కపాలంతో తయారైనది అంటే మానవుడు చనిపోయిన తరువాత ఆ కపాలంతో నేనుఈ పాత్రను తయారుచేసాను. నీవు వెళ్లి ఈ పాత్ర నిండా ధనం తీసుకుని రా! అంటే భిక్ష అని అర్థం. ఏ భిక్షయైనా తీసుకుని రా! అని చెప్పి గురువు శిష్యుణ్ణి పంపించారు. ఆ శిష్యుడు ఒక పెద్ద రాజు వద్దకు వెళ్ళారు, వెళ్ళి అయ్యా! భవతి భిక్షాందేహి అని అడిగారు. రాజుగారు నీకు ఏమి కావాలి అని అడిగారు. అప్పుడు శిష్యుడు ఈ భిక్షా పాత్ర నిండా భిక్ష వేయండి అని అడిగారు. అది చూసిన రాజు అంత చిన్నగా ఉంది నీ భిక్ష పాత్ర, దాని నిండా నువ్వు ధాన్యము అడుగుతున్నావు. ధాన్యము కాదు వజ్రాలతో, బంగారు ఆభరణాలతో నింపుతాను సరేనా, ఆ భిక్షకు వచ్చిన అతను చాలా సంతోషపడి సరే అయ్యా అని అంటారు. అక్కడ ఉన్న రాణిని పిలిచి ఈ భిక్ష పాత్ర నిండా వజ్రాలతో నింపి పంపించండి అని అంటారు. ఆ భిక్ష పాత్రలో రాణి వజ్రాలు వేస్తూనే ఉంటుంది. వేస్తూనే ఉంటుంది. వజ్రాలు వేసారు, బంగారం వేశారు, ధాన్యము వేశారు అన్ని వేసినా తరువాత రాజు అడుగుతాడు. నీ భిక్ష పాత్ర నిండటం లేదు. ఈ భిక్ష పాత్ర దేనితో తయారు చేసారు అయ్యా! అప్పుడు భిక్షకు వచ్చిన అతను మానవుడి కపాలంతో తయారు చేసారు అని చెబుతారు. రాజు ఈ మాటలు విని

నీకు ఏమైనా బుద్ధి ఉందా! ఇప్పటికి నేను పదిదేశాలు జయించాను, పది మంది రాణులను పెళ్ళి చేసుకున్నాను. నాకు తెలియని విద్య లేదు, నాకు రాని భాష లేదు. అయినా ఇన్ని ఉన్నా నాకే తృప్తి లేదు, మానవుడి మానవ జన్మకు తృప్తి లేదు. అని చెప్పి తిట్టి పంపిస్తారు. ఆ కపాలం తీసుకుని శిష్యుడు గురువు వద్దకు వస్తారు. వచ్చిన తరువాత గురువు ఆ పాత్రను చూసి ఏమయ్యా పాత్ర నిండా ధనము తీసుకురాలేదా అని అడుగుతాడు. శిష్యుడు సమాధానం చెబుతారు గురుదేవా మానవ జన్మకి తృప్తి లేదు అని నేను తెలుసుకున్నాను. ఎందుకంటే మోక్ష సాధన కోసం సాధన చేసే శిష్యుడు కూడా మోక్షాన్ని ఆశించే సాధన చేస్తున్నారు. కాబట్టి ఏ కోరికలు లేకపోవడం అనేది లేదు. అందుకే బుద్ధుడు చెప్పారు కోరికలే మీకు ప్రమాదం అని.

ప్రశ్న : **కృష్ణమూర్తి గారు ఒక మాట రాసారు, ఒక గంటసేపు దేవుడు గుడిలో మంత్రజపము చేసిన ఒక గంటసేపు మద్యం షాపులో కూర్చుని ముందు త్రాగిన సమానం అని చెప్పారు. ఆ ప్రశ్న ఏమిటో అర్థం కాలేదు. మాకు వివరించగలరా స్వామీజీ?**

జవాబు : నేస్తమా! కృష్ణమూర్తి చెప్పింది నిజమే. మీరు 100 రూ.లు ఖర్చు పెట్టి పూలు, అగరబత్తీలు, కొబ్బరికాయ తీసుకుని పూజ, గదిలో కూర్చుంటారు. మీ బాధను చెప్పుకోవడం ప్రారంభం చేస్తారు. అవునా! చెప్పుకొని ఒక గంట సేపు తర్వాత బయటకు వస్తారు. యథావిధిగా జీవితం కొనసాగిస్తారు. అలాగే బాధలో ఉన్న వ్యక్తి బార్ షాప్ కి వెళ్ళి 100 రూ.లు ఇచ్చి మద్యం త్రాగి యథావిధిగా ఇంటికి వస్తారు. ఇది కృష్ణమూర్తి గారు గ్రహించారు. నేను చెప్పేది ఏమిటి అంటే నిజంగా మీరు పూజ మందిరంలోకి వెళ్ళాలి అంటే కబీర్ దాస్ లాగా వెళ్ళండి. భక్త కన్నప్పలా వెళ్ళండి, మీరాబాయిలా వెళ్ళండి, అప్పుడు మీకు కృష్ణమూర్తి గారు చెప్పండి వెయ్యిరెట్లు ముందు ఉంటారు. తాత్కాలికమైన బాధకోసమో, తాత్కాలికమైన తృప్తికోసమో మీరు పూజామందిరంలోకి

వెళ్లకండి, శాశ్వతమైన పరిష్కారం కోసం, శాశ్వతమైన నమ్మకం కొద్దీ మీరు పూజ మందిరంలోకి వెళ్ళండి. అప్పుడు ఆ పూజ మందిరం మీకు స్వర్గం అవుతుంది. మీరాబాయి పూజ మందిరంలోకి వెళ్ళండి ఏ భావనతో వెళ్ళండి, ఎంత ప్రేమతో వెళ్ళండి ఆ రకమైన భక్తి అయితే అది భగవంతుడిని చేరుస్తుంది. రామక ృష్ణ పరమహంస పూజ గదిలో కూర్చునేవారు అలా అని చెప్పి బార్ లో కూర్చునే వారు ఒకటే అవుతారా? కాదు. రామక ృష్ణ పరమహంస కాళీమాత పాదాల దగ్గర అంకితం అయ్యారు. తను లేనిదే నేను లేను అనుకున్నారు, నేను లేనిదే తను లేదు అనుకున్నారు. అందుకే తాత్కాలికమైన రిలాక్స్ పొందుతున్నారు. కాబట్టి కృష్ణమూర్తి గారు అలా చెప్పి ఉండవచ్చు, శాశ్వతమైన పరిష్కారం కోసమైతే మీరు మీరాబాయిలా, కబీర్ దాలా, గురునానక్ లా పూజా మందిరంలోకి వెళ్ళండి.

ప్రశ్న : **అయ్యా! వర్తమానంలో జీవించండి అని ఎప్పుడూ నాతో చెబుతూ ఉంటారు. వర్తమానం జంచడం అంటే ఏమిటి?**

జవాబు : మీరు జీవించడం మొదలు పెట్టండి. ఎలా అంటారా? మీరు అన్నం తింటున్నారు అనుకోండి, మీ మనస్సు అన్నంపైన పెట్టండి. మీరు నడుస్తున్నారు అనుకోండి మీ ఆలోచన శక్తిని నడకపైన పెట్టండి. అంతేగానీ మీరు రోడ్డు మీద నడిచేటప్పుడు రామ రామ, కృష్ణ కృష్ణా అనుకుంటూ మీ మనస్సు ఎక్కడో పెట్టి నడవటం కాదు. అది పరధ్యానం అవుతుంది, పరధ్యాస వేరు, పరమాత్మ ధ్యాస వేరు. జీవిత ధ్యాస పెట్టండి అని అంటున్నారు. జీవితం మీద ధ్యానం పెట్టండి అంటున్నారు. పరధ్యానంలో జీవించడం మానేయండి అని అంటున్నారు. భోజనం చేసే సమయంలో మీరు భోజనమే చెయ్యండి నడిచే సమయంలో మీరు నడవండి, మాట్లాడే సమయంలో మాట్లాడి, పడుకునే సమయంలో మీరు పడుకోండి మీ సమస్సు మీతో ఉండేలా చూడండి, అలా చూడటమే వర్తమానంలో జీవించడం.

**ప్రశ్న : స్వామీజీ మీరు ఒక మినిష్టర్ గారు భోజనానికి పిలిస్తే బైక్ మీద సింపుల్ గా వెళ్ళారు అని విన్నాను. ఎందుకు అలా వెళ్ళారు స్వామి?**

**జవాబు :** మిత్రమా! నేను ఒక ప్రశ్నలో చెప్పాను, మీరు మీరుగా జీవించండి అని ఎప్పుడైతే మీరు మీరుగా జీవిస్తారో బాధలు లేవు. మీరు ఎంత ఆర్థికంగా ఉన్నారో ప్రపంచానికి తెలుసు. ఏదో ఆర్థికంగా ఉన్నట్టుగా బురా? వేసుకుని వెళ్ళటం లేదు. నేను జీవించడం కాదు. నాతో పాటు ఉండేవాళ్ళకి చెప్పేది అదే మీ దగ్గర కార ఉంది అనుకోండి. కారులో వెళ్ళండి, బైక్ ఉంటే బైక్ లో వెళ్ళండి, మీరు మీరుగా జీవిస్తే సమస్యలు రావు. కాబట్టి నేను నేనుగా జీవించడానికి ఇష్టపడతాను. నా దగ్గర ఉన్నది బైక్ కాబట్టి నన్ను భోజనానికి పిలిచినవాళ్ళు నా వ్యక్తిత్వాన్ని గౌరవించి పిలిచారు తప్ప నా ఆర్థిక స్తోమతను చూసి కాదు. వ్యక్తిని ప్రేమించారు, ఆర్థిక స్తోమతను కాదు కాబట్టి నేను బైక్ మీద వెళ్ళాను. అంతర్గతంగా, బహిర్గతంగా అంటే మీరు బయట జీవించే విధానం అలాగే మీరు భక్తి మార్గంలో కూడా మీరు మీరుగా జీవించండి. అంటే మీకు తెలిసినవాళ్ళని తెలిసిన విధంగా జీవించండి, లేనిపోని రంగులు పూసుకొని జీవించడం తప్ప సుఖము లేదు మిత్రమా.

# 6. బాబా భక్తులకు సందేశము

ప్రశ్న : **స్వామీజీ మీరు గాయత్రి ఉపాసకులు, కానీ మీకు ఉన్న భక్తులు మొత్తం బాబా భక్తులే బాబాకి, గాయత్రీదేవికి ఏమైనా సంబంధం ఉందా?**

**జవాబు** : మిత్రమా! గాయత్రి మంత్రానికి, బాబాకు దగ్గర సంబంధం ఉండి, సంబంధం ఉండడం కాదు మంత్రం వేరు, బాబా వేరు కాదు వాళ్లు ఇద్దరు ఒక్కటే. అసలు అవధూత సంప్రదాయం ఎలా వచ్చింది. మీరు గ్రహించినట్లైతే అవధూత సంప్రదాయానికి మూలపురుషుడు అత్రి మహర్షి. అత్రి మహర్షి చాలా గొప్ప ఋషి. పంచ ఋషులలో ఒక మహా ఋషి, నవబ్రహ్మలలో ఒక బ్రహ్మ, సప్తఋషులలో ఒక ఋషి. అత్రి మహర్షి భార్య అనసూర్య దేవి సాక్షాత్తూ అమ్మవారు వంశం, అయితే అత్రిమహర్షి తపస్సులో కూర్చున్నప్పుడు అత్రిమహర్షికి కలియుగం ఎలా ఉంటుంది. అని ఆలోచించినప్పుడు అత్రిమహర్షి ధ్యానంలో ఒక సంఘటన కనిపించింది. గౌతమ మహర్షి ఈ కలియుగంలో గాయత్రి మంత్రం దూరం అవ్వ గాక అని, బ్రాహ్మణులు కూడా సంధ్యావందనం మానేస్తారు అని శపన పెట్టారు. ఆ శపన గ్రహించి అత్రి మహర్షి అయ్యో కలియుగానికి గాయత్రి మంత్రం దూరం అవుతుందా, సంధ్యావందనం మానేస్తారా అసలే కలియుగం గాయత్రి మంత్రం దూరం అయితే ఎలా అని తను చింతిస్తూ గాయత్రి మంత్రానికి సరిపడే మంత్రాన్ని ఏదైనా ఇవ్వాలి అని అత్రి ఆలోచిస్తూ ఉంటారు. అత్రి మహర్షి ఆలోచన గ్రహించిన నారద మహర్షి ఈ ఒక శుభకార్యక్రమానికి తను కూడా పాత్రుణ్ణి కావాలి అని ఆలోచించి ఇనుప గుగ్గిళ్లు తీసుకుని పార్వతీదేవి వద్దకు వెళతారు. అమ్మా నాకు కొంచెం ఈ ఇనుప గుగ్గిళ్ళను ఉడకబెట్టి ఇవ్వండి అని అంటారు. అది ఏమిటి ఇనుప గుగ్గిళ్ళు ఉడక పెట్టి ఇవ్వడం అని అమ్మవారు ఒకసారి కళ్ళు మూసుకొని చూస్తుంది. అప్పుడు నారద మహర్షి ఆలోచన, అత్రి మహర్షి తపన గ్రహించిన ఆదిపరాశక్తి నేను ఉడక పెట్టలేను నాయనా అని అంటుంది. సృష్టి కర్త ఆదిపరాశక్తి తను ఉడకపెట్టకపోవడం ఏమిటి అంటే ఇదంతా నాటకం. ఇది ఒక ఆట, అలానే లక్ష్మి వద్దకు, సరస్వతి వద్దకు వీళ్ళు వెళతారు. వీళ్లు కూడా

మేము ఉడకపెట్టలేము అని అంటారు. అప్పుడు ఆ ఇనుప గుగ్గిళ్ళను తీసుకొని మాత అనసూయ వద్దకు వెళతారు. నారద మహర్షి మాతా ఈ ఇనుప గుళ్ళను ఉడకపెట్టండి అని అడుగుతారు. అప్పుడు మాతా అనసూయ అది ఎంతలో పని నేను ఉడకపెట్టి ఇస్తాను అని ఇనుప గుగ్గిళ్ళను తీసుకుంటుంది. మాతా అనసూయ ఇనుప గుగ్గిళ్ళను ఉ డకబెట్టి నారద మహర్షికి ఇచ్చింది. నారద మహర్షి వాటిని తీసుకుని ఇనుప గుగ్గిళ్ళను తినిన తర్వాత పార్వతీదేవి వద్దకు వెళ్ళి ఏ అమ్మా మీరు త్రిమూర్తులకు భార్యలు అయి ఉండి ఇనుప గుగ్గిళ్ళు మీరు ఉ డకబెట్టలేదు, మహా పతివ్రత అనసూయ మాత ఉడకబెట్టింది. అని నారదమహర్షి ఎగతాళిగా చెబుతారు. అది విన్న లక్ష్మీదేవి, పార్వతీదేవి, సరస్వతీ దేవి అలుగుతారు. ఆ అలకకు కారణాన్ని గ్రహించిన త్రిమూర్తులు మాత అనసూయను ఇలా చేసింది అని తెలిసి మాతా అనసూయ అవమాన పరచాలి అని త్రిమూర్తులు అత్రి మహర్షి ఆశ్రమానికి వెళతారు. వెళ్ళి మాత భిక్షం దేహి అని భిక్ష పాత్ర పడతారు. అప్పుడు మాత అనసూయ అన్నం తీసుకుని వస్తుంది. ఈ విధంగా త్రిమూర్తులు అంటారు. మాతా మాకు కావాల్సింది అన్నం ఈ విధంగా దానం చేయకూడదు. ఒంటి మీద వస్త్రం లేకుండా దానం చెయ్యాలి అని త్రిమూర్తులు అంటారు. అనసూయ మాతకు చాలా కోపం వస్తుంది. అసలు వచ్చింది ఎవరు అని కళ్ళు మూసుకొని చూసింది. అప్పుడు త్రిమూర్తులు వచ్చారు అని గ్రహించి మాత అనసూయ అత్రి మహర్షిని తలచుకొని తన కమండలంలో ఉన్న నీళ్ళు త్రిమూర్తులపై చల్లుతుంది. అత్రిమహర్షి శక్తి, మాత అనసూయ పతివ్రత అంతకు మించి అత్రిమహర్షి చేసే సంకల్పం, కలియుగానికి నేను ఏమైనా ఇవ్వాలి అనే సంకల్పం ఆ మూడు కలిసి ఈ ముగ్గురు పసిపిల్లలు అవుతారు. అప్పుడు అనసూయ దేవి ముగ్గురిని ఎత్తుకొని అన్నం తినిపిస్తుంది. ఇలా కొంతకాలం గడిచిన తర్వాత పార్వతీ దేవి, లక్ష్మీ దేవి, సరస్వతీ దేవి వచ్చి మా భర్తలను నువ్వు చిన్న పిల్లలుగా ఎందుకు చేసావు అని వాళ్ళు మాత అనసూయ వద్దకు వచ్చి మాకు పతి భిక్ష పెట్టు అని వేడుకుంటారు. అప్పుడు మాత

అనసూయ చిన్న పిల్లల నుండి త్రిమూర్తులుగా చేసి వాళ్ళకి అప్పగిస్తుంది. ఇచ్చిన తర్వాత త్రిమూర్తులు భార్యలు వెళిపోతూ ఉంటారు. అప్పుడు మాత అనసూయ నాయలారా! ఇన్ని రోజులు మిమ్మల్ని ఎత్తుకొని లాలించి, ఆడించాను ఇలా వెళ్ళిపోతే నేను ఎలా ఉండగలను అని చింతించి ఎలా నాయన అని అంటుంది. అప్పుడు త్రిమూర్తులు మేము ముగ్గురం నీ గర్భాన జన్మిస్తాము అని వరము ఇచ్చి వెళ్ళిపోతారు.

మాత అనసూయకు శివుడు అంశంతో చంద్రుడు పుడతాడు, బ్రహ్మ అంశంతో దుర్వాస మహర్షి పుడతాడు, విష్ణు అంశంతో దత్తాత్రేయుడు పుడతాడు. ఈ ముగ్గురు పుట్టిన తర్వాత అత్రి మహర్షి ఒకరోజు యజ్ఞ కుండము దగ్గర కూర్చొని చింతిస్తూ ఉంటారు. అప్పుడు దత్తాత్రేయుడు ఇలా అంటారు. మహర్షి గారు మీరు ఎందుకు ఇలా చింతిస్తూ ఉ న్నారు. నాయనా! నా చింతకు గల కారణం కలియుగం పరిస్థితి ఏమిటి అని ఆలోచిస్తున్నాను. మీరు ఏమీ చింతించకండి. త్రిమూర్తుల శక్తి కలియకతో నేను జన్మించాను నేను దత్తపరంపర అందిస్తాను. అది అవధూత సాంప్రదాయ అందుకే నాకు 24 మంది గురువులు ఉంటారు. నేను 24 అవతారాలు ఎత్తుతాను. గాయత్రి మంత్రం 24 అక్షరాలు కాబట్టి ప్రతి ఊరిలో, ప్రతి వీధిలో, ప్రతి సందులో అతి సామాన్యుడికి అందుబాటులో ఉండే విధంగా నేను నా దత్త సంప్రదాయాన్ని తీసుకు వెళతాను. అవధూతలుగా జన్మిస్తూ ఉంటారు. నా వంశంలో అవధూతలు జన్మిస్తూనే ఉంటారు. అవధూతను దర్శనం చేసుకుంటే గాయత్రి జపం చేసిన దానితో సమానం. ఆ శక్తి నేను అందిస్తాను కాబట్టి మీ లాంటి యోగులు చింతించకూడదు అని దత్తుడు అత్రి మహర్షికి చెబుతారు. కాబట్టి గాయత్రి ప్రతిరూపమే ఈ అవధూతలు, దత్తుడు, శ్రీపాదవల్లభుడు, నరసింహస్వామి, స్వామి సమర్ధ వీళ్ళు అంతా దత్త సంప్రదాయం నుంచి వచ్చినవారు. ఈ దత్త సంప్రదాయం నుండి వచ్చిన వాళ్ళు అంతా గాయత్రి మంత్రానికి ప్రతిరూపం అని దత్తాత్రేయుడు చెప్పారు కాబట్టి బాబా వేరు, గాయత్రి వేరు కాదు అందుకే పుట్టపర్తి సాయిబాబా గాయత్రి మంత్రం గురించి చెబుతూ ఉంటారు.

# 7. శక్తి కేంద్రాలు

## ఏడు శక్తి కేంద్రాలకు, ఏడు శరీరాలు ఉంటాయి

ఆ శరీరాలు ఏమిటి అంటే మొదటిది స్థూల శరీరం, మనకు కనిపిస్తుంది. మాట్లాడుతుంది అది స్థూల శరీరంతోనే, రెండవది భావన శరీరం అంటే మనస్సుని అనుకోవచ్చు. మనం ఇక్కడ ఉంటే మన మనస్సు ఎక్కడో ఉంటుంది, దీనికి కోపం, అహంకారం, ద్వేషం, స్వార్థం ఎక్కువగా ఉంటాయి. మూడవది సూక్ష్మ శరీరం దీనిని ఇంగ్లీషులో ఆస్టల్ బాడీ అని కూడా అంటారు. ఈ సూక్ష్మశరీరం మీరు పడుకున్నప్పుడు నిద్రలో అంటే స్వప్నంలో వచ్చినప్పుడు స్వప్నంలో మీరు ఎక్కడికో వెళ్ళినట్లు, ఎవరితోనో మాట్లాడుతున్నట్లు కనిపించేది సూక్ష్మశరీరం, నాల్గవది కారణశరీరం ఈ శరీరం అందరికీ తెలుసు కానీ తెలియనట్టు అనిపిస్తుంది. కారణ శరీరం ఎప్పుడెప్పుడు కనిపిస్తుంది అంటే మానవుడు కొన్ని సందర్భాల్లో ఏదైనా ప్రమాదం గాని, యాక్సిడెంటు గాని అలాంటి సమయంలో చెబుతూ ఉంటారు. ఆ సమయంలో నన్ను వెనక నుంచి ఎవరో లాగుతున్నట్లు అయ్యింది లేకపోతే నేను చనిపోయేవాడిని అని అంటూ ఉంటారు. ఆ లాగింది ఎవరో కాదు కారణ శరీరం. ఈ కారణ శరీరం చాలా శక్తివంతమైనది. ఒక వ్యక్తి మద్యం తాగి ఎక్కడో పడిపోతాడు. కానీ తనకు తెలియకుండానే అతను తన ఇంటికి వెళతారు. మరుసటి రోజు లేచి నేను ఇంటికి ఎలా వచ్చాను, నన్ను ఎవరు తీసుకు వచ్చారు అని అనుకుంటాడు. తనను తీసుకువచ్చింది కారణశరీరం. ఈ కారణ శరీరం ఎప్పుడూ కాపాడుతూ ఉంటుంది. ఈ కారణ శరీరానికి శక్తి ఎక్కువగా ఉంటుంది.

కొందరికి దేవుళ్ళు రావడం, మరికొందరికి ముందు తెలిసిపోవడం, మరికొందరు అద్భుతాలు చేస్తూ ఉంటారు. వాళ్ళకు కారణ శరీరం ప్రభావం ఎక్కువగా ఉంటుంది. కాబట్టి వాళ్ళు చేస్తూ ఉంటారు. ఒక మానవుడు మనస్ఫూర్తిగా సంకల్పం చేసి వేరే దేశంలో ఉన్న వ్యక్తి ఇంకొక దేశంలో ఉన్న వ్యక్తిని పరిపూర్ణంగా గాఢంగా సంకల్పం చేసినట్లయితే వారికి కూడా వీరికి గుర్తుకు వస్తారు. దాన్ని ఇప్పుడు టెలోపతి అని అంటారు. ఒకే సమయంలో ఇద్దరు కలిసి ఫోన్ చేసుకుంటే దాన్ని టెలోపతి అంటారు. కానీ అది కారణ శరీరం ప్రభావం. కాబట్టి కారణ శరీరమునకు శక్తి

ఎక్కువగా ఉంటుంది. ఐదవ శరీరం ఆధ్యాత్మిక శరీరం. ఈ ఆధ్యాత్మిక శరీరానికి చాలా శక్తి ఉంటుంది. అష్ట సిద్ధులు, దశమహాసిద్ధులు అని వినే ఉంటారు. ఈ సిద్ధులు ఆధ్యాత్మిక శరీరం వల్ల సిద్ధిస్తాయి. సాధకులు ఈ సిద్ధుల దగ్గర ఆగిపోతూ ఉంటారు. అష్టమ సిద్ధులు, దశమహాసిద్ధులు లభించేవి ఈ ఐదవ శరీరంలోనే, కానీ ఈ ఐదవ శరీరం దాటితేనే బ్రహ్మానంద శరీరం ఉంటుంది. అది ఆనంద రూప సంబంధ శరీరం, ఈ బ్రహ్మానంద శరీరం చేరుకున్నాడు అంటే తనకు ఈ సిద్ధులు లోకం అంతా కొత్తగా కనిపిస్తుంది. ప్రేమ, కరుణ, దయ ఎక్కువగా ఉంటుంది. ఇది ఆరవ శరీరం ఈ శరీరాన్ని మానవుడు పొందగలుగుతాడో అంటే సాధన చేరగలుగుతాడో అప్పుడు వారికి ఈ లోకంతో పని ఉండదు. అలాగే ఏడవది ఈ అన్ని శరీరాలు కలిపి ఆత్మ స్వరూపంగా తయారుచేసి ఇవన్నీ శరీరాలు వదిలి పూర్తి ఆత్మలో లీనమై ఆత్మ ఆత్మగా మిగిలిపోవడం ఏడవ శరీరం. ఆ ఆత్మ పరమాత్మలో కలిసిపోతుంది. అయితే శరీరాలకు ఒక్కొక్కరు ఒక్కో పేరు పెట్టవచ్చు. ఎవరు ఎన్ని పేర్లు పెట్టవచ్చు ఆత్మకు సాక్షి, జాగృతి అని పేర్లు పెట్టవచ్చు. కానీ ఉన్నది మాత్రం ఒక్కటే ప్రాణం, అదే విధంగా ఏడు శరీరాలకు ఎన్నో పేర్లు పెట్టుకోవచ్చు కానీ ఉండేది మాత్రం ఏడు శరీరాలు, ఈ ఏడు చక్రాలకి, ఏడు శరీగాలకి సంబంధం ఉంది. అది గురువుగారి వద్ద తెలుసుకోవడం మంచిది అని అనుకుంటున్నాను.

# 8. గురుకరుణ

**ప్రశ్న : గురువు కరుణ లేనిదే ముక్తి పొందవచ్చా?**

**జవాబు :** గురువు కరుణ లేనిచో తనకు తాను ముక్తి పొందుట తరము కాదు. ఎట్లు అనగా, ఒక లోతైన బావిలో పడిపోయినా మానవుడు ఎవరి సహాయం లేకుండా తనకు తాను రాలేరు. అలాగే ఒక త్రాడుతో బంధించబడిన వ్యక్తి ఎవరి సహాయం లేకుండా తనకు తాను తీసుకొని రాలేరు. అలాంటిది స్వయ ప్రయత్నంచే భవబంధం విముక్తి నెరుగదు. కనుక దయామయుడు అగు గురువు మరియు సర్వేశుని కరుణకు పాటపడాలి. సత్తువైనా భూమిలో మంచి విత్తనములు వేసినను వర్షం లేనిచో ఫలింపలేనట్లు, శుద్ధి హృదయంలో కూడా ధ్యానము, జపము, తపో, యోగ, యజ్ఞము, వ్రతము, శ్రావణాదులు అను సారవంతమైన విత్తనములు పాతి పెట్టినను గురువు కరుణ కటాక్షము వీక్షణము, భక్తి అను ద ృష్టి లేనిచో ఫలింపదు. కనుక ముక్తి గురువు లేనిదే సాధ్యం కాదు.

**ప్రశ్న : స్వామీజీ! భగవంతుణ్ణి ఏ పువ్వులతో పూజిస్తే మనను కరుణిస్తారు?**

**జవాబు :** ప్రతి మానవుడు 8 రకాల పువ్వులతో పరమాత్మని పూజంచాలి. 8 రకాల పువ్వులు వాటితో పూజించినట్లయితే పరమాత్ముడు మీకు దర్శనం ఇస్తారు. ఒకటి మొదటి పువ్వు అహింస అనే పువ్వు, ఇంద్రియ నిగ్రహం రెండవ పువ్వు, భూతదయ అనేది మూడవ పువ్వు, క్షమ నాల్గవ పువ్వు, శాంతి ఐదవ పువ్వు, తపస్సు ఆరవ పువ్వు, ధ్యానము ఏడవ పువ్వు, సత్యము ఎనిమిదవ పువ్వు, ఈ ఎనిమిది పువ్వులతో మీరు పరమాత్ముని పూజించినట్లయితే ఖచ్చితంగా మీకు ఈశ్వరుడి దయ కల్గుతుంది.

**ప్రశ్న : సాధకుడు ఏమి ఆశించి సాధన చెయ్యాలి? సాధకుడు సాధన చేసే సమయంలో వారి మనస్తత్వం ఎలా ఉండాలి?**

**జవాబు :** సాధకుడు మనస్సు ఎప్పుడు లోక క్షేమం కోరే విధంగా ఉండాలి. పరుల కోసమే చెట్లు, పండ్లు ఇస్తున్నాయి. నదులు ప్రవహిస్తున్నాయి. గోవులు పాలు ఇస్తున్నాయి. అలాగే సాధకుడు మనస్సు ప్రక ృతితో ముడి పడి

ఉండాలి. సూర్యుడు, చంద్రుడు వాళ్ళు నిస్వార్ధంగా ఏవిధంగా అయితే ప్రపంచానికి తనవంతు కార్యక్రమాన్ని అందిస్తున్నారో సాధకుడు చేసిన సాధన ద్వారా ప్రపంచానికి మంచి జరగాలని నిస్వార్ధం కొద్దీ తన జ్ఞానాన్ని అందించాలి. అలా అందించినప్పుడే సాధకుడి సాధనకు ఫలితం దక్కుతుంది. సాధన చేసి హిమాలయాల గుహలో కూర్చోని తనకు తాను ముక్తి పొందుట ఇది సరైనది కాదు. జన్మ వృధా అవుతుంది. ఎందుకంటే ఏ ఆకు లేని చెట్టు ఎండిపోయి ఉంటుంది. అలాంటి చెట్టుపైన ఏ పక్షి వాలదు. ఆ చెట్టు కూడా భూమికి బరువు తప్ప ఏమీ లేదు. మానవుడు భక్తి మార్గంలో భక్తి అనే విత్తనం వేసుకొని ఎప్పుడైతే పరమాత్ముని ధ్యానం చేస్తారో అప్పుడే వాళ్ళలో ప్రేమ, అనురాగం, ఆత్మీయత మొదలవుతాయి. ఈ అనురాగం, ఆత్మీయత మొదలైనప్పుడు కాయలు, పండ్లు పండిన చెట్ల దగ్గరకు ఎలా అయితే వచ్చి జనాలు తీసుకువెళతారో, పువ్వులు చెట్ల వద్దకు ఎలా పువ్వులు తెంపుకొని వెళతారో అలాగే లోకం నీ దగ్గరకు వచ్చి నీలోని భక్తిని, జ్ఞానాన్ని పదిమందికి పంచమని వాళ్ళే నీ వద్దకు వస్తారు. సాధకుడు ఎప్పుడూ ఒక పూల తోటలా, ఒక మామిడి తోటలా ఉండాలి. అంతేకానీ అహంకారం కొద్దీ నేను ముక్తి పొందాలి అని అనుకోకూడదు.

ప్రశ్న : **మానవుడు సంతోషంగా బ్రతకాలి అంటే ఏమి చెయ్యాలి?**

**జవాబు** : మానవుడు సంతోషంగా బ్రతకాలి అంటే తనకు తనలా బ్రతికితే తన జీవితం ప్రశాంతంగా ఉంటుంది. కానీ మానవుడు దురాశకు వెళతారు, పరాయి స్త్రీ సాంగత్యం, జూదం, వేట, కఠిన భాష, విచక్షణ రహితంగా శిక్షించుట, మద్యం సేవించుట ఆశిస్తారు. వీటికి దూరంగా ఉంటే చాలు. తాను ప్రత్యేకంగా ఏమీ చెయ్యనక్కర్లేదు. తన జీవితం ఆనందంగా ఉంటుంది.

ప్రశ్న : **స్వామీజీ పంచ అగ్నులు అంటే ఏమిటి?**

**జవాబు** : మనము పూజించవలసినట్టి అగ్నిని పంచ అగ్ని అంటారు. కాబట్టి పంచ అగ్ని అంటే తల్లి, తండ్రి, గురువు, అగ్ని, ఆత్మ. వీటిని పంచాగ్నులు అంటారు.

# 9. స్వామీజీ రాజయోగం

మాత రేణుక గంగోత్రిలో ఉంది అని తెలిసి స్వామీజీ వెళ్లి కలిసారు. స్వామీజీ మనస్సులో ఉన్న మాట ఈ విధంగా చెప్పారు. అక్క నేను 2008 నుండి 2011 వరకు తెలంగాణా, రాయలసీమ, విశాఖపట్నం అక్కడక్కడ కొన్ని రోజులు ఉంటూ సాధన కొనసాగిస్తూ వచ్చాను. ఇప్పటి నుండి కేదార్ నాథ్ లో ఉండాలి అని అనుకుంటున్నాను. గురువు గారు ఆజ్ఞ ఏమిటి అంటే గాయత్రి మహాపురశ్చరణ చేయమని ఆజ్ఞాపించారు. జనుల వద్ద ఉండటానికి నా మనస్సు అంగీకరించడం లేదు. గాయత్రి మహాపురశ్చరణ చెయ్యాలి అంటే వివాహం చేసుకొని 7 సంవత్సరాలు గృహస్థ జీవితంలో ఉంటూ సంతానం అయ్యిన తరువాత గాయత్రి మహాపురశ్చరణ చేయమని చెప్పారు. నేను 24 సంవత్సరాలు గాయత్రి మహాపురశ్చణ పూర్తి అయిన తరువాత నా వారసుల్ని గాయత్రి మహాపురశ్చణ చేయమని చెప్పారు. అలా నా వంశంలో పుట్టిన వారసులు ఒకరు తరువాత ఒకరు, ఒకరు తరువాత ఒకరు అలా నా వంశము భూమిపై ఉన్నంత వరకు చేస్తూనే ఉండాలి, అని నా గురుదేవుడైన ఈశ్వరుడి ఆజ్ఞ. నేను ఊహ తెలిసినప్పటి సుండి ఒంటరిగానే జీవించాను ఇప్పుడు వివాహం చేసుకొని గ ృహస్థ జీవితంలో ఉండగలుగుతానా? లేనా? అని నా మనస్సు నన్ను ప్రశ్నిస్తుంది. ఏకాంతంగా హిమాలయాలలో జీవించడానికి అలవాటు అయిన నేను.

**"మాత రేణుక" సమాధానం:**

అన్నా! నీవు జన్మించింది. ఋషి సాంప్రదాయాన్ని కాపాడడం కోసమే నీ జ్ఞానం ప్రపంచానికి అందాలంటే నీవు ప్రపంచంలోకి వెళ్లాలి. నీవల్ల ప్రజలకే కాదు ప్రక ృతికి కూడా మేలు జరుగుతుంది. రోజుకు రెండు సార్లు యజ్ఞం చేసి 7000 సార్లు గాయత్రం జపం చేసి అఖండ ధుని సాక్షిగా ప్రక ృతి, ప్రపంచం బాగుండాలి అని చేసే సంకల్పం తప్పకుండా సిద్ధిస్తుంది. నీకు కేదార్నాథ్ అంటే ఇష్టం ప్రతి సంవత్సరం చతుర్మాస దీక్షలలో నువ్వు వచ్చి ఎక్కడైనా ఉండవచ్చు. నిజానికి నీలాంటి జ్ఞాని నా జీవితంలోకి రావడం నా అదృష్టంగా భావిస్తాను. ఎందుకు అంటే తపస్సు చేసి ఆత్మజ్ఞానం పొంది కొండ గుహలలో దేహాలను వదిలేసిన మహర్షిల్ని ఈ హామాలయాలలో కొండ గుహలలో చాలా చూడొచ్చు. అలాంటిది నీవు గాయత్రి మహాపురశ్చరణ అనే గొప్ప

కార్యక్రమము నీవు ప్రారంభించి నీ వంశంలో తరతరాలుగా కొనసాగే విధంగా ఈశ్వరుడే స్వయంగా సంకల్పం చేశారు అంటే ఎంత అదృష్టం. కానీ నీ గురించి ఆలోచిస్తే నా మనస్సుకు బాధగా అనిపిస్తుంది. ధీరెంధర్ బాబా నీ గురించి చెప్పారు. అతి చిన్నవయస్సులో హిమాలయాలు వచ్చావు. చాలా కష్టపడ్డావు అని. నీ జీవితం మొత్తం ఒంటరిగానే కొనసాగింది అని. ఇప్పుడు రాజయోగం తీసుకొని 7 సంవత్సరాలు గృహస్థ జీవితం జీవించి ఉత్తమ దంపతులు అనిపించుకొని మళ్లీ అరణ్యంలోకి వెళ్ళి ఆశ్రమం నిర్మాణం చేసుకొని గాయత్రి మహపురశ్చరణ ప్రారంభం చేసుకొని మళ్లీ ఒంటరిగానే జీవించాలి. కారణజన్ములు అంటే ఇలాగే ఉంటారు అనుకుంటా ఎందుకంటే ఒక మంచి కార్యక్రమము చేయడం కోసం జన్మించిన వారిని "కారణ జన్ములు" అంటారు. నీవు చేసే కార్యక్రమము చాలా గొప్ప కార్యక్రమము నీవు చేసే కార్యక్రమము పరిపూర్ణము కావాలి అని, నీ సంకల్పం సిద్ధించాలి అని, నీ కార్యక్రమము 5000 సంవత్సరాల వరకు కొనసాగాలి అని కోరుకుంటున్నాను. నా ఆశీర్వాదము మరియు ఈశ్వరుని అనుగ్రహము నీకు ఎప్పుడూ ఉంటుంది. అని "మాత రేణుక" ఆశీర్వదించింది. మాత రేణుక అన్నా, నీ జీవితంలోకి వచ్చే అమ్మాయి నిన్ను ఒక కొడుకులా చూసుకుంటుంది అని నా నమ్మకం. నీవు చేసే కార్యక్రమానికి తను కూడా తోడుగా ఉంటుంది అని నమ్ముతున్నాను. ఎందుకంటే నీలాంటి సాధకుణ్ణి వివాహం చేసుకోవాలి అంటే తను కూడా సాధకురాలై ఉండాలి కదా! ఆ అర్హత ఉన్నవాళ్ళే నీ జీవితంలోకి వస్తారు. నీవు ఏ మాత్రం సందేహపడకు. నీ తండ్రి ఈశ్వరుణ్ణి అనుగ్రహం నీకు పరిపూర్ణంగా ఉ ంది. నేను కూడా హిమాచల్ ప్రదేశం వెళ్ళిపోవాలి అనుకుంటున్నాను. బహుశా! నేను నీకు మళ్ళీ కలవకపోవచ్చు అని చెప్పింది "మాత రేణుక".

స్వామీజీ చెప్పారు, అక్క నేను 24 సంవత్సరాలు గాయత్రి మహపురశ్చరణ ప్రారంభం చేసేవరకు అందుబాటులో ఉండు. నేను 24 సంవత్సరాలు దీక్ష మొదలుపెట్టిన తరువాత అందరి జీవితంలో నుంచి నేనే వెళ్లిపోతాను. ఈశ్వరుడి పాదాలకు అంకితం అయిపోతాను. మాత రేణుక వద్ద నుండి రిషికేష్ వచ్చి ధీరెందర్ బాబా దగ్గర ఆశీర్వాదము తీసుకొని హైదరాబాద్ వచ్చారు. 2012 జూలై 28 రోజున రాజయోగం స్వీకరించారు స్వామీజీ.

# 10. కుండలినీ శక్తి సాధన

**ప్రశ్న : స్వామీజీ! కుండలినీ శక్తి సాధన ఎలా చెయ్యాలి? కుండలినీ శక్తి సాధన గురించి మాకు వివరించండి.**

**జవాబు :** సాధకుడు ముందుగా మంచి గురువును ఎంచుకోవాలి. ఆ గురువు ఆత్మసాక్షాత్కారం పొంది ఉండాలి. గురువుల గురించి ఒక విషయం చెబుతాను. ఈ రోజులలో గురువులు చాలా ఎక్కువగా ఉన్నారు. ధ్యాస గురూజీ, యోగ గురూజీ కుండలిని గురూజీ, తంత్ర గురూజీ అని మంత్ర గురూజీ అని గురువులు ఎక్కువగా ఉన్నారు. మనము గురువు వద్దకు వెళ్లే ముందు ఎక్కడ సాధన చేశారు. ఎన్ని సంవత్సరములు సాధన చేశారు. వారు ప్రపంచానికి ఏమి ఇవ్వాలి అనుకుంటున్నారు అని వారిని పరిశీలించాలి. ఇప్పుడు చాలామంది గురువులు పుస్తకంలో ఉన్న జ్ఞానాన్ని బోధిస్తున్నారు తప్ప అనుభవపూర్వకంగా బోధించుట లేదు. ఎక్కువ మందికి అనుభవజ్ఞానం లేదు అంటాను. అలాగే పుస్తక జ్ఞానం తప్ప సాధన జ్ఞానం లేదు. నిజానికి సాధన జ్ఞానం లేదు' అని ఎందుకు చెబుతున్నాను అంటే పరిపూర్ణంగా ఆత్మ సాధన చేసినట్లయితే ఒక్కసారి మానవుడు ధ్యానానికి అలవాటు అయితే బయట ప్రపంచానికి రావడానికి ఒప్పుకోరు. ఈ ప్రచారాలు వీటిని అంగీకరించరు అలాగే ఒక్క గురువు ఎన్ని మంత్రాలు అయినా ఉపదేశం చేస్తున్నారు. అది కూడా సరైనది కాదు. ఎందుకంటే గురువు వద్ద మంత్రం ఉపదేశం తీసుకుంటారు అంటే ఆ గురువు, ఆ మంత్రాన్ని కొన్ని కోట్ల సార్లు జపము చేసి ఉంటారు. వారి దగ్గర మనం మంత్రదీక్ష తీసుకుంటే త్వరగా సిద్ధిస్తుంది అనే ఉద్దేశ్యంతో మంత్ర ఉపదేశం తీసుకుంటారు. కానీ ఇప్పుడు ఒకే గురువు పది మంత్రాలు ఉపదేశం చేస్తున్నారు. అంటే వారు పది మంత్రాలు సాధన చేసి ఉండరు కదా! ఒక్క మంత్రాన్ని సాధన చేస్తేనే అది మంత్ర సాధన అంటారు. ఎవరు పడితే వారు మంత్రోపదేశము చేస్తున్నారు. అర్హులు కాకపోయినా ఏదో గురువు అనిపించుకోవడం

కోసం అలా మంత్రోపదేశము చేస్తున్నారు. ముందుగా సాధకుడు వీటిని గమనించాలి. గమనించి సాధకుడు ఆసనసిద్ధి పొందాలి. ఆసనసిద్ధి అంటే ఒకే ఆసనంలో 3 గంటల నుండి 8 గంటల వరకు కూర్చునే శక్తి కలిగితే దాన్ని ఆసనసిద్ధి అంటారు. మంత్ర సాధనకు పద్మఆసనం, కుండలి సాధనకు సిద్ధ ఆసనం, తప్పకుండా చెయ్యాలి. కాబట్టి సిద్ధ ఆసనంలో 3 నుండి 6 గంటలు కూర్చుని స్థితికి సాధకుడు రావాలి. ఆ తరువాత అనుభవంగల గురువు వద్ద ప్రాణాయామం నేర్చుకొని, నాడీ శుద్ధి చెయ్యాలి. నాడీశుద్ధి చేసి మూలాధారంలో ఉన్న కుండలి సాధన ఎలా చెయ్యాలి అని తెలుసుకోవాలి. సాధకుడికి ఆహార నియమాలు చాలా అవసరం. సాధకుడు ఉన్న ప్రదేశం అతి చల్లటి ప్రదేశము, అతి వేడి ప్రదేశం అయ్యి ఉండకూడదు. అలాగే సాధకుడు ఎప్పుడూ భయపడే ప్రదేశాలలో ఉండకూడదు. ఎందుకంటే మనస్సులో భయము ఉంటే ధ్యానము కుదరదు కాబట్టి ఏకాంత ప్రదేశంలో ఉండి వారి సాధన ప్రారంభం చెయ్యాలి. సాధకుడు ఎటువంటి సెల్ ఫోన్ గాని ఇతర కాంటాక్స్ పెట్టుకోకూడదు. కరెక్టుగా 6 నెలలు మానవుడు సాధన చేసినట్లయితే కుండలిని సిద్ధిస్తుంది. ఇది నేను పుస్తకాలు చదివి చెప్పడం లేదు. అనుభవ పూర్వకంగా చెబుతున్నాను. అలాగే కుండలిని అంటే పూర్తిగా తెలుసుకోవాలి. కుండలిని అంటే మన మూలాధారంలో ఉన్న శక్తి అని అర్థం. కుండలిని అంటే మరొక అర్థం వస్తుంది. చుట్టలు చుట్టుకున్న పాము అని అర్థం. అలాగే కుండలిని చుట్టలు చుట్టుకుని పడుకున్న పాము పైకి వస్తుంది అంటారు. కానీ అలాంటివి పాములు ఏమీ ఉండవు. ప్రాణశక్తి ఉంటుంది. మనకు సూర్యనాడి, చంద్రనాడి మధ్య సుషుమ్న నాడి ఉంటుంది. ఈ సుషుమ్న నాడి వెన్నుపాము మధ్యలో నుంచి వస్తూ ఉంటుంది. వెన్నుపాముకి ఏడు చక్రాలు మూలాధార చక్రం అలాగే స్వాధిష్టానం, మణిపూరకం, అనహతన చక్రం, విశుద్ధ చక్రం, ఆజ్ఞయ చక్రం, సహస్ర చక్రం అని అంటారు. ఒక్కొక్క చక్రంలో

ఒక్కొక్క ఆది దేవుడు ఉంటారు అని అంటారు. ఇదంతా భ్రమ చక్రాలు లేవు చక్రాలలో ఏ దేవుడు లేరు. కాకపోతే మన వెన్నుపాముకి మధ్యలో చిన్న చిన్న గ్రంధి ఉంటాయి. అంటే హోల్స్ గా ఉంటాయి. వాటిని శక్తి కేంద్రాలు అంటారు. బహుశా వీటిని సాధకుడు గుర్తించడం కోసం పెట్టిన పేరే చక్రాలు అయ్యి ఉంటాయి అని అనుకుంటున్నాను. కాబట్టి సూర్యనాడి, చంద్రనాడి గురించి మరియు సుషుమ్న నాడి గురించి పూర్తిగా తెలుసుకోవాలి. నాడిశుద్ధి పూర్తిగా చేసుకోవాలి. ఈ నాడిశుద్ధి అయిన తరువాత మీరు సాధన ప్రారంభం చెయ్యాలి. సాధనలో మీకు ఏకాగ్రత పెరిగిందా లేదా అని తెలుసుకోవాలంటే మీ చేతి నాడి కొట్టుకున్నప్పుడు మీకు వినిపించాలి. ఎప్పుడైతే ఆ చేతి నాడి మీకు కొట్టుకోవడం వినిపిస్తుందో అప్పుడు మీరు పూర్తి ఏకాగ్రతలో ఉన్నట్లుగా, అలాగే కుండలిని సాధనకు ప్రాణయామము చాలా ముఖ్యం. ఎందుకంటే ప్రాణాయామం అంతర కుంభకం, బాహ్యకుంభకం అని ఉంటాయి. ఆ కుంభకం ఎంత చెయ్యాలి, మీ ఆరోగ్య పరిస్థితి తెలియదు కాబట్టి వాటిని దృష్టిలో పెట్టుకొని గురువు మీకు ఎంత కుంభకం చెయ్యాలి అని వివరిస్తారు. అలాగే నవరంధ్రాలు బంధించడం ఉద్యాన బంధం, జలాంధర బంధం అని అంటారు. ఈ బంధాలు గురించి పూర్తిగా గురువు వద్ద నేర్చుకోవాలి. నేర్చుకొని సాధన ప్రారంభం చెయ్యాలి. అలాగే సాధన గురించి పూర్తిగా తెలుసుకొని, సాధన ప్రారంభం చేసుకోండి.

# 11. గాయత్రి మహాపురశ్చరణ

స్వామీజీ నాకు ఫోన్ చేశారు. నేను స్వామీజీ వద్దకు వచ్చాను. ఆశ్రమ ప్రదేశానికి తీసుకొని వెళ్ళారు. మేమిద్దరం కలిసి ఆశ్రమ ప్రదేశం దగ్గరికి వచ్చి చూశాము. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలలోని కృష్ణాజిల్లా, వీరులపాడు మండలము, నరసింహారావు పాలెం గ్రామ శివారు అటవీ ప్రాంతము. విజయవాడ కనకదుర్గ గుడినుండి ఖచ్చితంగా 50 కి.మీ.లు విజయవాడ-హైదరాబాద్ రహదారి నుండి 9 కి.మీ.ల లోపల ఉంటుంది. విజయవాడ నుండి కంచికచర్ల, కంచికచర్ల నుండి సరసింహరావు పాలెం ప్రదేశం దగ్గరకు వెళ్ళి చూడగానే అద్భుతంగా ఉంది. హిమాలయాలలో ఉన్నట్లే ముందు పెద్ద పెద్ద కొండలు, ఆశ్రమము ప్రక్కనే మంచి కొండ. ఈ ప్రదేశం స్వామీజీ గారి గురించే ఎదురు చూస్తున్నట్టు అనిపించింది. ఇక్కడ ఆశ్రమం వద్దకు వచ్చి కూర్చుంటే చాలు అన్ని మరచిపోతాము. సాయంత్రం మనం ఆశ్రమం దగ్గర ఉన్నట్లయితే హిమాలయాలలో ఉన్న ఆనందం వేస్తుంది. విజయవాడ సిటికీ 50 కి.మీ. దూరంలో ఇంత అద్భుతమైన ప్రదేశం ఉన్నదని అసలు అనుకోలేదు. ఇక్కడికి ఎవరు వచ్చినా రెండు మూడు రోజులు ఉండవచ్చా అని అడుగుతారు. అంత అద్భుతమైన ప్రదేశము. చూస్తుండగానే ది. 22-1-2018 రానే వచ్చింది. వసంత పంచమి. ఈ రోజు స్వామీజీ 24 సంవత్సరాల అఖండ తపస్సు ప్రారంభం. గాయత్రీ మహాపురశ్చరణ ప్రారంభం. అసలు గాయత్రీ మహాపురశ్చరణ అంటే ఏమిటి అని స్వామీజీని అడిగినప్పుడు స్వామీజీ మహాపురర్చణ నియమాలు ఈ విధంగా చెప్పారు. గాయత్రీ మహాపురశ్చరణ అంటే సంవత్సరానికి 24 లక్షల గాయత్రీ మంత్ర జపం చేస్తూ అంటే ప్రతిరోజూ 6,850 గాయత్రీ మంత్రాలతో, అఖండ దీపం, అఖండ ధుని, నిత్య అగ్నిహోత్రం, అఖండ బ్రహ్మచర్యం, ఏకవస్త్రం మీద ఉండాలి. ఆహార నియమాలు గోధుమలు ఆవుకు పెట్టి, ఆవు తిని విసర్జన చేసిన తర్వాత వచ్చిన గోధుమలు తీసి పిండి పట్టించుకొని ఒక పూట చపాతి తినాలి. లేదా ఆవు పాలు త్రాగాలి. ఈ విధంగా 24సం॥లు చెయ్యాలి. ఈ అరణ్యంలోనే ఆశ్రమ నిర్మాణం చేసుకొని వారి తపస్సు ప్రారంభం చేశారు. దీక్ష ప్రారంభం ముందు అగ్ని దేవుని ధుని రూపంలో తీసుకువచ్చారు. స్వయంగా సాయిబాబా ధునిని ఎక్కిరాళ్ళ భరద్వాజ్ మాస్టర్ గారికి ఇచ్చారు. మాస్టార్ గారు ఆ ధునిని తీసుకొని ఒంగోలులో వారి ఆలయంలోని ధునిని ప్రారంభించారు. ఇప్పుడు స్వామీజీ గారికి మాస్టర్ గారి ధుని నుండి అగ్ని దేవుణ్ణి ఆహ్వానించి మన ఆశ్రమంలో దానిని అవదూత పోలయ్య

స్వామీజీ చేతులమీదుగా ప్రారంభించారు. అఖండ దీపాన్ని మాతాప్రీతి (వేదమాత) గారి చేతులమీదుగా వెలిగించారు. మాతాజీ ప్రీతి (వేదమాత) ఆజ్ఞ మేరకు వారి కోసం గాయత్రీ దేవిని ప్రతిష్ఠించారు. స్వామీజీ మాతాజీ ప్రీతి గారికి, పద్మగారికి, మరియు బాల గారికి, ఈ ముగ్గురిని ముగ్గురు అమ్మలుగా భావించి పాదపూజ చేశారు. చేసి స్వామీజీ దీక్షను ప్రారంభించారు. వారి గురువుగారి ఆజ్ఞ పాటిస్తూ నిత్య అగ్నిహెూత్రం ప్రారంభించారు. ఆ రోజు నుంచి స్వామీజీ అరణ్యంలో ఉంటూ గాయత్రీ మహాపురశ్చరణ అనే మహా తపస్సును కొనసాగిస్తూనే ఉన్నారు. భక్తులు ఎవరైనా స్వామీజీకు భోజనం పెట్టినట్లయితే వారి కర్మలు నశిస్తాయి అని నమ్ముతారు.

స్వామీజీకి భోజనం పెట్టే విధానం మనము మన ఇంట్లో గాయత్రీ దేవి ఫోటో పెట్టి అఖండ దీపం పెట్టి 41 రోజులు లేదా 21 రోజులు అనుష్టానం నిర్ణయించుకొని ఆ అనుష్టానంలో ప్రతి రోజు బియ్యపు గింజలతో గాయత్రీ జపం చేయ్యాలి ఒక్కొక్క గాయత్రీ మంత్రానికి ఒక్కొక్క బియ్యపు గింజ ప్రక్కన పెడుతూ అలా ప్రక్కన పెట్టిన బియ్యాన్ని పౌర్ణమి రోజున మాత్రమే స్వామీజీ వద్దకు వచ్చి అన్నం వండి మొదటి ముద్ద గాయత్రీ అమ్మవారికి నైవేద్యం, అందులో రెండవ ముద్ద అఖండ ధునికి, మూడవ ముద్ద నిత్యాగ్నిహెూత్రునికి, మిగిలిన నాలుగవ భాగం స్వామీజీకి భోజనం పెట్టాలి. అది కేవలం ఒక పౌర్ణమిరోజు మాత్రమే భోజనం స్వీకరిస్తారు. మిగిలిన సమయంలో గోవు విసర్జన చేసిన గోధుమలతో మాత్రమే చపాతిని స్వీకరిస్తారు. ఈ విధంగా 24 సంవత్సరాల అఖండ తపస్సును కొనసాగిస్తున్నారు. స్వామీజీతో ధర్మ సందేహాలు కాని సాధన మార్గాలు కాని తెలుసుకోవాలి అనుకుంటే ప్రతి శనివారం ఉదయం 10 గంటలనుండి మధ్యాహ్నం 3 గంటల వరకు అందరికి అందుబాటులో ఉంటారు.

ప్రశ్న : **స్వామీజీ ఒక చిన్న ప్రశ్న చాలామంది భక్తులు నన్ను అడిగారు. స్వామీజీ పెళ్ళి చేసుకొని, పిల్లల్ని కని మళ్ళీ అడవిలోకి వెళ్ళి ఉంటున్నారు, అది ధర్మమేనా?**

**జవాబు** : మంచి ప్రశ్న వేశారు. నన్ను కూడ ఇంతకుముందు తేలప్రోలు శ్రీనివాసరెడ్డి మరి కొందరు కూడా అడిగారు. నేను చేసేది శాస్త్రాన్ని అనుసరించి మరియు ధర్మాన్ని అనుసరించి చేస్తున్నాను. కుటుంబం బ్రతకడానికి కావలసినవి అన్ని ఏర్పాటు చేశాను. నాకున్న స్థలం, ఇల్లు అమ్మివేసి ప్రతినెల 25000 రూపాయలు ఆదాయం వచ్చే ఏర్పాటు చేశాను. మన

ధర్మంలో చెప్పబడింది పురుషార్థాలు అని. పురుషార్థాలు అంటే ధర్మ, అర్థ, కామ, మోక్షాలు. 1. ధర్మ అంటే ధర్మంగా సంపాదిస్తూ జీవిస్తూ మన ధర్మం ఏమిటో తెలుసుకొని భర్తగా, కొడుకుగా, తండ్రిగా మన ధర్మాలు నిర్వహిస్తూ సమాజ ధర్మం కూడా పాటించి అన్ని ధర్మాలకు న్యాయం చేయాలి 2. **అర్థం:** సమాజంతో పాటుగా జీవిస్తూ వేదాలను, ఉపనిషత్తులను అర్థం చేసుకొని గురువు బోధించిన జ్ఞానాన్ని అర్థం చేసుకొని సహజత్వంగా, సమదృష్టి కలిగి సామాన్యమైన జీవనం సాగించుటకు న్యాయబద్ధంగా సంపాదిస్తూ జీవనం సాగించడమే. 3.కామ: కామ అంటే కోరికలు, ఈ కోరికలలో తీరని కోరికల వెంట మనసు పోకుండా కేవలం ప్రపంచానికి మంచి సంతానం ఇవ్వాలనే సదుద్దేశ్యంతో సంసారం చేసి మంచి సంతానాన్ని ప్రపంచానికి అందించి కోట్ల రూపాయలు సంపాదించాలన్ని కోర్కె వదిలేసి, భార్యా, భర్తలు ఇద్దరు బ్రహ్మచర్యం పాటిస్తూ ఒకతల్లి. కొడుకులా, మంచి స్నేహితుల్లా కలిసి సహజీవనం చేస్తూ మోక్షం వైపు వెళ్ళాలి. 4. మోక్షం: మోక్షం అంటే భార్యా భర్తలు ఇద్దరూ కూడా పిల్లలకు వారి బాధ్యతను అప్పగించి ఇద్దరూ కూడా మోక్షం వైపు ప్రయాణం చేయాలి.

అశాశ్వతమైన ఈ మానవ జన్మ మీద వ్యా మోహం తగ్గించుకొని శాశ్వతమైన ఆత్మవైపు ప్రయాణం చేయడం ఎంతో ఉత్తమమైన లక్షణం. మనం ప్రపంచానికి మంచి మార్గంలో నడిచే ప్రయత్నం చేయాలి అని మనుధర్మమే చెప్పింది కదా మరి నేను చేసేది అధర్మం ఎలా అవుతుంది? అంతే కాకుండా ప్రతి శనివారం సాయంకాలం పిల్లలు నావద్దకు వచ్చి ఆదివారం మొత్తం నాతో సరదాగా ఉంటారు. తండ్రిగా నా బాధ్యతను నేను పూర్తి చేశాను. భర్తగా నా ధర్మాన్ని నేను పాటిస్తున్నాను. భార్యా భర్తలు అంటే కేవలం కామమును అనుభవించడం మాత్రమే కాదు. కామానికి అతీతమైన, పరిపూర్ణమైన ప్రేమ తత్త్వముతో ఒకరికి ఒకరు తోడు ఉంటూ శాశ్వతమైన ఆత్మజ్ఞానం పొంది మోక్షం చేరుకోవాలి. వేదాలు ఇవే చెబుతున్నాయి కదా! చతుర్విధ పురుషార్థాలు ఇవే చెబుతున్నాయి. నేను ఎప్పుడైనా వేద ధర్మాన్ని అనుసరించే మానవ జీవితాన్ని కొనసాగిస్తాను.

## మహా పురశ్చరణ ఎందుకు? ఎవరి కోసం?

మానవ జన్మ స్వార్థ జన్మ. ఎన్ని కోట్లు ఉన్నా మనసు ఇంకా డబ్బు కోసం తపన పడుతూనే ఉంటుంది. ఆశ పడుతూనే ఉంటుంది. నేను బాగుండాలి, నా కుటుంబం బాగుండాలి అని అందరూ కోరుకుంటారు. మరి కొందరు వారి కుటుంబాన్ని కాపాడుకోవడం కోసం అధర్మ మార్గాలను ఎన్నుకున్న వారు కూడా ఉన్నారు. ఇప్పుడే కాదు, పూర్వ కాలంలో కూడా వారి కుటుంబాల కోసమే జీవించారు. జీవిస్తున్నారు. ప్రతి వారి కుటుంబం లో సూర్యుడు అస్తమించగానే తన భర్త రాకకోసం భార్య ఎదురు చూస్తూనే ఉంటుంది. పిల్లలు స్కూలు నుండి ఇంటికి రాగానే వాళ్ళ నాన్న రాక కోసం ఎదురు చూస్తారు. మా నాన్న మాకోసం ఏమి తెస్తాడా అని. ఒక కుటుంబం కాదు, ఒక ప్రదేశం కాదు, ప్రపంచం మొత్తం కూడా ఇదే జరుగుతుంది. ఇది జరిగితే మానవ జీవన విధానం అని అనుకుంటాము. వీటికి విరుద్ధంగా ఏ ఒక్కరు ఉన్నా వారిని మనం పిచ్చివాడిలా జమకడ తాము. అందరూ బాగుండాలి అని కోరుకుంటాము. కానీ అందరినీ బాగు చేసే ఒక్క కొడుకు మన ఇంట్లో పుట్టాలి అని కోరుకోము. ఎందుకు అనుకోము అంటే వారు కేవలం ప్రపంచం కోసమే ఆలోచిస్తారు. చివరకు ప్రపంచం కోసమే ప్రాణాలు అర్పిస్తారు. కాబట్టి ప్రపంచానికి ఉపయోగపడే ఒక బిడ్డ పుట్టాలని మాత్రమే కోరుకుంటాము. కానీ నా కడుపులో వద్దు అనుకుంటాము. ఈ రోజుకు కూడా మనం వివేకానంద గారి గురించి , ఇలాగే రామక ృష్ణ పరమహంస గారి గురించి, గొప్ప వ్యక్తుల గురించి మన ఉపన్యాసంలో చెప్తూ ఉంటాము. సందర్భం వచ్చినప్పుడు గొప్ప గొప్ప వాళ్ళను పొగుడుతూ ఉంటాము. వారు ప్రపంచానికి అది చేశారు. వీరు ప్రపంచానికి ఇది చేశారు అని చెబుతాము. కానీ మనం మాత్రం ప్రపంచం కోసం ఏమి చేయం. మనకి పుట్టిన పిల్లలకి వివేకానంద అని పెడతాము కానీ వారు మాత్రం ఇంజనీర్ కావాలి లేదా డాక్టర్ కావాలని కోరుకుంటాము. కానీ వాడు మాత్రం వివేకానందుడు కావాలని కోరుకోము. నా కుటుంబం బాగుండాలి. నాకు బ్యాంక్ బ్యాలెన్స్ ఉండాలి.

సముద్రతీరాన ఒక గెస్ట్ హౌస్ ఉండాలి. సముద్ర కెరటాలు చూస్తూ, టీ తాగుతూ హాయిగా బ్రతకాలి. మనుమలు, మనుమరాళ్ళతో ఆడుకోవాలి. ఆనందం

అనే జీవితం కావాలని అందరం కోరుకుంటాము. ఇది నిజం. ఇదే సత్యం, కానీ మన స్వామి సుగుణానంద గాయత్రి వారు మాత్రం గాయత్రీ మహా పురశ్చరణ అనే అఖండమైన తపస్సును ప్రపంచ శాంతికోసం అరణ్యంలో ఉంటూ సాధన చేస్తున్నారు. నేను అడిగాను "స్వామీజీ! మీరు అడవిలో ఉండి నిత్యాగ్నిహోత్రము, మంత్రజపము చేస్తే ప్రపంచం బాగుపడుతుందా అని. దానికి స్వామీజీ "నాదేహం ఉన్నది అరణ్యంలో, నా మనస్సు ఉన్నది పరమాత్ముని పాదాలవద్ద, వశిష్ట మహర్షి ఉన్నది అరణ్యంలోనే, సందీపుడు ఉన్న ఆశ్రమము అరణ్యమే. కానీ శ్రీ కృష్ణునికి ఆత్మజ్ఞానం ప్రసాదించాడు. వ్యాస మహర్షి గారు ఉన్నది అరణ్యమే. 18 పురాణాలు, 4 వేదాలు, బ్రహ్మసూత్రాలు అందించాడు. చరక మహర్షి ఉన్నది కేదార్ నాథ్ అరణ్యంలోనే కానీ చరక శాస్త్రాన్ని అందించాడు. పతంజలి మహర్షి ఉన్నది రుద్ర ప్రయాగ లోని అరణ్యంలోనే, ఈరోజు ప్రపంచాన్ని మొత్తం యోగాను స్వీకరించి యోగా శాస్త్రాన్ని అంగీకరిస్తుంది. ఇప్పటికి నేను ఎన్నో కాలేజీలలో, ఎన్నో ప్రదేశాలలో ఉపన్యాసం ఇచ్చాను. ఇప్పుడు నేను చేసే ఈ గాయత్రి పురశ్చరణ ప్రపంచానికి ఎలా మంచి జరుగుతుందో అని మీరు అడగవచ్చు. నేను నిత్యము చేసే యజ్ఞము వల్ల కొన్ని వందల టన్నుల ప్రాణవాయువు ఉత్పత్తి అవుతుంది. నేను నిత్యం వెలిగించే ధునివల్ల కూడా ప్రాణ వాయువు ఉత్పత్తి అవుతుంది. నేను నిత్యము చేసే జపం వల్ల ప్రకృతి శాంతిస్తుంది.

ఎన్నో రోడ్డు ప్రమాదాలు జరిగి ఈ నేల రక్తంతో తడుస్తున్నది. ఎంతో మంది అమ్మాయిల ఆత్మఘోషతో ఈ ప్రకృతి బాధ పడుతోంది. బలవన్మ రణాలతో ఈ మధ్య కాలంలో ప్రేమ పేరుతో అమ్మాయిలను వేధిస్తుంటే వారు పడే బాధతో, బలత్కారంగా జరిగే అత్యాచారాలతో ఈ ప్రకృతి ఎంతో క్షోభిస్తుంది. అలా క్షోభించే ఈ ప్రకృతిని ప్రతి రోజు ఏడు వేల గాయత్రీ మంత్ర జపం చేసి నిత్యము యజ్ఞం చేసి అఖండ ధుని అగ్ని సాక్షిగా "ఓం దేవో శాంతి: అంతరిక్షకం శాంతిః అని నేను చేసిన యజ్ఞం, నేను చేసిన జపము ప్రకృతికి ధారపోసి "శాంతించు ప్రకృతి మాతా శాంతించు" అని నేను వేడుకుంటే ప్రకృతి కొంతలో కొంతైనా శాంతిస్తుంది. కాబట్టి ఈ విధంగా నా యజ్ఞం వలన, నా జపం వలన ప్రకృతికి మేలు కలుగుతుంది. అదే విధంగా చాలామంది మానవులు వారి జీవితంలో తెలిసో తెలియకో ఎన్నో తప్పులను చేసే ఉంటారు. తెలిసీ

తెలియక తప్పులు జరిగే ఉంటాయి. అలా నావద్దకు కొందరు వచ్చారు. 'స్వామిజీ నావల్ల కొన్ని తప్పులు జరిగాయి, ఇప్పుడు నేను మంచిగా బతకాలి అనుకుంటున్నాను, నేను చేసిన పాపాలు నా కుటుంబానికి తగల కూడదు అని చాలామంది నావద్దకు వచ్చారు. అలాంటి వారికి నేను ధర్మం అంటే ఏమిటి? అధర్మం అంటే ఏమిటి? అని వివరించి అహంకారంతో కూడుకున్న జీవితం ఎలా ఉంటుంది అని వారికి నేను వివరించాను. ఈ రోజు అలా బాధ్యతగా చాలామంది ఉన్నారు. అంతేగాక భారతీయ ధర్మాన్ని కాపాడాలనే ఉద్దేశ్యంతో రచనలు పుస్తకరూపంలో మీకు అందించాను. అంతే కాక మన ధర్మం మీద సందేహాలు ఉన్నవాళ్ళు భక్తి మీద సందేహం ఉన్న వాళ్ళు నావద్దకు వస్తుంటారు. వారికి ధర్మాన్ని కాపాడుకునే విధానాన్ని, భక్తిని పెంచుకునే విధానాన్ని బాధ్యతతో బ్రతకండి అని బోధిస్తాను. ఈరోజు యువత సెల్ ఫోన్లు చేతిలో పట్టుకొని అశ్లీల చిత్రాలు చూస్తూ మత్తుకి బానిసలవుతున్నారు. రౌడీయిజమే హీరోయిజం అనుకుంటారు. అలాంటి ఎంతోమంది యువతకి జ్ఞానమార్గం బోధిస్తున్నాను. వారిని ధర్మమైన మార్గములో నడిపించే ప్రయత్నం చేస్తున్నాను.

## గాయత్రి మాహాపురశ్చరణ ఇంకా ఎవరైనా చేశారా?

గాయత్రీ మహాపురర్చణ అనేది శ్రీ దేవీ భాగవతం 11 వ అధ్యాయం లో ఉంది. గాయత్రీ మహాపురశ్చరణ గతంలో కరువు కాలం వచ్చినప్పుడు గౌతమీ మహర్షిగారు చేశారు. గౌతమి మహర్షి పురశ్చరణ ప్రారంభించిన సంవత్సరానికే వర్షాలు పడి ప్రకృతి సహకరించి దేశం సస్యశ్యామలం అయింది. ఆ దేశము జనక మహారాజు దేశము మరియు విశ్వామిత్రుడు 32 లక్షల గాయత్రీ మంత్రాలతో గాయత్రీ మహా పురశ్చరణ చేశాడు. సృష్టికి ప్రతిసృష్టి సృష్టించాడు. ఆ విశ్వామిత్రుడే శ్రీరామునికి అండగా నిలబడ్డాడు. ఆ శ్రీరామునిదే రామరాజ్యం. ఈ మధ్య కాలంలో వేదమూర్తి, తపోనిష్ఠ, యుగ ద్రష్ట పండిత శ్రీరామశర్మ ఆచార్య వారు శాంతికుంజ్ హరిద్వార్ ఆశ్రమము స్థాపించి ఈ గాయత్రి మహాపురశ్చరణ చేశారు. ఇప్పుడు దక్షిణ భారతంలో విజయవాడ నగర దగ్గరలో మన స్వామీజీ గాయత్రీ మహాపురశ్చరణ చేస్తున్నారు.

# 12. మంత్ర రహస్యం

నేను స్వామీజీని అడిగాను "ఇన్ని మంత్రాలు ఉండగా మీరు గాయత్రి మంత్రంతోనే మహా పురశ్చరణ ఎందుకు చేస్తున్నారు, చాలామంది అన్నారు గాయత్రి మంత్రం ఎవరు పడితే వారు చదువకూడదు అని అలాంటిది మీరు గాయత్రీ మంత్రంతోనే పురశ్చరణ చేస్తున్నారు. అసలు గాయత్రి మంత్రం రహస్యం ఏమిటి?' అర్థం చెప్పండి స్వామీ!

**స్వామీజీ జవాబు:**

గాయత్రీ మంత్రాన్ని అర్థం చేసుకున్నట్లయితే తన ఆత్మ సాక్షాత్కారం పొందవచ్చు. ఎందుకంటే 'గాయి' అనే సంస్కృత పదాన్ని తెలుగులోకి అనువాదం చేస్తే దాని అర్థం 'ప్రాణం' అని వస్తుంది. అంటే ప్రాణ స్వరూపమైన మంత్రం అని అర్థం. ఏ పూజ చేసినా కూడా ప్రాణాయామం చేసేటప్పుడు గాయత్రీ మంత్రాన్ని పలుకుతారు. ప్రాణాయామం అంటే గాలిని లోనికి పీల్చుకోవడం. గాలిని లోనికి పీల్చుకుంటూ గాయత్రీ జపం చేస్తారు. "ఓం భూః ఓం భువః ఓం సువః ఓం జనః ఓం తపః ఓం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి! ధియోయోనః ప్రచోయదయాత్! ఓం ఆపో జ్యోతీరసో మంత్రం బ్రహ్మ భూర్భువస్సువరోమ్" అనే గాయత్రీ మంత్రాన్ని జపిస్తారు. ఎందుకో తెలుసా ప్రాణవాయువు పీల్చుకునేటప్పుడు ఈ ప్రాణవాయువు మంత్రమే గాయత్రీ, అందుకని ఈ రెండు కలిపి చేస్తే శరీరంలో ప్రాణశక్తి పెరుగుతుందని చెప్పారు. గాయత్రీ మంత్రం అందరూ జపం చేయవచ్చు. ప్రాణంతో ఉన్న ప్రతి మానవుడు జపించవచ్చు. ప్రాణంతో ఉన్న ప్రతి జీవికి వినిపించవచ్చు. దానిని ప్రాణనాథ మంత్రం అని అంటారు. ఈ గాయత్రీ మంత్రానికి 24 అక్షరాలు ఉంటాయి. ఈ సృష్టి మొత్తం పంచ భూతాలతో 24 తత్వాలతో నిర్మాణం జరిగింది. ఈ సృష్టిని బ్రహ్మాండం అని అంటారు. అదే మాదిరిగా ఈ శరీరం కూడా పంచ భూతాలతో నిర్మాణం జరిగింది. అదే మాదిరిగా గాయత్రీ మంత్రం కూడా 24 అక్షరాల నిర్మాణం జరిగింది. అందుకే గాయత్రీ మంత్రాన్ని ప్రాణ స్వరూప మంత్రం అని అన్నారు. అలా ఈ శరీరాన్ని నడిపించేది కూడా ప్రాణశక్తి అని అన్నారు. అలాగే ఈ సృష్టిని నడిపించేది పరమాత్ముని శక్తి అని అన్నారు. పరమాత్ముడే నిరాకారంలో

ప్రాణ స్వరూపంలో ఉన్నాడు. అందుకే గాయత్రీ మంత్రాన్ని ప్రాణ రూపమని అంటారు. పరమాత్ముడు నిరాకారంలో ప్రాణ రూపంలో ఉన్నారు. అందుకే గాయత్రీ మంత్రాన్ని ప్రాణరూపం అని అంటారు. మీకు పూర్తిగా వివరిస్తాను. అసలు ఈ సృష్టి ఏమిటి? ఈ పంచ భూతాలకు ఎన్ని తత్వాలు ఉన్నాయి, ఈ మానవ శరీరానికి ఎన్ని తత్వాలు ఉన్నాయి. గాయత్రి మంత్రానికి, ఈ సృష్టికి, మానవ శరీరానికి సంబంధం ఏమిటి? మీకు పూర్తిగా వివరిస్తాను. ఈ పంచ భూతాలతో ఈ సృష్టి నిర్మాణం అయింది. అదే పంచభూతాలతో మానవ శరీర నిర్మితమైంది. పంచ భూతాలకు 24 తత్వాలు ఉన్నాయి. మానవ శరీరానికి కూడా 24 తత్వాలు ఉన్నాయి. గాయత్రి మంత్రానికి 24 అక్షరాలు ఉన్నాయి. గాయత్రి మంత్రాన్ని ప్రాణరూపం అని అంటారు. ఈ మానవ శరీరాన్ని నడిపిస్తున్నది ఆత్మ అని అంటారు. మరియు ప్రాణశక్తి అనికూడా అంటారు. ఈ సృష్టిని నడిపిస్తుంది పరమాత్ముడు అని అంటారు లేదా విశ్వశక్తి అని అంటారు. అసలు ఈ పంచ భూతాలు ఎలా ఉద్భవించాయి మీకు పూర్తిగా వివరిస్తాను.

కపిల మహర్షి గారు రచించిన సంఖ్యా శాస్త్రంలో ఈ విధంగా వివరించారు. 1) మొదట ఆకాశం ఉద్భవించింది. ఈ ఆకాశానికి ఉన్న తత్వాలను అంతఃకరణ చతుర్ధి అంటారు. ఈ ఆకాశం నుంచి ఉద్భవించినవి 1) మనస్సు 2) బుద్ధి 3) చిత్తం 4) అహంకారం ఈ నాలుగు ఆకాశ తత్వాలు. ఆకాశానికి అతీతమైన ఇంకో శక్తి ఉంది. ఆ శక్తి పేరే "జ్ఞాతా" ఈ జ్ఞాతా ఆకాశ సగ భాగం నుండి ఉద్భవించింది అని కొంతమంది యోగులు వాదించారు. ఏది ఏమైనా జ్ఞాత అనే శక్తి ఉంది. ఈ జ్ఞాత అనే పదానికి అర్థం గ్రహించేది. ఈ పంచ భూతాలను గ్రహించేది అని చెప్పవచ్చు. అంటే ఈ జ్ఞాత అనేది నిరాకార రూపంలో పంచభూతాలను గ్రహిస్తూ సమన్వయంగా నడిపిస్తుంది. ఈ జ్ఞాతను మనము పరమాత్ముడు అని అంటున్నాము.

**పంచప్రాణాలు:**

**వాయువు:** ఈ వాయువులో మొదట 'వ్యాన' వాయువు ఉద్భవించింది. ఆ తర్వాత ఉదాన వాయువు, ప్రాణవాయువు, అపాన వాయువు, సమాన వాయువు, ఈ వాయువులను పంచ ప్రాణాలు అంటారు.

**జ్ఞానేంద్రియాలు:**

**అగ్ని:-** అగ్ని నుండి జ్ఞానేంద్రియములు ఉద్భవించాయి. 1) నేత్రం 2). చర్మం 3). నాలుక (నీరు) 4). చెవి 5) ముక్కు, వీటిని జ్ఞానేంద్రియములు అంటారు.

**పంచ తన్మాత్రలు:**

**నీరు:-** నీటి నుండి పంచ తన్మాత్రలు ఉద్భవించాయి. 1). రసం 2). శబ్దం 3) స్పర్శ 4) రూప 5) గంధ వీటిని పంచ తన్మాత్రలు అంటారు.

**కర్మేంద్రియాలు:**

**భూమి:-** భూమినుండి కర్మేంద్రియాలు ఉద్భవించాయి. 1) గుద స్థానం 2) చేతులు 3). కాళ్ళు 4). వాక్కు 5) జననేంద్రియం, వీటిని కర్మేంద్రియాలు అంటారు.

(జ్ఞాత) ఆకాశము

మనసు | బుద్ధి | చితం | అహంకారం

వాయువు

వ్యాన | ఉదాన | సమాన | ప్రాణ | అపాన

అగ్ని

నేత్రాలు | చర్మం | నాలుక | చెవి | ముక్కు

నీరు

రస | గంధ | శబ్ద | స్పర్శ | రూప

భూమి

జననేంద్రియం | గుదస్థానం | చేతులు | కాళ్ళు | వాక్కు

మొత్తం 24 తత్త్వాలు

పై 24 తత్త్వాలలో మన శరీరం నిర్మితమైనది

మానవ శరీరం ఒక్కటే కాదు 84 లక్షల జీవ రాశులు మొత్తం 24 తత్వాలమీదనే ఆధారపడి ఉన్నాయి. జీవరాశులే కాదు ఈ సృష్టి మొత్తం 24 తత్వాలతో నిర్మాణం జరిగింది. మొదట జ్ఞాత లేదా పరమాత్ముడు . ఆ పరమాత్ముడు నిరాకార రూపంలో ప్రాణరూపంలో సర్వం వ్యాపించి యున్నాడు. మీరు గ్రహించవలసిన విషయం ఏమిటంటే ప్రాణ రూపంలో ఉన్నాడు. ఈ రోజు మనం పిలవబడే గాయత్రి మంత్రాన్ని సంస్కృతంలో 'గాయి' అనే పదం ఉంది. ఆ గాయి అనే పదాన్ని తెలుగులోకి అనువాదం చేస్తే 'ప్రాణం' అని అర్థం వస్తుంది. ఆ గాయి అనే పదం గాయత్రిగా పిలువబడుతూ గాయత్రి మంత్రం అయింది. గురు మంత్రం అని చెప్పే ఒకే ఒక మంత్రం గాయత్రి మంత్రం. వశిష్ఠ మహర్షి వారు శ్రీ రాముడికి యజ్ఞోపవీతం వేశాడు. ఆ యజోపవీతాన్ని గాయత్రి అని కూడా అంటారు. శ్రీకృష్ణునికి కూడా సాందీప మహాముని యజ్ఞోపవీతం వేసి వేద విద్య, నేర్పించాడు. మన పూర్వకాలంలో వేద పాఠశాలలు ఉండేవి. వేద పాఠశాలలకు వెళ్ళి ప్రతి విద్యార్థికి యజోపవీతం వేసి విద్యారంభం చేసేవారు. అంత పవిత్రమైన మంత్రం "గాయత్రి మంత్రం". ఈ మంత్రాన్ని ప్రాణ మంత్రం అని చెప్పాను కదా. ఇక్కడ కూడా మీరు గ్రహించాలి ఈ మానవ శరీరాన్ని నడిపించేది కూడా ప్రాణశక్తియే. ఈ ప్రాణశక్తిని ఆత్మ అని కూడా అంటారు. ఈ ఆత్మను తెలుసుకోవడమే 'అహం బ్రహ్మాస్మి' అని అంటారు. ఆ అహం బ్రహ్మ అనే పదం మనకు ఉపనిషత్తులలో కనిపిస్తుంది. అహం బ్రహ్మాస్మి 'నేనే బ్రహ్మను అని అర్థం. బ్రహ్మ అనగా ప్రాణశక్తి అని అర్థం. ఈ ఉపనిషత్తులను అర్థం చేసుకున్నట్లయితే గాయత్రి మంత్రం పూర్తిగా అర్థం అవుతుంది. ఉదా: ఈ శావాసోపనిషత్తులో ఒక మంత్రం చెపుతాను.

**"ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ**
**యద భద్రం తన్న ఆ సువ"**

అంటే ఆ విశ్వం మొత్తం నిండి ఉన్న 'ఓదేవ' అని అర్థం. నేను ఇందాక చెప్పా కదా 'ప్రాణరూపం' ఆ ప్రాణరూపమే ఈ విశ్వం అంతా నిండి ఉన్నది. ఈ విశ్వం నిండి ఉన్న ప్రాణశక్తిని 'ఓం విశ్వాని దేవ' అని ఈశావాశ ఉపనిషత్తులో పిలవడం జరుగుతుంది. గాయత్రి మంత్రాన్ని మనం అర్థం చేసుకున్నట్లయితే ఉపనిషత్తులు అర్థం అవుతాయి. సాధకుడు దేనికోసం అయితే సాధన చేస్తున్నాడో, ఏది తెలిస్తే సర్వం తెలియ బడుతుందో, ఏది తెలిస్తే ఇంకా తెలుసుకోవలసినది లేదో ఉపనిషత్తులు ఆ జ్ఞానం బోధిస్తుంది, ఆ జ్ఞానాన్ని గాయత్రి మంత్రం అందిస్తుంది. అందుకే గాయత్రి మంత్రాన్ని 'గురు' మంత్రం అని అంటారు.




వినాశనానికి దారితీసే ఈ బాహ్య ప్రపంచం గురించి మితంగా చూడు. మితంగా విను. మితంగా రుచి చూడు. మితంగా స్పర్శించు. మితంగా మాట్లాడు. అనంత ఆనంద లోకాలను చేర్చు అంతఃప్రపంచము గురించి అతిగా చూడు. అతిగా విను. అతిగా రుచి చూడు, అతిగా మాట్లాడు. ఇప్పుడే వేడుకో, వేడుకొనుట వాయిదా వేయకు. ఎప్పుడూ మృత్యువు కబళిస్తుందో ఎవరికి తెలుసు!

సద్గురు అనే గర్భ కోశం, భక్తుని ప్రతిజన్మలోనూ రక్షిస్తుంది. ఈ ప్రాపంచికానందాల వైపు శ్రద్ధ చూపకండి. నీ గురువు యొక్క దీవెనలు, నీ మార్గంలో సదా వెలుగులు నింపుతాయి.

ఒక మేధావితో గంట కాలక్షేపం వంద పుస్తకాలు చదివిన దానితో సమానం. ఒక సద్గురువుతో గంట కాలక్షేపం, వంద పుణ్య క్షేత్రాల సందర్శనంతో సమానం.



సుగుణానంద స్వామి వారి గురువుగారైన
పూజ్య గురుదేవులు ధీరేందర్ బాబా వారు



పవిత్ర హిమాలయాలలో ఉద్భవించి, చివరకు ఎందుకూ పనికిరాని, ఉప్పు నీళ్ళలో కలుస్తూ తన ఉనికిని కోల్పోతుంది పవిత్రమైన గంగానది. కానీ పుట్టినది మొదలు ఎన్నో కొండలు, కోనలు, లోయలు ఆలంబన చేసుకొని, ప్రకృతి రమణీయతను చూపిస్తూ మానవులు జీవనం సాగించుటకు వ్యవసాయానికి నీరందిస్తూ, పశుపక్షాదులతో పాటు మానవులకు, కోటి జీవరాశుల దాహార్తి తీరుస్తూ, దైవమునకు అభిషేకించిన పిదప తీర్థముగా, పారేటప్పుడు ఎన్నో ఓషధులను కలుపుకుంటూ సర్వరోగహరంగా గంగాజల పావనంబని భగీరథుని సాక్షిగా భారతావనికి మోక్షం ప్రసాదిస్తుంది పవిత్ర గంగానది. అదే లాగున ప్రతి మానవుడు ఈ పవిత్ర భారతావనిలో జన్మనెత్తిన మొదలు మరణమునకు చేరువవుతున్న ఈ మధ్య కాలంలో ప్రకృతి కోసం, ప్రపంచం కోసం ఏమి చేస్తున్నారో ఆలోచించి సద్గురువు ఆశ్రయం పొంది, మోక్షమార్గం వైపు అడుగుల వేస్తారని ఆశిస్తూ...



ఏ వర్గమునకు చెందిన మహానుభావుడైనా తన దేశం కోసం మాత్రమే కాదు, ఈ విశ్వం కోసం త్యాగం చేయాలి. యోగ దీనికి మినహాయింపు కాదు. ఈ మహత్తర కార్యాలను సద్గురువులు విశ్వధర్మం మరియు పవిత్రమైన మాతృభూమికి సేవ చేయడానికి నీవంకితమయ్యేలా ఆశీర్వదిస్తారు.

**ఓం శాంతి శాంతి శాంతిః**





జగిత్యాల వాస్తవ్యులు

శ్రీమాన్ **యంసాని రామయ్య** గారు

శ్రీమాన్ **యంసాని ఆంజనేయులు** గారు

ప్రేమతో... **ప్రదీప్**, యు.ఎస్.ఎ.

ప్రశ్న : మానవుడు తన ఉనికిని మర్చిపోకూడదు అంటే ఏమి చేయాలి?

జవాబు : మానవుడు తన ఉనికిని మర్చిపోకూడదు అంటే మానవుడు చేయవలసిన సాధన ప్రతిరోజు ఉదయం లేవగానే తన మరణాన్ని తాను చూసుకోవాలి. అలా చూచుకున్నట్లయితే ఈ మానవ జీవితము శాశ్వతము కాదు అని తెలుస్తుంది. ఎపుడయితే శాశ్వతం కాదని తెలుస్తుందో అపుడు ఆశలు పెంచుకోరు. తను అద్భుతాలు సృష్టించలేకపోయినా సన్మార్గములో జీవించగలుగుతారు.

